SRI K. VENKATA RAO;—

లాంధ్రకు అనుకూలంగా మాట్లాడారు. పోనీ మిగిలినపార్టీలనన్నీ అవతలపెట్టుదాము ఒక్క కాంగ్రెసే తీసుకున్నప్పటికి తెలంగాణానుంచి వచ్చిన కాంగ్రెస్ శాసన సభ్యులు మాట్లాడిన వారిలో హెచ్చుమంది మెజారిటీ విశాలాంధ్రకే అనుకూలంగా మాట్లాడారు.

ఇటువంటి విశ్వాశాన్ని చూరగొన్నటువంటి రామకృష్ణరావుగారి మాట, 196 మంది శాసన సభ్యులకు అసంఖ్యానీకమైనటువంటి, ఆంధ్ర ప్రజానీకానికి నాయకుడై నటువంటి బెజవాడ గోపాలరెడ్డిగారి యొక్క వాక్యం రెండింటిని మోసపుచ్చడానికి యేవిధమైనటువంటి అవకాశంలేదు, అని నేను మనవి చేస్తున్నాను. కృష్ణ గోదావరి నదులు పరుగెత్తుకుని వెళ్లి సముద్రంలో కలుస్తున్నాయి. ఒక్క నాగార్జున సాగరానికే చెప్పారు యెన్నాళ్లో .కృషి చేయవలసివచ్చిందని. ఇంకగోదావరిమీద ప్రాజెక్టు మన మనుమలకు వస్తుందో మనకు వస్తుందో తెలియదు. దానికి కృషి యెన్నాళ్లు చెయ్యాలో తెలియదు. రామపాదసాగరం కట్టదామనుకొన్నాము. 58 లక్షల రూపాయలు investigation కు ఖర్చుఅయింది. సావేజీ మొదలైన పెద్దపెద్ద యింజనీర్లువచ్చి అస్థలం ప్రాజెక్టుకు పనికివస్తుందన్నారు. ఐతే డబ్బు లేదనుకోని యిప్పారు దగ్గరకు వెళ్ళాము. ఇప్పారుదగ్గరకూడా 48 కోట్లు 50 కోట్లు అవ డానికి సిద్ధంగా వున్నది. ఏక్కడ వస్తుందిరాడబ్బు అనుకుంటే దేవుడేమో యిచ్చంపల్లి చూపెట్టాడు. ఇచ్చంపల్లి హైదరాబాదులోవుంది. ఇచ్చంపల్లిలో కనుక డాము కట్టినట్లయితే తక్కువ ఖరీదులో అవడమేకాకుండా 122 కోట్లు ఖర్చు పెట్టిన నాగార్జున సాగరంవల్ల యెంత effect వస్తుందో ఈకొద్దికోట్లతో ఖర్చుపెట్టితే దాని effect వస్తుంది. దీనికి తెలంగాణా అభ్యంతిరపెట్టుతుందా? ఇచ్చంపల్లిడామ్ నుంచి మొట్టమొదట నీళ్లు కృష్ణలోకి రావాలి అంటే మొత్తం తెలంగాణాలో వున్నటువంటి అదిలాబాదుజిల్లా మొదలుకొని నల్లగొండజిల్లా చివరకు వచ్చేదాక పడు తుంది కృష్ణాలో ఇంత అభివృద్ది సూచకమైన నదులు వనాలు ఉన్నటువంటి దేశం మనది. S. R. C. వారు తెలంగాణా వారిరాక్షసబొగ్గు, ఆంధ్రయొక్క భోజన పదార్ధాలు కలిపితే ఆంధ్రరాష్ట్రంవంటి సుసంపదగల్గినటువంటి రాష్ట్రం వేరేవుండ దన్నారు. విశాలాంద్ర ఉద్భవిస్తే భారతదేశంలో యిప్పుడేకాదు, ఎప్పటికీ యీ ఆహార ధాన్యాలకొఱత లేకుండా చేస్తావని నేను హామీయిస్తున్నాను. అటు వంటి శక్తి మనకు వున్నది. ఈరోజున 5½ లక్షల టన్నులు యెక్కువ అయినది నాగార్జునసాగరంతోటి చిన్న నదులపై ప్రాజెక్టులతోటి తుంగభద్ర కాలవలతో పుట్టబోయేటటువంటి యిచ్చంపల్లి ప్రాజెక్టుతోటి యెన్నోలక్షల టన్నులు ఆహార ధాన్యాలను మనము ఉత్పత్తి చేయవచ్చును. ఎన్నో ముడిపదార్ధాలు తయారు చేసుకొనవచ్చును. రాక్షసబొగ్గుయొక్క వినియోగం మనంచేసుకొనే పరిశ్రమలు అభివృద్ది చేసుకోవచ్చు ఇది భారతమాత సస్యశ్యామలమని మనం నిరూ

1st February 1956

కావచ్చు. అర్థంచేసుకునేశక్తి వారిలో లోపించివుండవచ్చు, ఈరెండింటిలో ఏదయినా వుండవచ్చు.

కాని యీసమస్యలన్నీ తెలుసుకున్న పెద్దలు దీనినిగురించి ఇంత ఆలస్యము చేయడ మెందుకో నాకు అర్థము కావడము లేదు. వారు శక్తివంతులు, తెలివిమంతులు. అన్నీ న్యాయంగా పరిశీలించగల్గిన తెలివి తేటలువున్న ఆ పెద్దలుకూడా మనము విశాలాంధ్రను ఎందుకు కోరుచున్నాము విశాలాంధ్రను అనేది గుర్తించలేదు. విశాలాంధ్ర ఏర్పడి నట్లయితే మన నదీజలాలన్నింటిని సక్రమంగా ఉపయోగించుకోవచ్చును. క్రిష్ణానదీ జలాన్ని సిద్ధేశ్వరంప్రాజెక్టు కానివ్వండి లేక రేపు గోదావరిపై కట్టబోయే ప్రాజెక్టు కానివ్వండి రెండురాష్ట్రాలు కలిసినపుడే శీఘ్రంగా యీ కార్యక్రమాన్ని సాగించ డానికి వీలు ఔతుందే కాని ప్రత్యేకంగా రెండు రాష్ట్రాలు వున్నంతవరకు ఎన్నో యిబ్బందులకు గురికావలసియున్నది. ఈనాడు ఇక్కడ 4 ఘంటలకు జరుగబోతున్న సమావేశమే ఇందుకు నిదర్శనము. నందికొండ ప్రాజెక్టు కట్టదలచుకున్నాము. నంది కొండ ప్రాజెక్టు విషయములో, ఒకేరాష్ట్రముగావుంటే ప్రతిరోజు దానిని పరిశీలనచేస్తూ ఏదో decision తీసుకోడానికి వీలయ్యేది. ఇప్పుడు రెండురాష్ట్రాలు వుండబట్టి దానికొక ప్రత్యేకమైన Boardను వేయవలసి వచ్చింది. దీనికి ఇద్దరు Chief Ministers- ఒక Chief Ministerగారు ఒకతూరి Chairmanగా ఉండడము ఇంకొక తూరి ఇంకొక Chief Ministerగారు Chairmanగా వుండడము జరుగుతుంది. వాండ్లు రావడము చిన్నవిషయము పెద్దవిషయము పరిశీలన చేయడమువల్ల పనిసాగుటలో ఎంతో యిబ్బంది కల్గుతుంది, మూడునెలలకు పూర్వము నందికొండ బోర్డుమీటింగు నందికొండ డామ్‌సైట్‌లో వేసుకున్నాము. మూడునెలలవరకూ బోర్డు మీటింగు తేది ఏర్పాటు చేసుకోడానికికూడా యిబ్బందులు కల్గుతూవున్నాయి. ఒకరికి అనుకూలంగా వున్నపుడు ఇంకొకరికి అననుకూలము. ఒకరాష్ట్రము ఒప్పుకుంటే రెండవరాష్ట్రము ఒప్పు కోదు. యీలాంటి యిబ్బందులు అనేకమున్నాయి. నదికి రెండుప్రక్కలవున్న ప్రజల యొక్క శ్రేయస్సుకుగాను కట్టుతున్న యీప్రాజెక్టు విషయంలో మీటింగు ఏర్పాటు చేసుకోడానికి ఇన్ని ఇబ్బందులు కల్గుతున్నాయి. మీటింగు ఏర్పాటుచేసినతర్వాత ఏపక్షంలో Buildings కట్టాలి హైదరాబాదుపక్షంలో కట్టాలా లేకపోతే ఆంధ్రలో వుండాలా? ఇక్కడ ఎన్నోలక్షలు ఖర్చుఐంది. అక్కడ ఎన్నోలక్షలు ఖర్చుఐంది. భాగ పరిష్కారమువంతున ఇబ్బందులు కలుగజేసుకోవడమే గాని మరేమి కాదు. కలిసి వుంటే యిలాంటి యిబ్బందు లేవీరావు. అక్కడ కట్టబోయే విజయపురి ఏప్రాంతములో ఏప్రదేశము అనువుగావుంటే ఆప్రదేశములోని అభివృద్ధిచేసుకోడానికి వీలుఔతుంది. అలాంటిపరిస్థితులు కల్పించుకోవాలనే ఆశతోను గోదావరిజిల్లాలన్ని బాగా ఉపయో గించుకోవాలనే ఆశతోను మనము యీ విశాలాంధ్రరాష్ట్రము కావాలని కోరుతూ వున్నాము. ఈమధ్య నేను గోదావరినది, భద్రాచలం, దుమ్ముగూడెమువరకు పోయి వచ్చాను, 100 సంవత్సరములకుపూర్వము దుమ్ముగూడెందగ్గర కాటన్‌దొరగారు కట్టిన ఆనకట్టను చూచాను. ఆ ఆనకట్ట అభివృద్ధిచేసి ఎత్తుపెంచి దానిపైన షట్టర్సు పెట్టి

కాల్వలుత్రవ్వితే ఇర్రిగేషన్‌కు ఏమైనా ఉపయోగపడుతుందా అని మన Chief Engineerగారిని అడిగాను. అది ఇప్పుడు navigationకు మాత్రము ఉపయోగపడుతుంది, Irrigationకు ఉపయోగించనేలేదు దానిని Irrigationకు ఉపయోగించడానికి ఆంధ్రరాష్ట్రములో ఇప్పుడువున్న పరిస్థితులలో వీలులేదు. ఎందుకంటే ఎత్తైయిన కొండలున్నాయి. మన భద్రాచలంప్రక్కన కాబట్టి హైదరాబాద్‌ప్రక్క ఉపయోగించడానికి వీలువుంది. ఎందువల్లనంటే అక్కడ plain grounds కనబడుతున్నాయి. మూడుఅడుగులు ఆనకట్టపెంచి 4-5 అడుగులు అవసరమైతే shutters పెట్టుకొన్న లక్షలఎకరాలకు నీరు తీసుకుపోవడానికి వీలువుంటుందా అంటే నాప్రక్కనేవున్న మన Chief Engineer గారు అవకాశము వుండవచ్చును పరిశీలనచేస్తే అని చెప్పారు. కాని అదొక ప్రత్యేకరాష్ట్రము. అక్కడనుంచి చూడడానికే మాత్రమే వీలవౌతుంది కాని అటుప్రక్కకుపోయి పరిశీలనచేయడానికి ఆంధ్రప్రభుత్వానికి కాని ఆంధ్రప్రభుత్వ ఉద్యోగులకు కాని వీలులేదు. ఆంధ్రదేశము ఇటుప్రక్కది హైదరాబాద్ అటుప్రక్క దేశము అనుకుంటూవుండడము యీరోజులలో ఆశ్చర్యకరముగా కనబడుతుంది. అందులో భారతదేశములోనున్న వివిధభాషలవారికి భాషాప్రయుక్త రాష్ట్రాలు వస్తూవుంటే ఒక్క ఆంధ్రరాష్ట్రానికిమాత్రమే యీలాంటి అసంధిగ్ధమైనపరిస్థితి కలుగడము నాకేమీ అర్థము కాకుండావుంది. కాబట్టి యీనాడు మరీ యీతీర్మానము తేవలసియున్నది. ప్రతిరోజూ ఆంధ్రదేశము పరీక్షిస్తూవుంది. ఇదిగో తీర్మానమువస్తుంది యీరోజు అని ఆంధ్రప్రజలు రేడియోదగ్గర వింటున్నారు. వేలాది లక్షలాదిమంది ఆంధ్రదేశములో ప్రతిరోజు ఉదయము సాయంత్రము రేడియోదగ్గరకూర్చొని నిరుత్సాహముతో పెదవులు విరుచుకొని ఇంకిపోతున్నవిషయం పెదవులశబ్దముకూడా ఢిల్లీప్రభుత్వానికి వినిపించివుంటుంది అనుకుంటాను. వారికికూడా ఇది గుర్తుకువచ్చివుంటుంది అనుకుంటాను. కాని ఆంధ్రలో ఇంత ప్రశాంతమైన వాతావరణము యీ రెండుఏండ్లుగావున్న ప్రశాంతమైన పరిస్థితులను ఢిల్లీప్రభుత్వము గమనించివుంటుంది అనుకుంటాను. ఆంధ్రలో యీ శాంతచిత్తాన్ని ఢిల్లీప్రభుత్వము గమనించి త్వరగా ఇతరరాష్ట్రాలతో మనరాష్ట్రాన్నికూడా భాషాప్రయుక్త రాష్ట్రంగా యివ్వడానికి తోడ్పడుతారని అనుకుంటున్నాను. కాని యీ మధ్య 7-8 రోజులుగా యీ ఉద్రేకమైన పరిస్థితులు ఆంధ్రదేశంలో కలిగినాయి. నేను శ్రీకాకుళము మొదలు ఇక్కడ కర్నూల్ వరకూ వచ్చేటప్పుడు చూచాను. ప్రతివూరిలో Hartals ప్రతి Collegeలో schoolsలో strickes ప్రశాంతంగా జరిపినారు. నిజమే, కాని ఎందుకు ఈ అవసరమువచ్చింది. హార్టాల్స్ జరుపవలసినప్రశ్న కాదిది. పిల్లవాండ్లు schoolsకు పోకుండా ఉద్రేకపడవలసిన సమస్యకూడా కాదు ఇది. కొద్దిగా ఆలస్యమైనకారణంచేత యిలాంటిపరిస్థితులు కల్గుతున్నాయి. ఇప్పటికైనా ఢిల్లీ ప్రభుత్వము గమనించి ప్రజలకోర్కెను, 2 కోట్లు 10 లక్షల ఆంధ్రులు ఏకగ్రీవముగా కోరిన కోర్కెను ఎందుకు ఆలస్యము చేయవలసివచ్చిందో తెలియదు. ఇందులో పార్టీ విభేధాలులేవు. ఇక కులమత భేధాలులేవు ఇందులో స్త్రీపురుష విభేధాలులేవు ఇందులో హైదరాబాద్ అసెంబ్లీలో హైదరాబాద్ ప్రజలుఅంతా వ్యతిరేకముగావున్నారనే

**1st February 56**

సమస్య ఒకటి లేవదీసివున్నారు. కొందరు ఇక్కడకురావడము, హైదరాబాద్‌లో అంతా వ్యతిరేకమని ఢిల్లీకి reports పంపడములేకపోతే హైదరాబాద్‌లో మాట్లాడే తెలుగువేరు ఆంధ్రలోమాట్లాడే తెలుగువేరు అని చెప్పడముకూడా విన్నాను. తెలుగు రానివాండ్లు యీవిషయము చెప్పడము మరీ హాశ్యాస్పదముగా కనిపించినది. కాని అది మనమంత గమనించవలసినవిషయం కాదేమో అనుకుంటాను. ఎవరోవచ్చి ఎవరికో reports వ్రాయడం ఎవరు ఎవరికివ్రాశారో నాకు తెలియదు. అటువంటి రిపోర్టులు ఎవరైనా వ్రాసివుంటే వాటిని మనము ignore చేయాలని కోరుతున్నాను. ఢిల్లీ ప్రభుత్వముకూడా వాటిని ignore చేస్తుందనే అనుకుంటున్నాను. అది మనకుముఖ్యము కాదు. అందులో చాలామంది సభ్యులు విశాలాంధ్రరాష్ట్రము కావాలని చెప్పారు. 100-70 మంది విశాలాంధ్రరాష్ట్రము కావాలని చెప్పారు. వారిఅభిప్రాయము ప్రజాభిప్రాయము కాకపోతే ప్రజాభిప్రాయము సేకరించడానికి మార్గమేమి? శాసనసభ్యులు ప్రజాభిప్రాయాన్ని వెల్లడించకపోతే ప్రజాభిప్రాయాన్ని వెల్లడించే సంస్థఏది? ఈనాడు హైదరాబాద్ శాసనసభ్యులు ఆసమస్యపై ఎన్నుకోబడలేదు కాబట్టి వారికి ఆసమస్యపై చర్చించడానికి హక్కులేదని తెలంగాణావాదులు అంటున్నారు. అలాంటపుడు ఢిల్లీ పార్లమెంటువారికి యీ Statesను re-organize చేయడానికి హక్కు ఎక్కడ ఉందని అడుగుతున్నాను. ఢిల్లీ పార్లమెంటు యీసమస్యపై ఎన్నుకోబడిందా? ఈ సమస్యపై ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసినారా? స్వరాజ్యాన్ని సంపాదించిననాడు Constituet Assembly ఏర్పాటు చేసినారు. నేనుకూడా సభ్యుడుగావున్నాను. నన్ను Constitut Assmbly సభ్యుడుగా వుండమని ప్రజలుచెప్పలేదు ఆనాడు. ఢిల్లీ ప్రభుత్వ పెద్దలున్నారక్కడవారి అభిప్రాయము మాకుతెలుసు, వారి అభిప్రాయము బహిరంగముగా చెప్పినారు. ఎక్కడాదాచుకోలేదు జవహర్‌లాల్ నెహ్రూగారు గుంటూరులో చెప్పారు. విశాలాంధ్రరావడం చాలమంచిదని, తెలంగాణావారు వీరుకలసి సత్యముగా ఆలోచించి న్యాయంగా చర్చించుకొంటే చాలమంచిదని గుంటూర్ బహిరంగసభలో లక్షలాది ప్రజానీకము ఎదుట నెహ్రూగారు చెప్పారు. S. R. C. వారు ప్రత్యేక తెలంగాణాను 4 ఏండ్లపాటు వుంచమని చెప్తూతూ విశాలాంధ్రరాష్ట్రము ఏర్పాటైతే తెలుగుప్రజల శ్రేయస్సుకు మంచిదని విశదపరచారు. మొన్న పార్లమెంటులో విశాలాంధ్రరాష్ట్రము ఏర్పాటుచేయడం మంచిదని పంతుగారు చెప్పారు. దేబార్‌గారూ పత్రికలలోను ఉపన్యాసాలలోను చెప్పడముకూడా నేను విన్నాను. ఎందుకీ ఆలస్యము? అందరూ అంటున్నపుడు యీ ఆలస్యమెందుకో నాకు అర్థముకావడములేదు. యీ ఆలస్యము విషమ పరిస్థితులకు దారతీయవచ్చును. ప్రభుత్వములోవున్న మాకు యీ యిబ్బందులు కనబడుతున్నాయి. ఇక్కడ విశాలాంధ్ర రాష్ట్రముయొక్క సమస్య ప్రజలహృదయాలలో బాగా చొచ్చుకపోయిందని అందరకుతెలుసు, ఎవరైనా ఉద్రేకపూరితులైతే ఎన్నో ఇబ్బందులకు ప్రజలు ప్రభుత్వము అందరుకూడా ఇబ్బందులకు గురివావలసివస్తుంది. ఈ విషయాన్ని కేంద్ర ప్రభుత్వాలకు అందజేశాము. ప్రజలందరికీ తెలియజేశాము. ఎవరిదో సంజీవరెడ్డి

1st February 1956

అభిప్రాయము కాదు, కళా వెంకటరావుగారి అభిప్రాయము కాదు. లేక వ్యక్తిగతముగా గోపాలరెడ్డిగారి అభిప్రాయము కాకుండా అసెంబ్లీ సభ్యులు అందరూ చేరి ఆంధ్ర రాష్ట్రముయొక్క అభిప్రాయము ఎంత ఉద్రేకంగా, ఉత్సాహంగావుందో తెలియచేయ డానికిగాను యీ తీర్మానము ఇక్కడ తేవడము జరిగింది. దీనిని గమనించి అలస్యము చేయకుండా యీ సమస్యను అతిత్వరగా తేల్చాలని ప్రార్థించడానికి మనము ఇక్కడ చేరాము. కాని ఆలస్యమైంది. ఆంధ్ర ప్రజానీకానికి విజ్ఞప్తిచేస్తున్నాను. కొద్దిగా ఆల స్యము ఔతుందేమో, ప్రత్యేకమైనకారణాలు వుండవచ్చును. నేనుచెప్పిన కారణాలు కాక ఏవో ప్రత్యేకమైనకారణాలు వుండవచ్చును. కాని నాకుమాత్రము ఒక ధృఢవిశ్వా సము ఉన్నది. విశాలాంధ్రరాష్ట్రము మంచిదని మన పెద్దలుకూడా అంగీకరించారు. బహిరంగముగా అంగీకరించారు. రహస్యముగా కాదు. నేను అక్కడికి పోయినప్పుడు చెప్పడముకాదు. బహిరంగసలో అంగీకరించారు. కాబట్టి విశాలాంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటుచేస్తారనే విశ్వాసము మనకుకలిగింది. కాబట్టి యింతవరకూ విశాలాంధ్ర రాష్ట్రాన్నిగురించి మీటింగులుకూడా ఎక్కడా జరుపలేదు. ఆంధ్రులంతా కూడా విశాలాంధ్రరాష్ట్రమునుగురించి announcement వస్తుంది, ఇది అందరూ అంగీకరిం చినవిషయమే అని ఉత్సాహతో వుండినారు. ఇప్పటికీవున్నారు. కొంచెము అనుమా నము తోచినతర్వాతనే సభలుపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. పెట్టుతున్నారు. Strikes కాని లేదా Hartals గాని జరుపడము యీకొంచెము అనుమానము కలిగినతర్వాతనే జరిగింది. కాని అనుమానము కలిగినాసరే ఉద్రేకపడవద్దని మాత్రము ప్రజానీకానికి విజ్ఞప్తిచేస్తున్నాను. నేను ప్రతిమీటింగులోను ఈవిషయం చెప్పుతూవచ్చాను. విశాఖ పట్టణము మొదలుకొని కర్నూల్ వరకు జరిగిన మీటింగులలో ఉద్రేకపడవద్దని చెప్పాను యువకులకు దేశములోని ప్రజానీకము ఉద్రేకపడడమువల్ల విశాలాంధ్రయొక్క బలము మరీ తగ్గిపోతుంది. అందువల్ల మనకేసును మనము బలపర్చడములేదు.

కేంద్రప్రభుత్వంవారికి మనయొక్క అభిప్రాయం తెలియచెయ్యడం అత్యవసరం. మీరు మీటింగులు పెట్టండి, లక్షలాది ప్రజానీకం చేరండి. మాకు విశాలాంధ్రరాష్ట్రం కావాలని తెలియచెయ్యండి పెద్దలకు. పైవారికి, కానీ అంతకుమించి యింకేదైనా ప్రమాదకరమైన పరిస్థితులు మాత్రం తేవద్దని నేను ప్రజానీకానికి విజ్ఞప్తిచేస్తున్నాను. దానివల్ల మన విశాలాంధ్ర సమస్య దగ్గరకురాదు. రానున్న విశాలాంధ్ర రాష్ట్రంలో తెలంగాణావారు మనము కలసి వుండడానికి సరిఅయిన పరిస్థితులు, పరిసరాలు కల్పిం చినవాళ్లు కాము. కాబట్టి వుద్రేకమైన పరిస్థితులకు లోనుకాకుండా అందరము మన దీక్షను, మన పట్టుదలను విశాలాంధ్రరాష్ట్రం మాకు కావాలి. అదే మా ఆశయం. దీంట్లో అభిప్రాయభేదాలు మాకులేవు. అన్నివర్గాలవారికి, అన్ని రాజకీయ పార్టీల వారికి ఇది విశాలఆంధ్రరాష్ట్రం కావలసిందేఅన్న అభిప్రాయాన్ని వ్యక్తిగతంచేసుకోవ డానికి ప్రశాంతమైన పరిస్థితులలో మన ప్రజా అభిప్రాయాన్ని వెల్లడించడం, పెద్దలకు

అందజేయడం అవసరం. ఇక అక్కడక్కడ రైళ్ళు నిలపడం మొదలైనటువంటివి జరిగినాయి అని తెలిసింది నాకు. మొన్న గుంటూరునకు పోయిననాడు చీరాలదగ్గర రైలు నిలపడమేకాదు. అక్కడ పోలీసువాండ్లు బెదిరిస్తే అక్కడ రైలుపట్టాలపైన ఒక యినుపపట్టానుకూడా వుంచారని తర్వాత డ్రైవరు కనుక్కోవటంవల్ల ప్రమాదకరమైన ఒక accident తప్పిపోయిందని నాకు ఒక రిపోర్టు వచ్చింది.

అనాడు జనతా Express పోతోంది. సాధారణమైన ప్రజానీకం అంతా ఆడవాళ్ళు, పిల్లవాండ్లు అందరు అందులో వున్నారు. రైలు పడిపోవటమే తటస్థించియుంటే కొన్నివందలమంది ప్రాణాలుపోవడం జరిగియుంటే విశాలాంధ్రరాష్ట్రం ఒక అంగుళం దగ్గరకి వచ్చేదా అలోచించమని అలాంటి వ్యక్తులకు నేను మనవిచేస్తున్నాను. నేను కాకినాడలో ఉద్రేకపడవద్దని యువకులకు చెప్పాను. విద్యార్థులకు చెప్పాను. నీవు కలెక్టరు ఆఫీసుకు అగ్గిపెడితే విశాలాంధ్రరాష్ట్రం ఒక అంగుళం ముందుకు వస్తుందా? యెవరిది కలెక్టరుఆఫీసు? కలెక్టరుదా? మంత్రిదా? ఇది నీది, నాది, దేశములోని ప్రజానీకానిది అలాంటి పనులు చేయడంవల్ల నీవు దేశానికి తీరని నష్టం కల్గిస్తున్నావు. చెడుపు కల్గిస్తున్నావు. కాబట్టి జాగ్రత అని నేను అక్కడ హెచ్చరించాను. అలాంటివికల్గకుండా అందరమూ, అన్నిపార్టీలవారుతీవ్రమైనకృషిచేయాలి. విశాలాంధ్ర రాష్ట్రానికిగాను మనం ప్రయత్నించవలసిన పద్ధతులు చాలా వున్నాయి. అంత కృషి అవసరంలేకుండానే వస్తుందని అనుకుంటాను. అవసరంఅయితే ప్రజాభిప్రాయాన్ని వ్యక్తం చేయడానికి, ఢిల్లీలోవున్న పెద్దలకు తెలియజేయడానికి లక్షలాది మంది సమావేశాలుజరపడం, అక్కడవున్న పెద్దలనుతీసుకొనిరావడం, ప్రజాభిప్రాయం యేరకంగా వుందో, యెంతతీవ్రంగావుందో నిరూపించడం, చూపడం అసెంబ్లీలద్వారా, యింకా జిల్లాబోర్డులద్వారా, మునిసిపాలిటీలద్వారా మొదలైన చోట తీర్మానాలు టెలిగ్రాములు, మీటింగులు, హర్తాల్సు వీటిద్వారా మన వాంఛ తెలియజేయవచ్చునే కాని, అఘాయిత్యాలకుపూనుకోవడం మంచిదికాదు. Non-Violence గా ఉన్నంతసేపు మన కార్యక్రమము జయప్రదం అవుతుంది. ఆ సిద్ధాంతాన్ని మాత్రం మరిచిపోవద్దని ఆంధ్రదేశములోని 210 లక్షల ప్రజానీకానికి రాజకీయ పార్టీలందరికీ చెప్పుతున్నాను. ఇక యింత ప్రశాంతంగావున్న ఆంధ్రులయొక్క ఓర్పును పరీక్షకుమాత్రం పెట్టవద్దని పెద్దలకు మరీ చెప్పుతున్నాను. ఎంత మంచితనాన్నో అలవరచుకొన్నాం. ఎంతో Agitation కు అలవాటుపడ్డ ఆంధ్రులం. కానీ Agitation నే అవసరం లేకుండా పెద్దలపైన సంపూర్ణమైన విశ్వాసంతో, ఢిల్లీ ప్రభుత్వంపైని విశ్వాసంతో నిరీక్షిస్తూవున్నాము. ఈ నిరీక్షించడం యెంత విసుగెత్తుతుందో, యెంత యిబ్బందికల్గిస్తుందో దేశంలో మీరు అర్థంచేసుకొని వీలైనంత త్వరలో మీనిర్ణయాన్ని దేశానికి చెప్పండి. నాకు తెలుసు నేను వింటూవున్నాను. ఢిల్లీ ప్రభుత్వం అప్పుడే నిర్ణయం తీసుకొందంటూఉన్నారు. ఇదేమీ రహస్యం కాదంటున్నారు. నిజం అంటున్నారు చూచినవాళ్లు, చెప్పినవాళ్ళు అంతాకూడా. 'ఆ తీసుకొన్న నిర్ణయాన్ని ప్రజ

## RE: FORMATION OF VISALANDHRA

1st February 1956

లకు తెలుపడానికి యెందుకు యింత సంకోచం. యెందుకింత ఆలస్యం. ఏమిటీ యిబ్బంది? నాకు అర్థంకాకుండా వుంది. మీరేదో నిర్ణయం తీసుకొన్నారనీ నెలకుపూర్వమో యెప్పుడో తీసుకొన్నారనీ అంటున్న నిర్ణయాన్ని ప్రజలు సంతోషించేట్టు విజయోత్సాహముతో వేడుకలు చేసుకోవడానికి అవకాశాన్ని త్వరగా కల్పించమని ప్రార్థిస్తూ సభవారందరూ యీతీర్మానాన్ని బలపరచమని కోరుతున్నాను. తీర్మానాన్ని బలపరచి చేసే ఉపన్యాసాలన్నీ అంతా వుద్రేకపూరితముగా వుండకుండా మన విశాలాంధ్ర రాష్ట్రాన్ని త్వరగా సాధించుకోవడానికి అనువైనవిగా చేయాలని ప్రార్థిస్తు యీ తీర్మానాన్ని అందరు యేకగ్రీవముగా ప్యాసుచేయమని కోరుతున్నాను. (కరతాళ ధ్వనులు)

బళ్ళారి సమస్యనుగురించి యిందులో కొద్దిగా చెప్పడం మరచిపోయినాను. అది యెంత ముఖ్యమైందో నేను వెనుకటి తీర్మానంపైన అసెంబ్లీలో మాట్లాడుతుండినప్పుడు చెప్పినాను. బళ్ళారితాలూకాలు 3 మనం కోరుతున్నామంటే యేదో ఒక ప్రాంతాన్ని ఆశతో మన ఆంధ్రరాష్ట్రాన్ని విశాలంగా చేసుకోవాలని దురుద్దేశముతో కోరినకోరిక కాదు అది. Bellary, Hospet, Siruguppa తాలూకాలు మనకివ్వడంద్వారా Project Head Works మనకువస్తే తుంగభద్రలో వుండే నీటిని సంపూర్ణముగా యీ క్షామప్రదేశంలో అన్ని జిల్లాలకు అనుకూలంగావుండేటట్టు వుపయోగించుకొని కొంతవరకు యీ క్షామాన్ని పారద్రోలడానికి వీలవుతుందన్న ఆశతో అది కోరినాను. ఆంధ్రరాష్ట్రం ఇంతవరకు లేకపోవడంవల్ల ప్రత్యేకమైన ప్రభుత్వం మనకు లేకపోవటం వల్ల యెంతమంది జడ్జీలువచ్చినా మనకు వ్యతిరేకంగా జడ్జిమెంటు ఈయడం జరిగింది. మనం సరిఅయిన సదుపాయాలు కల్గించలేకపోయినాము, వారికి సరిఅయిన facts and figures యివ్వలేకపోయినాం. సరిఅయిన maps యివ్వలేకపోయాం.

కలిసివుండటంవల్ల ఉన్న యిబ్బందులను చెప్పలేకపోయాం. ఆనాడు వెంకటరావుగాని, ప్రకాశంపంతులుగారుగానీ, సంజీవిరెడ్డిగానీ అందరంకూడా వ్యక్తిగతమైన హోదాలోనే పోయాంగానీ అధికారరీత్యా యెవరూ పోలేదు. ఆంధ్రరాష్ట్రంయేర్పడి full bench వచ్చినట్లుగా పెద్దలు ముగ్గురు వచ్చారు. ఫజులాలీ, ఫణిక్కరు, కుంజ్రూలు వారు యెవరికో యెవరో చెప్పితే లొంగి జడ్జిమెంటువ్రాసే పెద్దలుకారు. దేశములోను విదేశాల్లోకూడా న్యాయస్థులనిపించుకొన్న పెద్దలు ముగ్గురువస్తే వారికి మన వాదన చెప్పాము. అప్పుడు మనకొక్క ప్రభుత్వముంది. మనకు ఆఫీసర్లు వున్నారు. మనం అన్నీ యిబ్బందులు చెప్పగలిగాము. ఇప్పుడు జరుగుతూన్న ప్రాజెక్టు యెంత అలస్యమైంది. దానిక్రింద యిరిగేషన్ కాకపోవడానికి కారణాలు యేమిటి? ఇకమీదట కూడా unitary గా యిట్లానేవుంటే ఈ ప్రాజెక్టుకు యెన్ని యిబ్బందులు కలుగుతవి. యెన్నియేండ్లు అవుతుంది. 10 యేండ్లలో సాధించవలసిన యీకార్యక్రమాన్ని రెండు generations కు పైగా అవుతుంది అని నిరూపించి చూపించాము. వారు విశ్వసించదగినట్లుగా facrs and figuresతో prove చేస్తే వారు జడ్జిమెంటు వ్రాశారు.

1st February 56

మూడు తాలూకాలు ఆంధ్రకు యివ్వమని. ఈ 3 తాలూకాలు యివ్వమని వారు జడ్జిమెంటు వ్రాసినా మేము unreasonable గా వుండ కూడదు అన్న కారణంవల్ల న్యాయంగా మన ప్రాజెక్టుకు మాత్రము కావాల్సింది కోరాలనే ఉద్దేశంతో Hospet తాలూకాలో వున్న 18 గ్రామాలు యివ్వమని మన ప్రాజెక్టుకు అవసరంలేని గ్రామాలు మనకు వద్దని చెప్పాము, జవహర్‌లాల్ నెహ్రూగారిక్కడకు వచ్చినప్పుడు. బళ్ళారి తాలూకాలోని కొన్ని గ్రామాలు యీ ప్రాజెక్టుకు సంబంధంలేనివి వద్దని చెప్పాము. ఆ రకంగా modified scheme maps తో సహా వారికి పంపించాము. High level canal కు సంబంధించిన ప్రాంతమును మాత్రమే మాకివ్వమని మేము కోరాము. పెద్దలంతా కూడా హర్షించారు, న్యాయముగా వున్నదనీ. కానీ యెవరో ఆక్షేపిస్తున్నారు. మైసూరువారు యివ్వడానికి వీలులేదంటున్నారు. ఈ నీరు రాయలసీమ ప్రాంతానికే పోవడానికి వీలులేదు. ఈ తుంగభద్రనీరు యీ తుంగభద్ర ప్రాంతంలోనే బళ్ళారి, సిరుగుప్ప తాలూకాల్లోనే వుండాలనిగానీ ఆంధ్ర ప్రాంతానికి పోవడానికి వీల్లేదని యెవరో కొందరు సత్యాగ్రహం చేశారు. కాబట్టి అది కర్నాటక ప్రాంత్యం. కర్నాటకులదే బలం యెక్కువగావుంది. కర్నాటకులకు వుండాలనే కొందరు దురభిప్రాయం పడుతున్నట్లున్నది. 1,000 మంది సత్యాగ్రహం చేసిన దానికి వెనుకటి అభిప్రాయం యెక్కడయినా మారేటట్లువుంటే యిక్కడ ఆంధ్రులు యెన్ని వేలమందో వున్నారు. కాని యీ సత్యాగ్రహాలు మొదలైనవి చెయ్యకూడదని మా విశ్వాసం. ఈనాడు భారత దేశంలో సమస్యలను సమిష్టిగాకూర్చొని ఆలోచించుకొని పరిష్కరించుకోవాలె. అది సాధ్యం కాకపోతే పెద్దల పరిష్కారానికివదలిపెట్టాలి. ఈ విశ్వాసంతో ఆంధ్రరాష్ట్రం యేలాంటి చర్యపుచ్చుకోలేదు. ఇప్పుడే యిన్ని యిబ్బందులు కల్పిస్తున్నారు. కాబట్టి రేపు యీ Head works మనకు లేకపోతే యీ తుంగభద్ర ఎగువ దిగువ కాలువలు రెండుకూడా చాలా యిబ్బందులకు పాలౌతాయన్న వుద్దేశంతో మేము మరిమరి ఒత్తిడిచేశాము. తుదిగా మేము చెప్పాము. ఈ బళ్ళారి ప్రాంతాన్ని, యీ బళ్ళారి ఫిర్కాలును మాకు ప్రాజెక్టుపై సంపూర్ణమైన అధికారులను యివ్వమని యీ మధ్యకూడా Cabinet Resolution చేసి కేంద్రప్రభుత్వం వారికి పంపించాము. బళ్ళారిపట్టణము, బళ్ళారిఫిర్కా, రూపమోపనగుడి ఫిర్కాలు తర్వాత Tungabhadra High Level canal పైన సంపూర్ణమైన అధికారంఉంటే దాన్ని కట్టడానికి కావలసినంత అధికారాన్ని మా కివ్వమని మేము కోరినాము. మన demand ఎంత reasonable గా ఉండాలనో అంతవరకు పోయినాము. అదేమీ కొత్త విషయముకాదు. ప్రాజెక్టులు కట్టే అధికారం రాష్ట్రాలకు యివ్వడం నూతనమైందికాదు. ఇప్పుడు మనకు మాచ్‌ఖండు దగ్గర పెద్ద హైడల్ స్టేషన్ కట్టుతున్నాము. కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టబడుతున్నా ఆ ప్రాంతంఅంతా ఒరిస్సా రాష్ట్రానికి చెంది వుంది. ఆంధ్రరాష్ట్రానికి, ఒరిస్సా రాష్ట్రానికీ సంబంధించిన బ్రహ్మాండమైన ప్రాజెక్టు కట్టుతున్నాము.

మొట్టమొదటనుంచి యీనాటివరకుకూడా యీ ప్రాజెక్టు కట్టే బాధ్యతఅంతా ఆంధ్రరాష్ట్రానికే వదలివేయబడింది. ఇంజనీర్లు మనవారు. అక్కడ ఉన్నవారంతా మనవారు. ఖర్చుపెట్టుతున్న డబ్బు మనద్వారా ఖర్చు పెట్టబడుతుంది. కాని ఒరిస్సావారుకూడా భాగస్థులే. రాజ్యం ఒరిస్సాది. ప్రాజెక్టును ఒరిస్సారాజ్యంలో కట్టుతున్నాము. ఒరిస్సావాండ్లు భాగస్తులు. కాని మనకు వదలి పెట్టారు ఆ ప్రాజెక్టు నిర్మాణం. అదేవిధంగానే మైసూరురాష్ట్రంలో Hospet, Siruguppa తాలూకాలున్నా యీ ప్రాజెక్టు కట్టేబాధ్యత అయినా సంపూర్ణముగా మాకు వదలిపెట్టమని అడుగుతున్నాం. యెందుకు అడుగుతున్నాం అంటే ఆంధ్రరాష్ట్రంలో 3 లక్షల యెకరాలకు నీటి సరఫరా కావాలి. బళ్ళారి ప్రాంతంలో 80 వేల యెకరాలకు మాత్రమే నీరు సరఫరా అవుతుంది. హెచ్చుభాగం రాయలసీమలోవున్న ప్రాంతం అంతా యీ ప్రాజెక్టుపై ఆధారపడివుంది కాబట్టి యీ రాయలసీమయొక్క శ్రేయస్సు ఆంధ్రరాష్ట్రంయొక్క బాధ్యత కాబట్టి ఆంధ్రరాష్ట్రానికే యీ ప్రాజెక్టును పూర్తి చేసే బాధ్యత వదలితే మంచిది అనే ఆశతో కనీసమైన డిమాండుతో దీనిని కోరినాము. ఈ డిమాండు సంపూర్ణముగా అంగీకరింపబడుతుందని పైవాళ్ళు తీర్పు చెప్పాల్సిన అవసరము లేకుండా మైసూరు ముఖ్యమంత్రి మొదలైన మిత్రులంతా అంగీకరిస్తారని విశ్వాసం నాకు ఉన్నది. ఇది యీ తీర్మానములో ప్రత్యేకముగా వ్రాయలేదు. యెందుకంటే we reiterate our resolution అన్నాము యిందులో. కాబట్టి ఆ తీర్మానములోవున్న సమస్యలన్నికూడా చేర్చి ఆఖరు పేరాలో మనం వ్రాశాము. కాబట్టి యిప్పుడు ప్రత్యేకముగా వ్రాయలేదు. ఇది మన కనీసమైన కోరిక అని అసెంబ్లీ సభ్యులందరు మరొకపర్యాయము వెల్లడిస్తారని నేను ఆశిస్తున్నాను.

బళ్లారిసమస్య వచ్చినప్పుడే కోలారు సమస్యకూడా వస్తుంది, కోలారు ఆంధ్ర ప్రాంతము అని అందరూకూడా అంగీకరించిన విషయమే. ఆంధ్రమా, కన్నడమా అనకుండా కోలారువారిని ప్రత్యేకంగా ఇక్కడకు తీసుకురావలసిన ఉద్దేశ్యముకాక, బళ్లారితాలూకా కన్నడముఅయినా ఈ మూడుతాలూకాలు మనకువస్తే అటుఉన్న కోలారు ప్రాంతము మనకు ఇచ్చినా ఇవ్వకపోయినా ఇది ఏదో సర్దుకుపోవడానికి వీలవుతుంది అనే అభిప్రాయముతో మేము తగాదా ప్రారంభించలేదు.

పర్లాకిమిడి ఒరిస్సా ప్రాంతములో ఉన్నది. అది పాతపట్టణము తాలూకాకు ఆనుకొని ఉన్నది. ఒరిస్సాకు contiguity ఉన్నది కాని కొండల్లో వున్నది. దారి ఎక్కడాలేదు. వారు మన ప్రాంతములోని ఇచ్ఛాపురము, సోంపేట, టెక్కలి, పాతపట్టణము తాలూకాలన్నింటిని దాటి, ఇన్నిమైళ్లు ఆంధ్రదేశములో ప్రయాణముచేసి ఆ పర్లాకిమిడిపోయి ప్రభుత్వాన్ని పాలించవలసి ఉన్నది. అక్కడ 62% మంది ఆంధ్ర ప్రజలే ఉన్నారు అందువలన ఆచిన్నప్రాంతాన్ని ఆంధ్రలో కలుపమని నేను, మిత్రులు వెంకటరావుగారు ఢిల్లీపోయినప్పుడు, కేంద్రప్రభుత్వమువారికి నివేదించాము. వారు ఈ విషయంగురించి ఆలోచిస్తారని ఆశిస్తున్నాను.

మద్రాసు సరిహద్దులగురించి మద్రాసులో తర్జనభర్జనలు జరుగుతున్నాయి. అసెంబ్లీలో వాటినిగురించి చర్చించుకుంటున్నారు. ఇంత చిన్నవిషయముగురించి ఇంత తర్జనభర్జనలు ఎందుకుజరుగుతున్నాయో చూస్తే, నాకు ఆశ్చర్యకరంగా ఉన్నది. ఆవిషయాలనుగురించి మేము మద్రాసు ప్రభుత్వముతో చర్చించాము. ఆంధ్ర ప్రభుత్వము మరొకపర్యాయము సమావేశమవుతామని వారికి ఆనాడే చెప్పింది. కాని ఇంక సమావేశాలకు స్థానములేదని, సమావేశములవల్ల లాభములేదని, మాకు బౌండరీకమీషను కావాలని మద్రాసు ప్రభుత్వము ఢిల్లీ ప్రభుత్వమువారిని కోరింది. వారు కావాలంటే మేము అభ్యంతరపెట్టలేదు. కాని రాజీచేసుకోవడానికి మార్గాలుఉన్నాయని నేను ఈ నాటికికూడా విశ్వసిస్తున్నాను. ఆవిషయము మద్రాసులోని మిత్రులకుచెప్పి మరొక పర్యాయము సమావేశమవుదామన్నాము,

ఇంకా హోసూరు, చెంగల్పట్టు, సేలం విషయములు మిగిలి ఉన్నాయి. ఈ విషయాలన్నింటినీకూడా మనముకూర్చొని ఆలోచించడానికి వీలవుతుంది. కోలారు విషయముమనకు తెలియదు. ఇది సంప్రదింపులకు సరియైన అదను కాదు. మనరాష్ట్ర స్వరూపము ఎట్లాఉంటుందో, మన బౌండరీలు ఎట్లావుంటాయో తెలుసుకొన్న తరువాతనే, వారితో సంప్రదించడానికి సరియైన అదను అని నేను అనుకొంటున్నాను. కాబట్టి ఇప్పుడు వెంటనే మద్రాసుతో సంప్రదింపులు ప్రారంభించకపోయినా అక్కడ ఉన్న అరవమిత్రులకు తొందరపడవద్దని చెబుతున్నాను. ఇప్పుడు ఇంత రాష్ట్రాన్ని విభాగిస్తే కొందరు ఆంధ్రులు అక్కడ ఉంటారు, కొందరు అరవలు ఇక్కడ ఉంటారు. తప్పదు. ప్రతిఇంటినీ, ప్రతిమనిషినీ పంచుకోవడానికి వీలులేదు. Linguistic minorities అక్కడా, ఇక్కడా ఉంటాయి. ఎన్నో లక్షలమంది ఆంధ్రులు మద్రాసులో ఉన్నారు. ఆంధ్రులకు ఎంతో అన్యాయము జరుగుతుందేమో, అందరూ ఏదో అయిపోతారని భయపడడములేదు. అక్కడఉన్న కొద్దిమంది అరవసోదరులు మాత్రం ఎందుకు ఇంతగా జంకుతున్నారో, భయపడుతున్నారో తెలియడములేదు. అందుకు కారణాలుఉంటే, మాదృష్టికి తీసుకువస్తే మేము వాటిని తప్పక పరిశీలిస్తామని, నేను ఈ వేదిక మీదనుంచి, ప్రభుత్వము తరఫున చెబుతున్నాను. అరవవారు అనిగాని, తెలుగువారు అనిగాని, అలాంటి అభిప్రాయ భేదముతో మీకు రావలసిన సౌకర్యాలు ఇవ్వకపోవడము, మీకు ఇబ్బందులు కలిగించడము ఏదైనా ఉంటే అది మాఅభిప్రాయము కాదని నేను వారికి వినయపూర్వకంగా మనవిచేస్తున్నాను, అది ఏమీలేదు.

ఇంక మిగిలినవిషయాలు హెచ్చుగా చెప్పదలచుకోలేదు. ఇప్పుడు నేను చెప్పినట్లుగా నందికొండ బోర్డుసమావేశము ఇక్కడ నాలుగు గంటలకు ఏర్పాటు అయి ఉన్నది నేనుకూడా అక్కడికి పోవలసిఉన్నది. మిత్రులు వెంకటరావుగారు ఇక్కడ ఉంటారు. మీ అందరుకూడా ఏకగ్రీవముగా ఈ తీర్మానాన్ని నిశ్శబ్దంగా, క్లుప్తంగా, ఉపన్యాసాలుచేస్తూ బలపరచవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

# The Andhra Legislative Assembly

## WEDNESDAY 1ST FEBRUARY, 1956

The House met in the Assembly Chamber, Kurnool at one of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS

### Starred Questions

*Amount of Revenue got from the grazing permits.*

**246—**

* 80 Q.—SRI S. VEMAYYA:

SRI N. C. SESHADRI:—Will the Hon. the Chief Minister be pleased to state the amount of revenue got from the grazing permits by the State during the year 1952-53 and 1953-54?

The Hon Dr B. GOPALA REDDI:—

The Revenue realised was as follows:—

| Year | Revenue |
|---|---|
| 1952-53 | Rs. 1,28,449 |
| 1953-54 | Rs. 1,95,789 |

SRI S. VEMAYYA:—

ఈ grazing permits యిచ్చే విషయములో ఒక గ్రామానికి సంబంధించిన కంచెలు యింకొక గ్రామంవారికి యివ్వడము జరుగుతున్నందువల్ల అక్కడ రైతుల మధ్య అనేక తగాదాలు వస్తున్నవి. ఈవిధముగా చెయ్యడము ప్రభుత్వ విధానమా? ప్రభుత్వానిది యిటువంటి విధానము అయినట్లయితే రైతులమధ్య వచ్చిన తగాదాలు పరిష్కరించుకొనడానికి ప్రభుత్వము ఏదైనా చర్య తీసుకుంటుందా?

The Hon, Dr. B. GOPALA REDDI;—

తగాదాలు పెట్టే పద్ధతి ప్రభుత్వానిదికాదు. కాని యీ grazing permits యిచ్చేది రెండు రకములుగా జరుగుచున్నది. మొదటిది కంచెల సిస్టమనీ రెండవది పర్మిటు సిస్టమని. కాబట్టి యీ విషయములో తగాదాలు రాకుండా ఏవిధానము అయితే బాగుంటుందో అక్కడ స్థానికంగానుండే పశువులు మేయటానికి వీలుగా ఉండేటట్లు మనము నిర్ణయించుకోవలని ఉంటుంది. ఇప్పటివరకూ ఎక్కువ జిల్లాలలో జరిగేది పర్మిటుసిస్టమే. అంటే ఒకసారి పర్మిటుయిస్తే, ఆజిల్లాలో ఎక్కడైనా పశువులు మేయవచ్చునన్నమాట. ఇక కంచెల సిస్టము అయితే ఆ పర్మిటు ప్రకారము ఆకంచెలోనే మేయాలని, యింకను యిన్నిపశువులకంటె ఎక్కు

వగా మేయకూడదు అనే మాదిరిగా ఉంటుంది. కాబట్టి యీవిషయములో కొంచెము దీర్ఘముగా ప్రభుత్వము ఆలోచించవలసి ఉన్నది.

SRI S. VEMAYYA:—

ఇప్పుడు ఉన్న పద్ధతి ప్రకారము అడవికి కాని, కంచెకుకాని 10, 15, మైళ్ల దూరములో వుండే గ్రామాలలోని రైతులకు పర్మిటు యివ్వడమువల్ల, దగ్గర గ్రామాలవారికి పర్మిటు లేక దగ్గర గ్రామాలవారి పశువులు మేయటానికి వీలులేకుండ పోతున్నది. దగ్గర గ్రామాల పశువులు మేయటానికి వీలులేకుండా ఎక్కడో దూర మునుంచి వచ్చిన పశువులు మేయడమువల్ల. వాళ్లకు వీళ్లకు తగాదాలు వస్తున్నవి. అందుచేత యిటువంటి తగాదాలు రాకుండా, దగ్గర గ్రామాలలోనుండే రైతులకు ముందు పర్మిట్లు యిచ్చేటట్లుగా ప్రభుత్వము ఉత్తరువులు జారీచేస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:—

అంటే, సభ్యులు చెప్పేది, కంచెల సిస్టము పెట్టమని అంటున్నారని అను కుంటాను. ఒకొక్క కంచెకు యిన్ని పశువులు, అని అంతకంటె ఎక్కువగా మేయ రాదు. అని, అవికూడ అక్కడ స్థానికంగా ఉండేవేనని. యీమాదిరి సిస్టముపెట్టితే అదికంచెల సిస్టము అని అంటారు. ఇంతకుముందు మా నెల్లూరుజిల్లాలో యిదే మాదిరిగా జరుగతూవచ్చింది. కాని యీసిస్టము యిప్పుడు తీసివేశారు. ఇప్పుడు మరల అదే సిస్టము పెట్టితే బాగుంటుందని కొందరు సభ్యులు చెబుతున్నారు. ఈ విషయములో గౌరవ సభ్యుల అభిప్రాయాలుగూడ తీసుకొని, ఎట్లా చేస్తే బాగుం టుందో ఆలోచించి ప్రభుత్వము ఆ ప్రకారము చేస్తుంది

SRI M. NAGI REDDI:—

ఈ విధంగా వసూలుచేసిన పుల్లరి సంధర్భములోనూ, 1952 వ సంవత్సర ములో వచ్చిన కరువు సందర్భములోను enhance చేసిన రేట్లు మరల తగ్గించిన సంధ ర్భములోనూ, వుత్తరవులు వెళ్లకముందుగానే పుల్లరి వసూలుచేశారు. అంతేకా కుండా, ఎక్కువగా కూడా వసూలుచేశారు. అవిధంగా ఎక్కువగా వసూలు చేసిన సొమ్మును refund చేయమని పల్నాడు తాలూకాలోనూ, సత్తెనపల్లి తాలూకా లోనూ, రెండుమూడు సంవత్సరాలుగా ఆందోళన చేస్తున్నారు. అది యింతవరకు refund చేయబడలేదు. Refund చేయటానికి Chief Conservator of Forests కు ఉత్తరువులు జారీచేస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:—

నాకు తెలిసినంతమటుకు. అటువంటి refund విషయములో representation ఏదీ కూడా నావద్దకు రాలేదు. ఎక్కడైనా ఎక్కువగా వసూలు చేశారంటే refund చేయవలసిన అవసరము ఉన్నదని నాకు తెలియదు. ఉంటే, విచారించి తప్ప కుండా చేస్తాము.

1st February, 1956

SRI B. SANKARAIAH:—

గ్రామాలకు దగ్గరగా అడవులు, కంచెలు ఉంటే యిదివరలో Forest Panchayat Boards ఉండేవి. కాని యిప్పుడు అవి రద్దుచేయబడడమువల్ల, ఎక్కడపడితే అక్కడ పశువులను మేపుకోటానికి permits యివ్వడమువల్ల, ప్రదేశాలలో స్థానికంగా ఉండే ప్రజల అవసరాలు గుర్తించబడలేదు. అందువల్ల స్థానికంగాఉండే పశువులు తప్ప యితర పశువులు రాకూడదు అని, యింతే సంఖ్యగల పశువులు మేయ వచ్చునని, ఉత్తరువులు పంపిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI:—

ఈవిషయము Chief Conservator of Forests తో మాట్లాడి ఎవరికినీ ఏలాంటి యిబ్బందులు లేకుండా తప్పకుండా చూస్తాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

ఇందాక మన ముఖ్యమంత్రిగారు చెప్పినదానికిన్నీ, మా అనుభవాలకు, చాలా తేడావున్నది. మాజిల్లాలో ఒక్కొక్కచోట reserve range ఉంటే. ఆరేంజికి పర్మిటు తీసుకోటానికి రెండవది ఉంటే, మరల డబ్బు వసూలుచేస్తారు. కాన అది జిల్లా మొత్తానికనిలేదు.

THE HON. DR. B. GOPALA REDDI:—

దానికే కంచెల సిస్టము అని అంటారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

పోతే రెండవ విషయము పశువులు మేయటానికి పర్మిటు ఏరేంజికి తీసుకుంటే ఆరేంజిలోనే మేయాలనే నిర్బంధములేకుండా తక్కిన అన్నిచోట్లలోకూడ మేయ వచ్చునని permit యిస్తున్నారు. కాని అడవులు పెంచాలి అనేది ప్రభుత్వానికి యిప్పుడు సమస్యవున్నప్పుడు, యీపెంపకమును దృష్టిలో పెట్టుకొని అక్కడవున్న area ను బట్టి ఎక్కువగా permits యివ్వటానికి వీలు అవుతుందా లేదా అనేది ప్రభుత్వము ఆలోచించకపోతే. అక్కడ చుట్టు ప్రక్కల ఉండే గ్రామాలలోని రైతుల మధ్య తగాదాలు వస్తున్నవి. గ్రామాల మధ్య వేరువేరు range ఉంటున్నది. ఈయేరియాలలో ఎవరికి ఏరేంజి యిస్తారు అనే సమస్య వస్తున్నది. ఈ సమస్య సమగ్రంగా పరిశీలించి పరిష్కారము చేయవలసి ఉంటుంది. కాబట్టి ఈ విషయము చేసే కమటీలనైన వెంటనే సమావేశము అయ్యేటట్లు చూస్తే రైతులకు కొంచెము వుపయోగముగా ఉంటుంది. తగాదాలు అయినా రాకుండా పోతాయి. కాబట్టి యీకమిటీలు ఎప్పుడు సమావేశ పరుస్తారో చెబుతారా?

THE HON. DR. B GOPALA REDDI:—

ఇది తప్పకుండా ఆలోచించవలసిన విషయమే. అందులో గోపాలకృష్ణయ్యగారు Range Committee లో మెంబరుకూడాను. అందులో యీవిషయముకూడ ఆలోచనకు తెస్తారని అనుకుంటాను ఇదిగాకుండా Provincial Advisory Committee లో యీవిషయము ఆలోచించబడుతుందని నేను హామీ యిస్తున్నాను.

1st Fibruary, 1956]

(a) whether there is any proposal to improve the swamp area of Allur in Nellore district; and

(b) If so, when it will be taken up?

THE HON SRI N. SANJEEVA REDDI:—

(a) The proposal for the reclamation of Allur Swamp area in Kovur taluk, Nellore District with a view to bring the entire area under cultivation was considered by the Government of the Composite State in 1952 and in view of the prohibitive cost of the scheme and poor return. it was deffereed in G O. Ms No 5121 P. M dated 16-12-52. Recently a proposal to render the Swamp area fit for cultivation for the benefit of Bitragunta settlers has been received by the Government. The matter is under correspondence with the Special Chief Engineer (Irrigation).

(b) Does not arise.

SRI B. SANKARAIAH:—

దీనికి సరియైన return రాదని యిదివరకు చెప్పారట. ఇప్పుడు కేవలము swamp area లో నుంచి నీరుపోయేదానికి drainage ను ఏర్పాటు చేస్తే అక్కడ ఉండే settlers కు చాలా ఉపయోగిస్తుంది. ఇంకా అక్కడ చుట్టుప్రక్కల ఉన్న పది గ్రామాలలో రైతులుగూడ దాని benefit పొందుతారు. ఈ విషయములో చాలా సంవత్సరాలుగా remission గూడ యిస్తున్నారు. అందువల్ల దీన్ని త్వరలో శాంక్షను చేయిస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

ఈ సమస్య 1924 వ సంవత్సరమునుంచి అంటే యిప్పటికి దాదాపు 30 సంవత్సరాలుగా ప్రతిసారి examine చేయడము, సరియైన return రాదు అని అనుకోవడము జరుగుతున్నది. ఇప్పుడు మరల యీ betterment levy ని consideration లోనికి తీసుకుని యిప్పుడు దానివిషయములో కొద్ది పరసెంటేజి అయినా increase అవుతుందేమోఅని ఆలోచిస్తున్నాము. అప్పుడు 0.8 పరసెంటు return వస్తుందని అంచనా వేశారు. ఇప్పుడు కొంతవరకైన increase అవుతుందేమోనన్న అభిప్రాయము ఉన్నది. అదిగాక అక్కడ production కి చాలా facilities వున్నవి. కాబట్టి ఇంతకన్నా తక్కువఖర్చుతో ఎక్కువమంది రైతులకు వుపయోగించేటట్లుగా వుంటే ప్రభుత్వము ఆలోచిస్తుంది. ఈ విషయము పునర్విచారించటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

Prohibitive cost అన్నారు composite State గా వున్నప్పుడు మన Scheme లు అన్నీ Prohibitive cost అని అణగిపోయినాయి. ఇప్పుడు మనకు

వేరేరాష్ట్రము ఉన్నదికాబట్టి cost ఉన్నా లేకపోయినా, ఏదోఒకమాదిరి return వచ్చి ఇలాంటివన్ని తీసుకోడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా? ఎవరు prohibitive cost అన్నారు.

The Hon SRI N. SANJEEVA REDDI:—

మదానుసురాష్ట్రంలోను ఆంధ్రరాష్ట్రంలోను ఖరీదు ఒకటేఅవుతుంది. రూపాయికి విలువఒకటే. ఆంధ్రరాష్ట్రంలో ఇంతకంటె better scheme లు ఉన్నాయని తెలుసు ఇలాంటివికాకుండా తీసుకోవాలిఅని ఆలోచిస్తున్నాం. Prohibitive cost అంటే ఇప్పుడు Betterment Levy వేస్తున్నాము. కాస్త return increase కావచ్చును, అప్పుడు Betterment levy తీసుకరాలేదు దీనివల్ల return అవుతుందేమో పరిశీలనచేస్తున్నాము.

*Taluks not bearing the names of their headquarters.*

**248—**

*289 Q:—SRI P RANGA REDDI: Will the Hon. the Minister for Revenue be pleased to state—

(*a*) whether it is a fact that some taluks in the State do not bear the names of their headquarters:

(*b*) if so, what they are and how many; and

(*c*) whether the Government are considering the question of changing the names of such taluks so as to coincide with the names of the places where the headqurters of the taluks are located?

The Hon SRI K CHANDRAMOULI:—

(*a*) The answer ia in the affirmative.

(*b*) Thete are ten taluks which do not bear the names of their headquarters and they are the following:—

| District. | Name of the Taluk. | Name of the Headquarters. |
|---|---|---|
| 1. Visakhapatnam. | 1 Veeravalli | Chodavaram |
| | 2. Sarvasiddhi | Yellamanchili |
| | 3. Golugonda | Narasipatam |
| | 4 Gudem | Chintapalli |
| 2. East Godavari | 1. Yellavaram | Addatigela |
| | 2. Nagur | Venkatapuram |
| 3. Krishna | 1. Divi | Avanigadda |
| 4. Guntur | 1. Palnad | Gurazala |
| 5. Kurnool | 1. Cumbum | Giddalur |
| | 2. Sirvel | Allagadda |

(*c*) The answer is in the affirmative.

1st Fıbruary 1956]

SRI P. RANGA REDDI:–

ఈ తాలూకాలలో పేరుపెట్టడముతో చరిత్రప్రసిద్ధిగన్న గుంటూరులో పల్నాడు ఉంది. దానికి గురజాల headquarters గా వున్నది. చరిత్ర ప్రసిద్ధికన్నది కనుక పల్నాడుగా ఉంచడం అవసరంవున్నదని ప్రభుత్వం గుర్తిస్తుందా?

The Hon. SRI K CHANDRAMOULI:

ఈ మార్పులనుగురించి ముఖ్యమంత్రిగారు చెప్పేరు. పేర్లుమార్చడానికి ప్రభుత్వం ఆలోచించడంలేదు. Objection లేనివి చరిత్రాత్మకముగా ప్రఖ్యాతిగాంచకుండా వున్నవిమాత్రమే మార్చడానికి ప్రభుత్వం ప్రయత్నంచేస్తుంది.

*Medical-aid to Non-Gazetted Officers.*

**249—**

* 164 Q:— Sri S. VEMAYYA: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(*a*) the facilities in regard to Medical Aid given to the Non-Gazetted Officers of the State now;

(*b*) the number of Non-Gazetted officers benefitted for the year ending 1954: and

(c) the amount of money foregone by the Government in the matter?

The Hon. SRI K. VENKATA RAO:

(*a*) The Non-Gazetted Government servants of the State are eligible, under the Medical Attendance Rules, for free medical aid when admitted into Government Medical Institutions including free accommodation, nursing and medical advice, free Xray examination and treatment, free surgical treatment, free diet and to the administration, free of cost of special and expensive drugs. Where there are no Government medical institutions, the non-Gazetted Officers are eligible for the above concessions in medical institutions maintained by Local Boards and in private hospitals and dispensaries. The places where there are no Government or non-Government institutions, the Non-Gazetted Officers are permitted to avail themselves of the services of a private practitioner in emergencies.

(b) 2,835.

(c) Rupees sixteen thousand four hundred and twelve, annas three and pies eight. (Rs 16,412-3-8).

(ఆ) వైద్యసహాయ నిబంధనల క్రింద ప్రభుత్వ పత్రికలో ప్రకటనగాని ప్రభుత్వ ఉద్యోగులకు ఉచితరీతిని వైద్యసలహా ఇవ్వడం ప్రభుత్వంయొక్క వైద్య నిలయాలకు ఈ దిగువ చెప్పబడే సహాయము జరుగుతున్నది.

ఎమి చెప్పాలో తెలియడము లేదు. వైద్యాన్ని గురించిన సలహాలు, ఉచిత ముగా పేరులేని కిరణచికిత్స (X-Ray) శల్యచికిత్స; ఉచితముగా భోజనము.

Mr. SPEAKER:— The Speaker has not been able to follow you

The Hon. SRI K. VENKATA RAO:—

X-Ray అంటే పేరు లేని కిరణచికిత్సఅని నేను చెప్పాను.

ఖరీదుకల్గినట్టి మందులను ఉచితముగా ఇవ్వడముద్వారా అటువంటి సహాయము జరుగుచున్నది. ఎక్కడ ప్రభుత్వముయొక్క వైద్యనిలయాలుంటాయో అక్కడ ఉండేటటువంటి ఉద్యోగులకు Local Fund వైద్యనిలయాలలో సహాయంజరుగుతూ ఉంది ఇంకా కొన్నివిషయాలలో స్వంత Hospital, Dispensary ల లోను ఈ సహాయం జరుగుతూవుంది. ఎక్కడైతే ప్రభుత్వ నిలయాలులేవో ఈ N. G. O. లు ప్రైవేటు ప్రాక్టీషనర్లను పెట్టుకొనేహక్కు కలుగజేయబడింది.

(అ) 2835

(ఇ) 16412-3-8

SRI S. VEMAYYA:—

అధ్యక్షా, ఈ ఉద్యోగులకు నామకఃమాత్రమే ఈ వైద్యసహాయము జరుతూ వుంది. వారు ఏదైనా మందులు ఖరీదుచేసుకొనవలెనంటే గవర్నమెంటు డాక్టరు certificate ఇస్తేనేగాని ఒప్పుకోలేదు. అందువల్ల ఏ Approved practitioner వద్దనుంచి certificate వచ్చినా ఆ claim ఒప్పుకొనడానికి ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేస్తుందా? ఇప్పుడు చెప్పిన 2835 ఏ ఏ జిల్లాలలో ఎంతమంది ఉద్యోగులకు ఇవ్వబడింది.

The Hon. SRI K. VENKATA RAO:—

అది చెప్పడానికి అవసరం లేనివిషయము. ప్రభుత్వం అనవసరముగా డబ్బు ఖర్చుపెట్టి వివరములు తీసుకొనివస్తే లాభం సభ్యులకుగాని, సభకుగాని ఏవిధముగా ఉపకరించదు.

ఇప్పుడు ప్రైవేటు సర్టిఫికేటుక్రింద అయిన ఖర్చులు ప్రభుత్వం ఇవ్వడం తటస్థిస్తే ప్రభుత్వ ఖజానా త్వరలో ఖాళీఅయిపోతుంది. నిన్ననే ప్రభుత్వంవారు ఒక ఆర్డరు జారీచేసినారు. దొంగతనముగా ఏవిధమైన జబ్బులేండానే ఇటువంటి బిల్లులు పంపేటటువంటి అవసరాలు ప్రభుత్వ దృష్టిలోకి రాబడినందున అటువంటి వారిమీద తీవ్రమైనచర్య తీసుకునేందుకు.

1st February, 1956

*Representation from Municipat Councils regarding taking over electric concerns*

**250—**

* 282 Q —SRI PRAGADA KOTAIAH: Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the Government are in receipt of representation from the Municipal Councils, requesting the Government that the Municipal Councils may be allowed to take over the electric concerns in their areas to improve the Finance; and

(b) if so, the action taken thereon?

The Hon. SRI G. LATCHANNA.—

(a) and (b) The Visakhapatnam and Anakapalle Municipal Councils requested that they might be permitted to purchase the respective Company Electrical undertakings in their areas. Subsequently the Visakhapatnam Municipal Council withdrew its request. The Anakapalle Municipal Council was informed that its request could not be complied with.

తమ ప్రాంతములలోని విద్యుచ్ఛక్తి వ్యాపారసంస్థలను కొనేందుకై అనుమతిని ఇవ్వవలసినదిగా విశాఖపట్నం, అనకాపల్లి పురపాలక సంఘములు ప్రభుత్వమును కోరినవి. తదనంతరము విశాఖపట్నం పురపాలక సంఘము తనకోరికను ఉపసంహరించుకొన్నది. అనకాపల్లి పురపాలక సంఘముయొక్క కోర్కె అంగీకరింపబడజాలదని ఆ పురపాలక సంఘమునకు తెలియజేయడమైనది.

SRI PRAGADA KOTAIAH:—

అధ్యక్షా:— మొత్తముగా ఈ Chairmen అందరూకూడా సమావేశమై ఒక తీర్మానముచేసేరు. దానిమీద పునరాలోచన చేస్తారా?

The Hon. SRI G. LATCHANNA:—

1949 చట్టము ప్రకారము ప్రభుత్వం అయా Private Electric Company లను స్వాధీనము చేసుకోవలెనని చట్టము pass చేసికొన్నాము దానిప్రకారం ప్రభుత్వం చర్యతీసుకుంటున్న సంగతి గౌరవ సభ్యులకు తెలుసును. కాబట్టి దీనిని గురించి పునరాలోచనచేసే అవకాశం ఉండదుఅని మనవిజేస్తున్నాను.

SRI V. VISWESWARA RAO:

అధ్యక్షా — నిన్నటిదినం ఒకప్రశ్నకు సమాధానం చెపుతూ ప్రభుత్వ ఖజానా తక్కువగా ఉండడంవల్ల అన్ని Electric Company లను ఈసంవత్సరం స్వాధీనం పరుచుకునే సమస్య లేదని క్రమేపి తీసుకుంటామని చెప్పేరు. ప్రభుత్వంవద్ద డబ్బు లేదన్నారు. కాబట్టి పురపాలక సంఘాలు వాటినిస్వాధీనం చేసుకుంటాము అన్నప్పుడు G. O. ను సవరించి వారికి అవకాశము కలుగ చెయకూడదా?

The Hon. SRI G. LATCHANNA:

ఇది G. O. సవరణ వ్యవహారంకాదు చట్టము ప్యాసు చేసికొన్నాము. దాని ప్రకారముగా Private Company లు అన్నీ ప్రభుత్వం స్వాదీనం చేసుకోవలెను. డబ్బును బట్టి ఈ ఏడాది కొన్నింటిని మిగతా వచ్చే ఏడాది తీసుకుంటామని కార్యక్రమము ఎర్పాటుచేసుకున్నాం. కాని స్వాధీనం చేసుకొన్నవి తిరిగి ఇచ్చేవిదానము చట్టములోగాని విధానములోగాని లేదు.

SRI S. BRAHMAYYA:

ఈ విద్యుచ్ఛక్తి విషయంలో పురపాలక సంఘాలకు ఒప్పచెప్పక ప్రభుత్వం బాద్యత వహించకపోతే ప్రైవేటు సంస్థలవల్ల అన్యాయం జరుగుతున్నది. ప్రభుత్వం ఎంతత్వరలో తగు చర్యతీసుకుంటుందో మంత్రిగారు తెలియచేస్తారా?

The Hon. SRI G. LATCHANNA.

వారు మరొక ప్రశ్నవేస్తే Programme చెప్పగలను వచ్చేఏడాది మూడు కంపెనీలు తీసుకుంటామని noticeఇచ్చేము. మూడవసంవత్సరములో పూర్తికావచ్చును

SRI PRAGADA KOTAIAH:—

విద్యుచ్ఛక్తి సరఫరా మునిసిపాలిటీలు నిర్వహించడానికి చట్టము అడ్డము వస్తుందంటున్నారు. కాబట్టి కనీసం ప్రభుత్వానికి వచ్చే return లో కొంత ఆ ప్రదేశాలలోఉన్న మునిసిపాలిటీలకు తిరిగి ఇస్తారా?

The Hon. SRI G. LATCHANNA:—

ఇది ప్రత్యేక ప్రశ్నండి

SRI B. SANKARAIAH.—

ప్రైవేటు సంస్థలు ప్రభుత్వం ఇచ్చేధరలకు ఇచ్చేటట్టు Rules pass చేసి

The Hon. SRI G, LATCHANNA:—

ప్రైవేటు కంపెనీలలో ఉన్న రేట్లను ప్రభుత్వం స్వాధీనం చేసికొనకముందు వాటిని సవరించే అవకాశము లేదు.

SRI M. NAGESWARA RAO.—

అధ్యక్షా, ఈసంవత్సరం 3 కంపెనీలకు notice యిచ్చాంఅన్నారు, అవి ఏవేవి?

The Hon. SRI G LATCHANNA:—

(1) Guntur, (2) Rajahmundry, (3) East Coast Electrical Company కి

*Appointment of lecturers in Government Colleges*

**251—**

* 306 Q:—SRI T. LAKSHMINARAYANA REDDI: Will the Hon. the Chief Minister be pleased to state the rules governing the appointment of lecturers in Government Colleges and whether the Government promote Assistant Lecturers as Lecturers or appoint them directly?

THE HON. DR. B. GOPALA REDDI:—

The posts of Lecturers in the Andhra Educational Service are filled up.

(i) by direct recruitment

or by

(ii) by recruitment transfer from Assistant Lecturers in the Andhra Educational Subordinate Service and also in the case of Lecturer in Education, from Deputy Inspectors of Schools (Senior Scale), School Assistants and Headmasters in that service and in the case of Lecturers in Languages other than English from Pandits and Munshis I Grade, in the same service, or

(iii) by transfer from any category on an identical scale of pay.

In making appointments to the posts of Lecturers, posts connected With a particular subject are regarded as constituting one unit and vacancies arising in each unit are filled alternately by direct recruitment and by recruitment by transfer from the Andhra Educational Subordinate Services.

SRI T. LAKSHMINARAYANA REDDI:—

అన్ని అర్హతలూ ఉన్నటువంటి Assistant lecturers ఉండగా వారిమీద direct గా అదే అర్హత ఉన్నటువంటివాళ్లను post చేయడంవల్ల చాలాకాలంనుంచి పనిచేస్తున్నటువంటి యీ Assistant Lecturers frustration తో బాధపడు తున్నారు. అటువంటి పరిస్థితిలేకుండా వారిని promote చేసినతరువాత అలా promote చేయడానికి అర్హతలులేనివారున్నప్పుడే direct recruitment చేయ డానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఈ మాత్రం ప్రతి Department లో కూడా కొంత direct recruitment ఉన్నది. కొంత promotion ఉన్నది. ఇది Educational Department, Agricultural Department, Forest Department, Revenue Department లలో కూడా వున్నది. కొంత direct recruitment ఉంటేనేగాని Services బాగుండవేమో అన్న ఉద్దేశము ప్రభుత్వానికున్నది. అందువల్ల యిక్కడకూడా direct recruitment ఉన్నది.

SRI S. VEMAYYA:—

Direct recruitment చేయబడినటువంటి percentage ఎంత? Departmental transfer వల్ల promotion పొందిన వాళ్ల percentage ఎంత? ఈ Lecturers కు Assistant Lecturers కు ఉన్న pay scales ఎంత?

The Hon. Dr. B. GOPALA REDDI:--

వేరే ప్రశ్న వేస్తే సమాధానం చెబుతాను.

SRI K. VIJAYA BHASKARA REDDI:—

Education Department కు యితర Department లకు చాలా భేదం వున్నది. Assistant Lecturers లో యింకా ఎక్కువ అనుభవం వున్న వాళ్ళను promote చేయడమే మంచిది. అలా చేయడానికి ఆలోచిస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

Direct recruitment లో ఒకవేళ యిందులో తక్కువే అయినప్పటికీ కూడా ఎక్కువ higher educational qualification కావాలి. యితను B. A. అయితే అతను M. A. కావచ్చు. Latest information అంతాకూడా అతనిదగ్గర వుంటుంది. అందుచేత direct recruitment మంచిది. అనుభవం వున్నవాళ్ళను promote చేయడంకూడా మంచిదే. రెండింటినీ సమన్వయపరచవలసి వుంటుంది.

1st February 1956]

SRI K. VIJAYABHASKARA REDDI:—

అంటే direct recruitment చేసేవాళ్లకు Assistant Lecturers కంటే ఎక్కువ qualifications వున్నవాళ్లను వేస్తున్నారంటారా?

THE HON. DR. B. GOPALA REDDI —

Qualifications ఉండవచ్చు ఇంకా కొత్తరకమైనటువంటి అనుభవాలుండవచ్చు. ఇవన్నీ Public Service Commission వాళ్లే ఆలోచిస్తారా?

SRI S. VEMAYYA:—

ఎక్కువ విద్యావంతులు practicalగా అనుభవం వున్నవారికంటే ఎక్కువ ఉపయోగ పడతారని ప్రభుత్వం భావిస్తున్నదా?

The Hon Dr. B GOPALA REDDI:—

భావిస్తున్నది.

*Bridge on the East Vagu of Tiruvur.*

**252**—

* 238 Q.—SRI V. VISVESWARA RAO:—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state.—

(a) whether the Government are aware of the fact that the bridge on East Vagu of Tiruvur collapsed in the year, 1954.

(b) whether the Government propose to construct the new bridge this year; and

(c) if not, why?

The Hon. SRI N. SANJEEVA REDDY:—

(a) The answer is in the affirmative.

(b) A proposal to construct a submersible bridge across the east vagu near Tiruvur at M. 40/6 of Ibrahampatnam-Tiruvur Road is under consideration

*Executive Officer posts in the Hindu Religious and Charitable Endowments Board*

**253**—

* 318 Q — SRI VAVILALA GOPALAKRISHNAYYA: Will the Hon. the Minister for Revenue be pleased to state—

1st February, 1956

The Hon. SRI K. CHANDRAMOULI:—

5 grades ఉన్నాయండి. వాటినన్నీ తగ్గించాలనికూడా అనుకుంటున్నాము. తరువాత 4 grade లు చేశారు. అది యిప్పుడున్న పరిస్థితులవల్ల కొత్తరూల్సు పెట్టి వేరే recruitment చేయాలని చూస్తున్నారు.

SRI S NARAYANAPPA:—

Executive Officers ను ఎన్ని దేవాలయాలకు ఒక్కొక్కరిగా ఏర్పాటు చేస్తున్నారు. వారిని నియమించడానికి ఏవిధానం అనుసరించుచున్నారు ?

The Hon SRI K. CHANDRAMOULI:—

రెండు మూడు నియమాలున్నాయి. పెద్దపెద్ద దేవాలయాలు ఎక్కువ ఆదాయం వచ్చేవాటికి ఒక grade Medium size క్రింద ఒక grade ఇంకా చిన్న grade లకు qualification, School Final చాలు. ఇటువంటి నియమాలున్నాయి.

SRI G. YELLAMANDA REDDI:—

అధ్యక్షా ! గత ప్రభుత్వం తయారుచేసిన list మార్చవలసిన అవసరం ఏమి వచ్చింది? అందులో select అయినవారికి నష్టంకాదా ?

The Hon. SRI K. CHANDRAMOULI:—

ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం తయారుచేసిన ఆ list ఆంధ్ర రాష్ట్రానికి యిక అక్కరలేదనుకున్నాము.

SRI M. BAPAYYA CHOWDARI:—

ఇప్పుడు కొత్తగా ఎన్నుకోబోయే Executive Officers కు సంస్కృతం ఏమయినా నిబంధనగా వుండాలని ఆలోచిస్తున్నారా ?

The Hon SRI K. CHANDRAMOULI:—

అదికూడా ఆలోచనలో వున్నది.

SRI L. LAKSHMANA DAS:—

అధ్యక్షా ! ఈ Executive Officers ను వేసేటప్పుడు కేవలం educational qualifications చూసి తీసుకుంటారా? లేక మతంపై ప్రత్యేక అభిమానంకూడా దృష్టిలో పెట్టుకుంటారా?

The Hon. SRI K. CHANDRAMOULI:—

అందువల్లనే training లో కొంతకాలం ప్రచారకులుగాను, దేవాలయాలలో వుండే పరిస్థితులను తెలుసుకొనే నిమిత్తం యికనుంచి ఏర్పాటుచేయాలనే అభిప్రాయంతోనే ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

3 సంవత్సరాలలోగా ఖర్చుకుంటాము మీరుండాలని చెప్పివున్నదిదాంట్లో. ఉద్యోగంవస్తుందని వాండ్లు ఎదురుచూస్తున్నారు. ఎప్పుడైతే తీసుకోదలచుకోలేదో అప్పుడు వారికి notice యిచ్చారా?

The Hon. SRI K. CHANDRAMOULI:—

గోపాలక్రిష్ణయ్యగారికిదివరకొకసారి చెప్పామండి, 'వాళ్లనుతీసుకోము' అని ఇప్పుడుకూడా మళ్లీ గట్టిగా చెబుతున్నాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

ఆంధ్ర State వచ్చి 2 సంవత్సరాలయినా యీరోజువరకు యివ్వనందువల్ల యిప్పటికయినా ఆలోచనచేసి preferential treatment యిస్తారా?

The Hon. SRI K CHANDRAMOULI:

గోపాలక్రిష్ణయ్యగారికి తెలియదు వాళ్లు చాలా ఉద్యోగాలు చూసుకుంటారు. ఎక్కడా దొరక్కపోతే యీలోపం పెడుతున్నారు.

Sri S. VEMAYYA:—

నా అనుబంధప్రశ్నలో Pay scales గురించి అడిగాను. చెప్పలేదు, ఇప్పుడయినా చెబుతారా?

The Hon. SRI K. CHANDRAMOULI:—

వేరే ప్రశ్న వేయండి.

### *Aid to Handloom Industry.*

**254—**

* 173 Q:—SRI N C. SESHADRI: Will the Hon. Minister for Planning and Industries be pleased to state whether it is a fact that only Rs 36,000 was given as grant to Andhra Government, by way of aid to Handloom Industry out of a total of Rs 1,29,08,600?

The Hon. SRI K. VENKATA RAO:—

It is not clear what item of grant the member has in mind The Government of India have sanctioned from the Cess Fund a sum of Rs 37,21,258/- as grants to this State for the Hand-loom Industry for 1953-54, and 1955-56 till now.

1st February, 1956]

ఈ ప్రశ్న వేసిన సభ్యుల మనస్సులో ఏమున్నదో అర్థంకావడంలేదు ఎందు చేతనంటే యిందులో "Whether it is a fact that only Rs. 36,000 was given as grant to Andhra Government by way of aid to Handloom industry out of a Total of Rs. 1,29,08,600" అనియున్నది.

కాని మేము ఊహించినదానినిబట్టి Cess Fund కు సంబంధించినదయితే 53-54,55-56 లకు యింతవరకు 37,27,259 రూపాయలు యీరాష్ట్రానికి grant గా లభించిందని చెబుతున్నాను.

SRI N. C. SESHADRI:—

అధ్యక్షా! ఈ ప్రశ్న వేయడంలో అభిప్రాయంఏమిటంటే ఇదివరలో కేంద్ర ప్రభుత్వం 36 వేల రూపాయలు by way of aid to Hand-loom industry కి యిచ్చిందని పేపరులో చూచినాముకాబట్టి ఇది ఎంతవరకునిజమోనని, ఏ Head క్రింద కేటాయించినారనే ఉద్దేశముతో నేను యీ ప్రశ్న వేసినాను.

The Hon. SRI K. VENKATA RAO:—

ఉత్తరమైనా వ్రాయవలసింది. దీనిలో వ్రాసినదానికి అర్థముకావడములేదు.

SRI P. SATHYANARAYANA:—

అధ్యక్షా! ఈ సెస్ ఫండులోనుండి డబ్బు రావడమేకాకుండా states కు మగ్గాల సంఖ్యనుబట్టి, జనసంఖ్యనుబట్టి ప్రత్యేకంగా Housing schemes కు అదనంగా యిస్తున్నారు. మీరు చెప్పిన అంకెలలో అది ఏమైనా కలిసివుందా? ఆప్రత్యేకమైన మొత్తము ఎమైనా చెప్పడానికి సావకాశముందా?

The Hon. SRI K. VENKATA RAO:—

దీనిలో ఏదీ కలువలేదు. వేరే ప్రశ్న వేస్తే దానిలోని వివరాలువస్తాయి.

SRI S. NARAYANAPPA:—

ఆంధ్ర చేనేత పరిశ్రమ ఉద్ధరణకుగాను ప్రభుత్వమువారు ప్రతి మగ్గానికి 2 వందల రూపాయలు Cess Fund నుంచి అప్పుగాఇచ్చే ప్రయత్నము చేస్తే బాగుంటుందని పత్రికలలోకూడా 2 వందలరూపాయలు మగ్గానికి ఇస్తామని కేంద్ర పరిశ్రమల మంత్రిగారు సెలవిచ్చినారుగాన ఆంధ్రప్రభుత్వమేమిచర్య తీసుకుందో ఏవిధానము అనుసరిస్తున్నారో మంత్రిగారు తెలియజేస్తారా?

The Hon. SRI K. VENKATA RAO:—

ఒకమాటు పెట్టుకున్న అప్పు తీర్చేవరకు ఏమి సహాయమైనా చేయవచ్చును. తీరనివారికలాంటిబాధగావుంది.

*Supply of electricity for agricultural purposes in Kanigiri, etc., taluks.*

**255 –**

* 395 Q.—SRI G. YELLAMANDA REDDI : Will Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the question of electricity for agricultural purposes in Kanigiri, Podili and Darsi taluks of Nellore district has been decided;

(b) if so, why electricity is not yet supplied; and

(c) when it will be supplied ?

The Hon. SRI G. LATCHANNA:—

(a), (b) and (c) : A scheme for the erection of a diesel station only at Kanigiri which contemplates supply among others to agricultural services has been sanctioned The works on the scheme are expected to be taken up for execution soon, A scheme for extension of electricity supply to 29 villages in the Podili, Darsi and Kanigiri ta'uks estimated to cost Rs. 44,843 lakhs initially rising to Rs. 57,951 lakhs is under consideration of the C. E. E.

కనిగిరిలో వ్యవసాయదారులకు మరి కొందరికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు గాను diesel station ఏర్పాటు చేయుటకుగాను ప్రభుత్వమువారు ప్రణాళికలో మంజూరు చేసిఉన్నారు. పొదిలి, దర్శి, కనిగిరి తాలూకాలలో 29 గ్రామాలకు సరఫరా చేసే scheme ఇప్పుడు Chief Engineer గారి పరిశీలనలో ఉన్నది. ఇది సుమారుగా 58 లక్షలవరకూకూడా ఖర్చు కావలసిన scheme,

SRI G. YELLAMANDA REDDI:—

అధ్యక్షా:— ఈ కనిగిరిలోఉండే diesel station నుంచి యిస్తారా? లేకపోతే ఇప్పుడు మాచ్‌ఖండ్‌నుంచి వచ్చే line నుంచి చీమకుర్తిద్వారా యివ్వడానికి ఆలోచిస్తారా ?

The Hon SRI G. LATCHANNA:—

Scheme ఇంకా Chief Engineer పరిశీలనలో ఉన్నది. గవర్న మెంటుకు report వాస్తే వివరాలు తెలియజేస్తాము.

SRI S. KASI REDDI:—

అధ్యక్షా.— ఈ తాలూకాలలో వ్యవసాయమంతాకూడా మోటబావులద్వారా జరుగుచున్నది. 29 గ్రామాలకు మాత్రమే విద్యుచ్ఛక్తి సరఫరా జరిగితే అది చాల తక్కువ. చీమకుర్తి చాలా దగ్గరగాఉంది. పొదిలి, దర్శి తాలూకాలను ఆనుకొనే

ఉంది. త్వరలోనే యీ తాలూకాలలోని గ్రామాలన్నింటికి electricity తీసుక రావడానికి ప్రభుత్వము ఆలోచిస్తారా?

The Hon. SRI. G. LATCHANNA:—

ఇప్పుడు వీలైనన్ని గ్రామాలకు యివ్వాలని ప్రభుత్వము తాపత్రయపడుతున్న దన్నే సంగతి గౌరవసభ్యులకు తెలుసు. అందుచేత ఇంకాఎవరైనా proposals పెట్టితే వాటిని గురించి పరిశీలన చేస్తాము.

SRI SHAIK MOULA SAHIB:—

అధ్యక్షా:-ఆత్మకూరు, వింజమూరు ఉదయగిరి గ్రామాలలోకూడా Electricity supply చేస్తామని Electricity Executive Engineer గారు తెలిపియున్నారు. ఆ proposal ప్రభుత్వ పరిశీలనలో ఉన్నదని తెలిసింది. ప్రభుత్వము దీనిని త్వరగా ఆమోదిస్తారా? లేక యింకా ఆలస్యము చేస్తారా?

The Hon. SRI G. LATCHANNA:—

ప్రభుత్వములో మరి చాల schemes ఉన్నాయి. వాటినిగురించి వేరే ప్రశ్న వేస్తే వివరాలు చెప్పగలనుకాని ఇప్పుడు కనిగిరినిగురించి వేసినప్రశ్నకు సంబంధించిన file మాత్రము నావద్దవున్నది.

Mr. SPEAKER:—

ఈ ఉదయగిరినిగురించి వేరే ప్రశ్న వేయమన్నారండీ.

SRI SHAIK MOULA SAHIB:—

యీ వుదయగిరి నియోజకవర్గమనేది కనిగిరి ఉదయగిరి తాలూకాలకు సంబంధించినదికాబట్టి యీ ప్రశ్నకు ఇందులోనే జవాబుయివ్వాలని కోరుతున్నాను.

The Hon. SRI G. LATCHANNA:—

ఇప్పుడు నాదగ్గరకువచ్చినది కనిగిరిలోని 29 గ్రామాలకు సంబంధించినదని మనవిచేశాను. మిగతా బోగట్టాలకు వేరేప్రశ్న వేస్తే మనవిచేస్తాను.

SRI S. VEMAYYA :—

ఇందునుగురించి reference Chief Engineer గారికి పంపించారని అన్నారు ఇది ఎప్పుడు పంపించారు? ఎప్పటిలో ప్రభుత్వమువారిదగ్గరనుంచి report రావాలని ఆదేశించారు?

The Hon SRI G. LATCHANNA:—

ప్రభుత్వము Chief Engineer కు scheme పంపించడముకాదు. ఏదైనా proposal వస్తే Chief Engineer scheme లన్ని తయారుచేసి finalise అయిన తర్వాత ఆమోదానికై ప్రభుత్వానికి పంపిస్తారు.

1st February 1956

SRI G. YELLAMANDA REDDI:—

కనిగిరిలో ప్రస్తుతము ప్రారంభిస్తామన్న Diesel Station ఎప్పుడు ప్రారంభిస్తారండి ?

The Hon. SRI G. LATCHANNA:—

వచ్చేఏడాది Budget వివరాలన్నీ తెలిసికొన్న తర్వాతగాని చెప్పలేము. ఇప్పుడు sanction అయిన స్కీములు సుమారు 4 కోట్ల రూపాయల విలువగలవి pending లో వున్నాయి.

*Travelling allowance to Gazetted Officers.*

**256—**

* 307 Q.— SRI T. LAKSHMINARAYANA REDDI:—

Will the Hon. Chief Minister be pleased to state—

(a) whether it is a fact that the Gazetted Officers (drawing a salary of Rs. 500 and below) are allowed only second class travelling allowance even after the revision in Railway Classes after 1st April 1955; and

(b) the reasons therefor ?

The Hon. Dr. B. GOPALA-REDDI:—

(a) "Yes Sir; but these officers are entitled to travel by the I Class when they undertake night journeys by rail involving not less than 3 hours of travel between 9 p. m. and 6 a. m."

(b) "The decision to allow these officers to travel by the new II class was based on a similar decision taken in January, 1949, when similar re-classification of accommodation was made in the Railways"

SRI S. VEMAYYA:—

ప్రయాణము రాత్రిపూట చేశారా పగలుచేశారా అనేసంగతి తెలిసికొనే దానికి ఏదైనా ఆధారముందా?

The Hon. Dr B. GOPALA REDDI:—

Certificate యివ్వవద్దా మేము ఫలానా ఘంటనుండి పలానా ఘంటవరకూ పలానా స్టేషనునుండి పలానా స్టేషన్ వరకు travel చేశామని.

*Tamilians working in Public Works Department.*

**257—**

347 Q.—SRI A. VENKATARAMA RAJU:— Will the Hon. Deputy Chief Minister be pleased to state—

1st February 1956 ]

(a) whether there are any Tamilians working now as upper division and lower division clerks and peons in the Public Works Department including the Secretariat; and

(b) if so, the number in each branch ?

The Hon. SRI N. SANJEEVA REDDI:—

(a) The answer is in the affirmative.

(b)

| | Upper Division Clerks. | Lower Division Clerks | Peons |
|---|---|---|---|
| Public Works Secretariat | Nill | Nill | 3 |
| Highways department. | Nill | 1 | 3 |
| Public works department including Irrigation branch. | 16 | 5 | 16 |
| Electricity Department. | Nill | 9 | 61 |

SRI A. VENKATARAMA RAJU:—

ఇప్పుడు ఈ బాధ్యతలను నిర్వహించడానికి తగినటువంటివారు యీవేళ తెలుగువారిలోలేరని ఇంకా వారిని ఉంచారా? లేకపోతే ఏకారణముచేత ఉంచారో తెలియ జేస్తారా?

The Hon. SRI N SANJEEVA REDDY:—

ఇప్పుడు వాండ్లు ఇక్కడకు వచ్చినారు, వాండ్ల అనుభవాన్ని ఎందుకు పోగొట్టుకోవాలని వాండ్లను ఇక్కడనే వుంచినారు. Partition రోజులలో వచ్చినవారిని Electricity department విషయంలో యీ ఆఫీసు ఇంకా మద్రాసులోనే వుంది. 61 మంది peons ఇప్పుడు అక్కడవున్నారు. వాండ్లను తీసివేసి అందరు తెలుగు వాండ్లనే appoint చేయుడమువల్ల వచ్చే పెద్దఘనమైనలాభము తెలుగుదేశానికి లేదని peons అట్లనే retain చేస్తువున్నారు.

SRI S. RANGANATHA MUDALIAR:—

When they are subjects of the State why should they not be appointed and why should there be this sort of discrimination.

The Hon SRI N. SANJEEVA REDDI:—

Absolutely no discrimination. Sir. Only these Tamilians should not claim to go back to madras every now and then and still claim this. The only difference is they should not do both.

SRI S. RANGANATHA MUDALIAR:—

If the question is setteld, there would be no trouble. Afterwards they will settle down as peaceful loyal subjects.

SRI P. GOPALU REDDI:—

అధ్యక్షా, మన ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తర్వాత మద్రాసు ప్రభుత్వము Transport Departmentలో వున్న ఆంధ్రులను ఉద్యోగమునుంచి బర్తరఫుచేసినారు. ఆవిషయము మన ప్రభుత్వానికి తెలుసా? అందుపైన ఏమిచర్యతీసుకున్నారో తెలుపగలరా?

The Hon. SRI N. SANJEEVA REDDI:—

నాకు సంభంధించిన ప్రశ్నకాదనుకొండి. ఐనప్పటికీ నేను Transport Minister గా వుండినామకాబట్టి కొద్దిగా అప్పుడు తెలుసుకొన్న సమాచారము చెప్పుతాను. కొంతమందిని తీసివేశారని తెలుసు ప్రభుత్వానికి వ్రాసినాము కాని retrenchment వల్ల తెలుగువాండ్లతోబాటు అరవవాండ్లనుకూడా కొన్ని ఉద్యోగాలనుంచి తీసివేశారు. వాండ్లలో తెలుగువారుకూడా పోయినారని సమాధానము వారు చెప్పినారు. తెలుగువారుకాబట్టి ఉద్యోగములోనుంచి తీసివేశామని వారు అంగీకరించలేదు. దానిని మనము accept చేయవలసియున్నది.

SRI D. KONDAYYA CHOWDARY:—

ఇప్పుడు యీ తమిళులు ఉన్నారని చెప్పారు. వారు శాశ్వతంగా ఆంధ్ర రాష్ట్ర పౌరులా? లేకపోతే వాండ్ల ఉద్యోగమైన తర్వాత మరల మద్రాసు చేరేటటువంటి Tamilian పౌరులా?

The Hon. SRI N. SANJEEVA REDDI:—

ఏదో పాపము peons గా వచ్చారు. కొన్నాళ్లు అయినతర్వాత తెలుగు పూర్తిగా నేర్చుకుంటారు ఇక్కడనే. లేకపోతే ఇక్కడనే పెండ్లిండ్లు చేసుకుంటారు. ఎందుకు బాధపడడము దీనినిగురించి.

SRI FILLALAMARRI VENKATESWARLU:—

Irrigation Department లో upper division clerks 16 మంది ఉన్నారు. ఈ ఒక్క department లోనే యింత ఎక్కువమంది యు. డి. సి. లు. ఉండడానికి కారణమేమైనా ఉందా?

The Hon. SRI N. SANJEEVA REDDI:—

దీనికి కొంచము technical knowledge కావాలి. Electricity department కాని Irrigation department కాని వాటిలో subject matter కొంచెము

అనుభవముఉంటే తప్ప new graduates ను తీసుకొస్తే కొన్నాళ్ళు కొంత కష్ట మౌతుంది. కాబట్టి వచ్చినవాండ్లను కొందరిని retain చేసుకుంటున్నాము. ఈ Department పెరిగింది. ఎంత పెరిగిందికూడా నేను చెప్పలేను unless you give me a separate question. ఇంత పెరిగిన తర్వాత ఎంతోమందికి ఉద్యోగాలు యిచ్చినాము. ఆంగ్రులకు ఎప్పుడు ఊహించనివాండ్లకుకూడా promotions వచ్చినాయి. అలాంటప్పుడు కొంచెము అనుభవమున్నవాండ్లను ఎందుకు పంపడమనే ఉద్దేశంతో వాండ్లను కొందరిని retain చేసుకుంటున్నాము.

SRI S. VEMAYYA:—

ఈమధ్య మద్రాసు ప్రభుత్వమువారు Peons cadre లో నున్నవారిని వారికే కేటాయించి పంపవలసిందిగా ఆదేశించినట్లు తెలుస్తుంది. అటువంటి ఆదేశమేదైనా యీ ప్రభుత్వానికి అందిందా? అందితే యీ ప్రభుత్వము దానిమీద ఏమిచర్య తీసుకున్నది?

The Hon. SRI N. SANJEEVA REDDI:—

ఇదేమో నాకు తెలియదండి. ఇంకొక ప్రశ్నవేస్తే ముఖ్యమంత్రిగారు between states and states కు Correspondence జరిగిఉంటే వారు సమాధానము చెప్పతారు.

*Representation from Pattikonda Panchayat Board, Kurnool district.*

**258—**

* 545 Q:—SRI C V. SOMAYAJULU:— Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether the Government have received any representation from the Pattikonda Panchayat Board in Kurnool district requesting the Government to hand over the Munroe Tope to the Panchayat Board; and

(b) if so, the action taken thereon?

The Hon. SRI K. CHANDRAMOULI:—

(a) Yes.

(b) The matter is under examination.

*Representations from Handloom Weavers' Organizations.*

**259:—**

* 284 Q—SRI PRAGADA KOTAIAH:— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

February, 1956 ]

SRI P. VENKATASUBBAYYA:—

weavers' co-operative సొసైటీసులో కాకుండా ప్రత్యేకంగా మాస్టరు వీవర్సు దగ్గిర పనిచేసేటటువంటి యీవీవర్సుకు యేవిధమైనటువంటి సహాయం సెస్సు ఫండుక్రింద అందచేస్తారో తెలియచేస్తారా?

The Hon. SRI K. VENKATA RAO:—

ఈ 10 లక్షల రూపాయల్లో రెండులక్షలరూపాయలు అందుకోసం ఖర్చుపెట్టబడ్డాయి.

*Award given by Industrial Tribunal in the case of Bus Owners.*

**260—**

* 443 Q.—SRI V. VISWESWARA RAO: Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the Government are aware of the fact that the award given by the Industrial Tribunal in case of the bus owners and the labourers in West Godavari district was not implemented by the bus owners.

(b) whether it is brought to the notice of the Government. and

(c) if so, the action taken thereon ?

The Hon. SRI G. LATCHANNA:—

(a) to (c)

It is not clear from the question to which award the member refers. There are four awards of the Industrial Tribunal relating to Motor Transport Services in West Godavary District. Reports on non-implementation of the awards in respect of 2 cases have been received by the Government. In one case the Government have sanctioned prosecution of the bus owner of the Transport Service and in the other the question of sanctioning prosecution is under consideration.

గౌరవ సభ్యులు యే అవార్డుగురించి అడుగుతున్నారో తెలియదు పశ్చిమ గోదావరిజిల్లాలో మోటారు రవాణా పరిశ్రమలకు సంభంధించినవి నాలుగు అవార్డులు వున్నవి. అందులో రెంటిని గురించే ఫిర్యాదులు ప్రభుత్వానికి చేరినవి. ఒకదాని యజమాన్ని ప్రాసిక్యూషన్ చేయడానికి ప్రభుత్వం ఆర్డరు జారీచేసింది. యింకో దానిని గురించి యే విధమైన చర్య తీసుకోవడం అనేది ఆలోచిస్తున్నాము.

1st February 1956]

SRI V. VISWESWARA RAO:—

అధ్యక్షా! ఒకదానివిషయంలో చర్యతీసుకుంటానికి ఆర్డర్సు ప్యాసు చేశామన్నారు. రెండోదాంట్లో పరిశీలన ఎంతకాలంలో ముగిస్తారు?

The Hon. SRI G. LATCHANNA:—

అది పరిశీలనఅంటే యేయొక్క ప్రొప్రైటరుమీద మొట్టమొదట డిస్ప్యూటు వచ్చిందో ఆ డిస్ప్యూటు ట్రిబ్యునల్‌కు refer కావడం ట్రిబునల్ జడ్జిమెంటు యిచ్చేసరికి proprietor బస్సులను మరొకరికి అమ్ముకోవడం జరిగింది. ఆకొత్తవారుమీద చర్య తీసుకొనడానికి లీగల్‌గా మనకెంతవరకు అవకాశం వున్నదీ పరిశీలన జరుగుచున్నది.

SRI S. VEMAYYA:—

ఎంతకాలంగా యీ పరిశీలన ప్రభుత్వం దృష్టిలో ఉన్నది యెంతకాలంలో దీనిమీద చర్యతీసుకొని ప్రాసిక్యూషన్ గాని, మరొక decision తీసుకొనేదానికి ప్రభుత్వం ఆలోచిస్తుంది?

The Hon SRI G. LATCHANNA:—

ప్రస్తుతం నావద్దనున్నటువంటి information లో dates లేవు. ఇది లీగల్ డిపార్టుమెంటుకి refer అయింది.

*Sale of minor produces like Tangedu bark and Thooki leaves, etc., in Maddikattu area.*

**261—**

* 308 Q:— SRI P. GOPALU REDDI: Will the Hon. the Chief Minister be pleased to state:—

(a) Whether it is a fact that the minor produces like Thangedu bark and Thooki leaves, etc. in Maddikattu area in Tiruttani taluk Chittoor district, have been sold by two agencies viz. (1) District Forest Officer, (2) By the Tahsildar-Manager in June 1954; and

(b) if so, the reasons therefor?

The Hon. Dr. B. GOPALA REDDI:—

(a) Minor forest produce in the Forest area was sold by the District Forest Officer and that in porambokes by the Revenue authorities.

(b) This is the usual practice. Porambokes are under Revenue Department.

*Improvement for the sale of handloom cloth.*

**262**—

* 293 Q:—SRI S. RANGANATHA MUDALIAR:— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the amount under Cess Fund Scheme spent so far under the following heads—

(i) amount spent for improvement for sale of handloom cloth and aid given to them; and

(ii) amount spent for establishment and travelling allowance?

The Hon. SRI K. VENKATA RAO:—

(i) Rs. 4,00,/-339 was spent by the Andhra Handloom Weavers' Co-operative Society of which Rs. 3,47,042/- was reimbursed to the Society upto 31-3-1955.

(ii) An expenditure of Rs. 1,59,144 and Rs. 20,421/- was incurred on establishment and travelling allowance respectively.

(1) 4,03,339 రూపాయలు ఆంధ్రా Hand-loom Weavers' co-operative Society వారు ఖర్చుపెట్టగా 3,47,042 రూపాయలు 31-3-1955 లో సంవత్సరం తేదీకి వారికి తిరిగి యివ్వడం జరిగింది.

(ii) 1,59,144 రూపాయలున్ను, 20,421 రూపాయలున్ను Establishment, Travelling allowances క్రింద యీసందర్భంలో ఖర్చుఅయ్యాయి.

*Withholding of Land Cess due to Village Panchayats*

**264**—

* 495 Q—SRI B. V. SIVAIAH: Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether it is a fact that the Government are withholding the share of the Land Cess due to the Village Panchayats since 1952; and

(b) the reasons for withholding the allocations?

The Hon. SRI A. B. NAGESWARA RAO:—

(a) Panchayats' Share of land cess has never been withheld from them, as far as the Government are aware.

(b) Does not arise.

SRI B. V. SIVAYYA:—

గుంటూరు తాలూకాలో ఒక పంచాయతీకికూడా లాండుసెస్సు 1952 సంవత్సరంనుంచి రాలేదు. ఈవిషయమై వెంటనే కలెక్టరాఫీసుకి ఉత్తరవులిస్తారా?

The Hon. SRI A. B NAGESWARA RAO:—

ఈ లాండు సెస్సు adjustment కి జనవరి 15 వ తారీఖున జూలై 15 వ తారీఖున అడ్వాన్సు ప్రీగాయిస్తునే వస్తున్నారు. Sub-Treasury Officers పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లకి యిన్ఫర్మేషన్ యిస్తున్నారు. దానితరువాత నెల రోజులలోపుగా వారు తీసుకోవాలి. ఆనెలరోజులలోపుగా గనక తీసుకోపోనట్లయితే యీ Sub-Tresury Officer లే తర్వాత జనవరి అయ్యేటట్లు అయితే 31 వ మార్చిలోపుగాను జూలై 15 నవ తారీఖు వాయిదా గనుక అయినట్లు అయితే ఫిబ్రవరి 15 లోపుగను వాళ్లే పంపిస్తారు. ఒకవేళ గనుక అవాయిదాలుదాటినట్లయితే —3 సంవత్సరాలు గనుకదాటినట్లయితే—ప్రభుత్వం నిరాకరిస్తుంది. 3 సం॥ లోపున అయితే అది శాంక్షన్ చేయడానికి ప్రభుత్వానికి హక్కువుంది. అర్జీలు కనుకవస్తే తప్పకుండా అటువంటివి ప్రభుత్వం విచారిస్తుంది.

SRI D KONDAIAH CHOWDARY:—

Estates తీసుకున్నారు గవర్నమెంటు జమీందార్లదగ్గరనుండి తీసుకొన్నటువంటిగ్రామాల్లో ఒక మైనరు పంచాయితీ బోర్డుకుకూడా, యిప్పటికి దాదాపు 4 సంవత్సరాలు, 5 సంవత్సరాలనుంచికూడా, యీ సెసస్ అందటంలేదు. అందువల్ల వాళ్లకి యే విధమైనటువంటి ఆర్థిక పరిస్థితులులేక యేపని చేయలేకున్నారు ఆ విషయం త్వరగా మంత్రిగారు దర్యాప్తు చేయించి యీ 4, 5 సంవత్సరాలనుంచికూడా వాళ్లకు రావలసినటువంటి Land cess వెంటనే యిప్పించేటట్లు ప్రయత్నిస్తారా?

The Hon. SRI A. B. NAGESWARA RAO:—

గౌరవసభ్యుడు గనుక యేయే పంచాయితీలకు అందలేదో దానిని వ్రాతమూలకంగా పంపించేటట్లయితే తప్పకుండా విచారించి 3 సంవత్సరాలు దాటకుండావుంటే యిప్పించే పద్ధతి వుంటుంది.

SRI P. SREERAMULU:—

అసలు పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లువచ్చి తీసుకొనే విధానాన్ని మానివేసి పోస్టు మనిఆర్డరు ఖర్చులు పంచాయితీబోర్డుకేవేసి దాన్ని మినహాయించి సెస్సులు మనిఆర్డరుద్వారా పంపించే ఏర్పాటు ప్రభుత్వంచేస్తే సులువుగా వుంటుందేమో అది విచారిస్తారా?

1st February, 1956 ]

The Hon. SRI A. B NAGESWARA RAO:—

నేను మొదటనే చెప్పాను. మనిఆర్డరు ఖర్చు మినహాయించుకొనే ఆనెల రోజులలోనే గనుక వాళ్లు తీసుకోకపోనయిట్లుఅయితే తరువాత జనవరి 15 వ తారీఖు యివ్వవలసింది మార్చి 31 లోపుగాను Jule 15 వ యివ్వాల్సింది Next year Feb. 15 లోపుగాను Sub Treasury Officer పంపిస్తున్నారని చెప్పాను.

*Opening of Masterweavers' Aid Societies in the State.*

**265—**

* 454 Q.— SRI N C. SESHADRY: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether the Government propose to open Masterweavers' Aid Societies in the State?

The Hon SRI K. VENKATA RAO:—

(a) and (b)

No such proposal is under concideration of Government at present

ఇటువంటి ప్రతిపాదన ప్రభుత్వంవారి దృష్టిలో వర్తమానంలోలేదు.

SRI N. C. SESHADRY:—

అధ్యక్షా! వర్తమానంలో లేదన్నారు. అయితే యిప్పుడు co-operative fold లో కంటెకూడా యీ మాస్టరు వీవర్సుక్రింద చాలామంది ఉందే సమాచారం ప్రభుత్వానికి తెలుసు. అసలు యిది ఆచరణ సాధ్యమా కాదా అనేటటువంటి విషయంలో ప్రభుత్వం ఏమైనా శ్రద్ధ తీసుకొంటుందా? భవిష్యత్తులో యింతలోపల నేమైనా చేసేటటువంటి ప్రతిపాదన ప్రభుత్వం దగ్గరవుందా?

The Hon. SRI K. VENKATA RAO:—

ప్రభుత్వం వారియొక్క సదుద్దేశం యేమిటంటే మాస్టరు వీవర్లయొక్క clutches లో నుంచి యీజనాన్ని తప్పించి కో-ఆపరేటివ్ సొసైటీలలో పెట్టి జనానికి యెక్కువ వుపకారం చేయడం. అందువల్ల భూతభవిష్యత్తు వర్తమానాలలో యీవిషయంలో ప్రభుత్వం తీసుకొనే అవకాశంలేదని మనవి చేస్తున్నాను.

SRI P SATYANARAYANA:—

మాస్టరు వీవర్సుయొక్క clutches యీ తరంలో విముక్తిచేయడం అసంభవం అని All India Hand loom వారు నిర్ణయంచేసారు. అందువల్లనే అనేక రాష్ట్రాలలో Hand loom cess యొక్క సహాయనిధి మాస్టరు వీవర్సుయొక్క channels

1st February 1956

ద్వారా కూడాను సహాయం జరుగుతూ ఉన్నది. ఆంధ్రదేశంలో అదేమాదిరిగా సెస్సుఫండును కొంతవరకు వినియోగించి మార్కెటింగు సొసైటీలను గనుక పెట్టినట్లయితే యిప్పుడున్న 3 లక్షల మగ్గాలు మాస్టరు సొసైటీసులోకి తీసుకరావడం యింకా 10 యేండ్లదాకా సాధ్యంగాదు. కనుక యీ మార్కెటింగు సొసైటీలకు సెస్సుఫండుని వినియోగించేటటువంటి విషయాన్ని ఆలోచిస్తారా?

The Hon. SRI K. VENKATA RAO:--

All India Hand-loom Board వారి యొక్క వ్యవహారం నాకేమీ తెలియలేదు. కాని నామిత్రులు సత్యనారాయణగార్కి యెలా తెలిసిందో తెలియదు. వారు నేను ఒక శేభావాలతో 1921 లో బయలుదేరినా యిప్పుడు ఆయన ముందుకి నేను వెనక్కి వున్నాము. కొంతవరకున్నా అటువంటి వారుకూడా భూస్వామి దగ్గరనుంచి రైతునీ, రైతుదగ్గరవున్నటువంటి కూలిని యింకా అన్ని విధాల్లోనున్న ఆమాస్టర్ని తగ్గించి Servant కి సహాయం చేసేటటువంటి మంచి గట్టినమ్మకం గల్గినటువంటి సత్యనారాయణగారే యిటువంటి దృష్టిలో పడటం చాలా విచారకరమైన విషయం. అయినప్పటికీ యీ విషయంలో వారికంటే నేను ముందుకువెళ్లి యిటువంటిపని నా అధికారంలో వుండగా జరక్కుండా చూస్తానని మనవి చేస్తున్నాను.

SRI PRAGADA KOTAIAH:—

ఈ సహకారసంఘాలకు వెలుపలనున్నటువంటి వారికి యింతలో సహకార సంఘాలకు తీసుకొని రావడం సాధ్యంకాదు. అందువల్ల బయటనున్నవారికి యేదైనా సరాసరి సహాయం చేయడానికి ఆలోచన చేస్తున్నారా? అంటే All India Hand loom Board వారు ఒక కమిటీని యేర్పాటుచేసి కొన్ని ప్రతిపాదనలను మన రాష్ట్ర ప్రభుత్వానికికూడా పంపించారు. దానిమీద యీ ప్రభుత్వంవద్ద చేనేత సహకార సంఘాలకు వెలుపల నున్నటువంటి చేనేత పారిశ్రామికులకు సరాసరి సహాయం చేయడాన్కి యేదైనా ప్రతిపాదనలున్నవా?

The Hon. SRI K. VENKATA RAO:—

ఇప్పుడే మనవి చేశాను ఇప్పుడిచ్చే rebate స్కీములో సహకార సంఘాల్లో లేకుండా బట్ట నేసేటటువంటివార్కికూడా సహాయం చేయడాన్కి కొంతడబ్బు ఖర్చుపెట్టుతూనే వున్నాము. అసలు వుద్దేశం యేమిటంటే సహకార సంఘాల్లోకి తీసుకరావడం ఆదర్శం. ఈలోపుగాగనుక యెవరైనా సహకార సంఘాలకు బయటవుండి కూలివృత్తిచేసుకొని బట్టనేసుకొనేవార్కి సహకారంచేసే విషయంలో ఆలోచించడాన్కి అభ్యంతరంలేదు. మాస్టరు వీవర్సు విషయమై నేను చెప్పాను. మాస్టరు వీవర్సు వుండాలనే భావంతోటి యీ సభవారు యేకీభవిస్తారని నేను అనుకోను.

*Secondary grade trained teachers, in Elememtary Schools of District Board,*

**326.**—

*265 Q—SRI V. VISWESWARA RAO: Will the Hon. the Chief Minister be pleased to state:

(a) whether the Government are aware of the fact that some secondary grade trained teachers employed in the elementary schools of the District Boards are paid only higher grade scales of pay:

(b) if so, the aggregate number of such teachers now in the province; and

(c) whether the Government propose to enhance the present scales of pay of these teachers to the secondary grade scales of pay?

The Hon. Dr. B. GOPALA REDDI:—

(a) The answer is in the affirmative.

(b) 458

(c) As the Secondary grade teachers are appointed in the Higher grade posts, the question of enhancing the scales of pay of these teachers to that of Secondary grade scales of pay does not arise.

SRI V. VISVESWARA RAO:—

అధ్యక్షా! వారు secondary grade pass అయినప్పటికీకూడా వారికి higher grade జీతం ఇవ్వడము న్యాయముకాదు. కాబట్టి వారికి secondary grade జీతం ఇచ్చుటకు వెంటనే orders జారీచేస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

అది higher grade post. ఆ post కు ఎంత జీతముఉన్నదో దానినే ఇస్తారు కానీ, ఈయన M. A. Pass అయినాడని M. A. జీతం ఇవ్వమంటే సాధ్యంకాదు.

SRI M. NAGI REDDI:—

అధ్యక్షా! అదే aided schools లో higher grade post లో పనిచేస్తున్నప్పటికి secondary grade teachers కు secondary grade scale ఇస్తున్నారు. కాని జిల్లాబోర్డు schools వచ్చేప్పటికి higher grade post లో ఉన్నాడు కాబట్టి higher grade scale అంటున్నారు. ఆ తారతమ్యం ఎందుకు వచ్చిందో మీకు తెలుసా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

నాకు ఇంతకుముందు తెలియదు. Aided schools లో secondary grade వారు ఎవరైనా higher garde post లో ఉంటే వాళ్లకు higher grade జీతమే వచ్చేట్లుగా చూస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

ఇప్పుడు ఏ Head master అయినా ఆయన I Form నకు చెప్పినా II Form నకు చెప్పినా Head master జీతమే ఇస్తుంటారు. కాని అదేవిధముగా వీళ్లకుకూడా ఏ Class కు చెబుతున్నప్పటికికూడా వాళ్ల grade కు సంబంధించిన జీతమేఇస్తారా?

The Hon. Dr, B. GOPALA REDDI:—

అది న్యాయముఅయిన విషయముకాదు. ఆ post ను బట్టి వారిజీతం ఉంటుంది అసలు వాళ్ళను ఈ post కు వేయడమే చాలా ఉదారమైన చర్యతీసుకున్నట్లు అవుతుంది, వాళ్ళకు ఉద్యోగము ఎక్కడాదొరక్క, అదే ఇవ్వండి అంటే ఇస్తున్నారు. ఈజీతమే ఇస్తారని చెబుతున్నా వాళ్ళు ఇవ్వమని అడుగుతున్నారు. కాబట్టి revise చేయడానికి వీలులేదు.

SRI M. BAPAYYA CHOWDARY:—

అయితే ఇప్పుడు ఈ secondary grade training pass అయినా higher grade ఉద్యోగము ఇచ్చినప్పుడు మేము higher grade జీతమే తీసుకొని పని చేస్తాము అని వ్రాతమూలకంగా ఇచ్చినందువల్ల, అలా జీతాలు ఇస్తున్నారని ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Dr. B. GOPALA REDDY:—

సంపూర్ణంగా తెలుసు.

Mr SPEAKER:—Questions Nos. 327 and 328 will be taken up together.

*Supply of water to the irrigation canals in the West Godavari District.*

**327—**

* 368 Q.—SRIMATHI C. AMMANNA RAJA: Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) whether it is a fact that after the Godavari Floods the River has been silted up and that there is do sufficient supply of water to the irrigation canals in the West Godavri District:

(b) if so, the area of lands affected thereby; and

(c) the steps the Government proposed to take in the matter?

The Hon. SRI N. SANJEEVA REDDY:–

(a) It is a fact that shoals have formed up stream of the Dowlaishwaram anicut, after the flood season of 1953–54 and 55. By timely precautionary measures like dredging, bull-dozing and excavating channels in the shoals, the water supply for irrigation of the deltas in 2nd crop season has been maintained.

(b) Does not arise.

(c) Dredging the shallow portions is going on now. Bull-dozing and excavation by manual labour will be resorted to when those items of work are made possible and necessary due to low water.

*Dredging out the sand above the Godavari Anicut.*

**328–**

* 657 Q.— SRI P. GURRAJU: Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether there is any proposal with the Government to dredge out the sand that accumulated above the Godavari Anicut?

The Hon. SRI N. SANJEEVA REDDI:–

Except to keep the approach channels to the three head sluices clear of sand or silt nothing else is feasible or necessary. Hence no steps are proposed to be taken to dredge out the sand above the Godavari Anicut.

SRI A. VENKATRAMA RAJU:—

ప్రతి సంవత్సరముకూడా ఈ కాలువలన్ని వరదలువచ్చి మెట్టవేస్తున్నాయనే విషయం గవర్నమెంటుకు చాలా reports వచ్చి ఉంటాయి. అందువల్ల permanent గా డ్రెడ్జరును తీసుకవచ్చి అక్కడ పెట్టాలనే విషయము ప్రభుత్వ దృష్టిలో ఉన్నట్లు తెలుస్తున్నది. అదినిజమా? అది ఎంతకాలములో జరుగుతుంది?

The Hon. SRI N. SANJEEVA REDDI.–

అది నిజమో అబద్ధమో ఇప్పుడు చెప్పలేను. వేరేప్రశ్నవేస్తే ఎప్పుడు తెస్తామో ఏస్థితిలో ఉన్నదో చెబుతాను. ఊరికే ఆలోచించి మాదృష్టిలో ఉన్నదని చెప్పడంలో purpose ఏమీ లేదనుకుంటాను.

SRI M. NAGI REDDI: –

ఈ Local Development Works, National Extention Schemes Works వచ్చేటప్పుడు 25% పంచాయితీబోర్డులను contribution ఇవ్వమనడము 25% ప్రజలను ఇవ్వమనడము జరుగుతున్నప్పుడు technical కు సంబంధించినటువంటివితప్ప మిగిలినవి మామూలుగా సాధారణమైనటువంటి పనులు కంట్రాక్టర్లకు ఇచ్చేబదులు గ్రామ పంచాయితీలకుగాని, గ్రామ ప్రజలకుగాని, Labour Contract Societies కు గాని ఎందుకు ఇవ్వకూడదు.

The Hon. SRI K. VENKATA RAO: –

కంట్రాక్టర్లుకూడా గ్రామప్రజలలోవారే.

SRI M. NAGI REDDI: –

అధ్యక్షా, కంట్రాక్టర్లు గ్రామప్రజల్లో వారు అయినప్పటికి, వాళ్లు లాభాలను ఆకాంక్షించేవారు. వాటిని Labour Contract Society లకుగాని, పంచాయితీ బోర్డులకుగాని ఇచ్చినట్లయితే, ఆడబ్బుఅంతా వ్యక్తిగతం కాకుండా గ్రామ ప్రజలందరికి వినియోగిస్తుంది.

The Hon. SRI K. VENKATA RAO: –

టెండర్లు పిలిచినప్పుడు దానివల్ల గవర్నమెంటుకు కొంత లాభమువస్తుంది. కోటానుకోట్ల రూపాయలు ఖర్చుపెడుతున్నాము ఆ దృష్టితో చేస్తున్నాము. మామూలుగా మిగిలినవారుకూడా చేస్తే వారికికూడా ఇవ్వడానికి అభ్యంతరంలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

అధ్యక్షా, Labour Co-operative Society లకు ఇచ్చినట్లయితే ఎక్కువ మందికి జీవితము దక్కుతుంది. Labour కు పనిదొరుకుతుంది. కనుక అవన్నీ దృష్టిలోపెట్టుకొని labours preferance ఇవ్వటానికి ఆలోచిస్తారా?

The Hon. SRI K. VENKATA RAO:—

Labour Co-operative Society లు దీనికి కావలసినటువంటి sanitary పనిముట్లు వగైరాలు తయారుచేయలేదు. వారు ఎక్కడనుంచి అయినా తెచ్చుకోవాలి దానికి పెట్టుబడిపెట్టే సమర్థతకూడా వారికి ఉన్నదా లేదా అని ఆలోచించాలి. త్రవ్వడం వగైరా పనులు వచ్చినట్లయితే వాళ్ళకుకూడా ఇవ్వడానికి అభ్యంతరములేదు

*Supply of Electricity to Repalle.*

**331–**

* 564 Q – SRI ANAGANI BHAGAVANTHA RAO: Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) whether there are proposals with the Government for the supply of Electricity to Repalle; and

(b) If so, when?

The Hon. SRI G. LATCHANNA.—

(a) and (b):

A proposal is under consideration.

*Municipal Council, Vijayawada accepting a tender for paddy straw.*

**332—**

* 262 Q— SRI V. VISWESWARA RAO: Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state:

(a) whether it is a fact that the Municipal Council, Vijayawada has accepted a tender for paddy straw at the maximum rate of Rs. 30–8–0 for 1000 lbs.;

(b) whether any representations have been received against this from the Councillors and the public; and

(c) the action taken thereon.?

The Hon SRI A. B. NAGESWARA RAO:—

(a) The answer is in the affirmative.

(b) The answer is in the affirmative.

(c) The Government considered that the Municipal Council has committed an irregularity in accepting the tender in this case. The Council has been warned against recurrence of such irregularities. The Examiner of Local Fund Accounts will also take necessary action in the matter

SRI V. VISWESWARA RAO:—

అధ్యక్షా! దీనివిషయములో మునిసిపలు కౌన్సిలు ప్రభుత్వమువారికి తెలియ శేపిందిఅన్నారు. దీనిమీద ప్రభుత్వము తీసుకొన్న చర్యలుఏమిటి? ఇటువంటి మునిసిపలు కౌన్సిల్సు ఈ టెండర్లను ఒప్పుకోవడములో వాటికి చాలా నష్టమువచ్చిందిఅని ప్రభుత్వము దృష్టికి తీసుకరావడముకూడా జరిగింది. మునిసిపలు కౌన్సిలుపైన ప్రభుత్వము ఎటువంటి చర్యతీసుకున్నది? మందలించామని చెబుతున్నారు ఆ మందలింపుతో సరిపెడుతారా? లేక వారిపైన సర్‌చార్జి వేసి తగుచర్యకూడా తీసుకోవడానికి ప్రభుత్వము పూనుకుంటుందా?

The Hon. SRI A. B. NAGESWARA RAO:—

ఆ టెండర్లవల్ల మునిసిపలు కౌన్సిలుకు రు 3,600 లు నష్టమువచ్చింది. అందువల్ల Examiner of Local Fund Accounts కెళ్ళి examine చేసి సర్ చార్జి కావాలంటే చేస్తారు.

*Location of Government Offices in private buildings in Srikakulam District.*

**333—**

* 301 Q:—SRI S. JAGANNADHAM: Will the Hon. the Chief Minister be pleased to state how much amount is being paid annually towards rent for the location of Government Offices in private buildings in Srikakulam District?

The Hon. Dr. B. GOPALA REDDI:— Rs. 67,734/-

SRI S. VEMAYYA:—

అధ్యక్షా! ఇప్పుడు శ్రీకాకుళములో ఉన్నటువంటి buildings కు ఇదివరకు 30 రూపాయలు అద్దెవున్నటువంటి ఇంటికి ఇప్పుడు 150 రూపాయలు ఇస్తున్నారు. టెక్కలిలోనుకూడా అలాగే కలెక్టరు ఆఫీసుకు 150 రూపాయలు ఉంటే ఇప్పుడు రు 500 లు ఇస్తున్నారు. కాబట్టి ప్రభుత్వము త్వరలో buildings కట్టుతారా? లేక అద్దెలు తగ్గించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

త్వరలో కట్టడము సాధ్యము కాకపోవచ్చును. అద్దెలవిషయము గమనిస్తాము.

*Representation from Andhra State Handloom Weavers' Congress.*

**334—**

* 640 Q:—SRI PRAGADA KOTAIAH: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state;

(a) whether the Government are in receipt of a representation dated the 6th September 1955 from the Andhra State Handloom Weavers' Congress regarding giving to the handloom industry a proper and fitting place in the Second Five Year Plan; and

(b) if so, the action taken thereon?

The Hon. SRI K. VENKATA RAO:—

As this was only a copy of the representation addressed to the Chairman, Planning Commission and in general terms, no action was specifically considered necessary on the representation on the part of this Government.

ఈ దరఖాస్తు Planning commission అధ్యక్షులకు పంపించి, ఒక copy ఈ ప్రభుత్వానికి పంపించారు. వారిదగ్గరనుండి క్రిందికివస్తే దీన్నిగురించి మేముకూడ ఆలోచించడము జరుగుతుంది.

## II Announcement reg :- Discussion on the Government Resolution regarding formation of Visalandhra

Mr. SPEAKER :—

The Govenment have given notice notice of resolution on the same subject on which Sri Pillalamari Venkateswarlu, Sri P. Sundarayya and Sri K. V. S. Padmamanabha Raju gave me a motion on the 30th ultimo. The Government motion is more comprehensive than the motion of the Hon. Members and I expect that they woluld not press it.

Sri PILLALAMARRI VENKATESWARLU:—

Yes, Sir, we are not pressing it.

Mr. SPEAKER :—

The Government Motion will be taken up at 3-45 this evening or earlier if the Andhra Court-Fees and Suits Valuation Bill is passed before that time.

## III Government Bill

THE ANDHRA COURT-FEES AND SUITS VALUATION BILL - 1955

*(as amended by the Select Committee Contd.)*

Mr. SPEAKER:—

We shall now take up clause 32.

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Mr. Speaker, Sir, that clause is still under examination. So, we shall take up clause 61.

(Sri K. Venkataramanayya Naidu was seen standing.)

Mr. SPEAKER :—

Clause 32 as drafted is quite all right. The drafting is rigorous. The Government are now pleased to minimise the rigour. They will come with an amendment.

Sri K. VENKATARAMANAYYA: —

Mr. SPEAKEER :— Sir, yesterday I pointed out that the provision that the courts should not pass a decree.

Mr. SPEAKER :— Decree for payment.

Sri K. VENKATARAMANAYYA :—

Whatever purpose it may be, nonetheless it is a decree. The moment the judgment is pronounced, the finality of it must

close in a decree. The wording in the draft clause which was placed before the House yesterday was " that the decree should not be passed if the full court-fee is not paid'. Then I suggested that a decree must automatically follow the judgment and if there was to be a provision that the decree should not be passed, we thought it would not be consonant with legalistic principle involved in the passing of a decree.

Mr. SPEAKER :—

I may point out to Mr. Venkataramanayya Naidu, that the decree ordering payment shall not be passed, and it is not an absolute bar to pass a decree. But the Government are now willing to mitigate the rigour of it by means of an amendment.

Sri K. VENKATARAMANAYYA :—

Mr. Speaker, Sir, yesterday I passed certain remarks that the clause does not convey any sense and I am very sorry for those remarks. I looked into a decision of the Madras High Court in the year 1954 wherein exactly a similar case which is in all fours with the present situation is found and where the Hon. Judge of the Madras High Court said that the decree can be refiled. Therefore, I withdraw my remarks of yesterday and I am sorry for having passed such remarks.

As it is, the drafting is all right. But we are only concerned with the postponement of the passing of a decree. In that respect we thought that the legal drafting was not correct and I am sorry for it. It is perfeetly correct and it is sound legally. So, as it is the draft clause can be passed if there is no objection.

The draft clause as it means that if eventually a sum which is far above the amount mentioned in the plaint, is found due and if the court fee on the excess amount is not paid, passing of a decree is deferred. My friend Mr. P. Basi Reddy who is a member on the Select Committee has just now approached me and said that the Hon. Deputy Chief Minister has agreed instead to introduce a provision that if the excess court-fee is not paid within a certain time, the claim to that extent may be dismissed and that for the original claim on which the stamp duty has been paid, the decree may be passed and that decree may be executed. If that is a fact and if it is acceptable to the Hon. minister, that amecdment can be passed.

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Sir, that decision is entirely different. What Mr. Venkataramanayya Naidu has said I am not prepared to accept. If court fee is paid for half the amount and if ultimately it is decided that the full court-fee has to be paid, the Government will stand to lose and the parties may come to terms. We will consider it in due course.

CLAUSE 61.

Clause 61 was put and carried.

Clauses 62 to 67 were put and carried.

CLAUSE 68

Mr. SPEAKER :— The motion is:

"That clause 68 do stand part of the Bill."

Mr. Pillalamarri Venkateswarlu has given notice of an amendment to this clause. It has not come in time and I am not admitting it. Even if I would like to admit it, I am afraid it does not fit in. The clause as it is already empowers the State Government to reduce or remit the court fee. If they are kind enough, they will do so in the case of Harijans.

SRI PILLALAMARRI VENKATESWARLU :—

In the case of Harijans, the Government *'shall'*. It is a verbal amendment

Mr. SPEAKER :—

It is not verbal.

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Mr Pragada Kotaiah also has said it yesterday. But we should not put it in the Bill. It becomes arbitrary.

Mr. SPEAKER :—

Then, in every provision there must be a proviso that Harijans shall be exempt.

SRI PILLALAMARRI VENKATESWARLU :—

అధ్యక్షా, యిప్పుడు House యొక్క feelings చెప్పేటటువంటి ఉపన్యాసాలు ప్రభుత్వమువారుకూడ విన్నారు. దీనికి General గా కొంత Provision కలుగజేయవలసిందని అనుకొంటున్నాము. వాళ్లను కొంత ఉద్ధరించవలెనని అందరికి ఉన్నది. అందుకు వాంట్లోకొంచము discretion ఇచ్చినారని అంటున్నారు. ఎవరికి ఇచ్చినట్లు ఉన్నది?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

ఆవిధంగా చేయడానికి ఇందులో అవకాశమున్నది. ఎక్కువైన బీదవాళ్లకుగాని, ఏదైనా ప్రత్యేకమైనటువంటి పరిసితులలో ఇబ్బందికలిగితే, కావలసిన అధికారము ఇందులో ఉన్నది. కాబట్టి ప్రత్యేకమైన దయచూపి ఈ చట్టములో పెట్టవలసిన అవసరములేదు.

1st Fubruary 1956

Mr. SPEAKER : –

I rule the amendment out of order.

Clause 68 was put and carried.

Clausee 69 to 79 were put and carried.

SCHEDULE I

Mr. SPEAKER :- The motion is :

"That Schedule I do stand part of the bill."

Sri S. VEMAYYA :— Sir, I move :

" In Article 1 (a) (i) for the word 'six' substitute the word 'four'."

The amendment was duly seconded.

Sri S. VEMAYYA :— I want the amendment to be put to vote as it affects the poor people and previously the charge was four annas.

Mr. SPEAKER :- The question is :

"In Article 1 (a) (i) for the word 'six' substitute the word 'four'."

The amendment was lost.

Sri S. VEMAYYA :— Sir, I move :

"In Article 1 (a) (i) for the word 'twelve' substitute the word 'eight'."

The amendment was duly seconded.

Mr. SPEAKER:-The question is :

"In Article 1 (a) (ii) for the word (twelve' substitute the word, 'eight'.)

The amendment was lost.

Mr. SPEAKER :-

There is another amendment in the name of Sri Vavilala Gopalakrishnayya 'In article 1 (b) (i) for the words 'nine annas' substitute the words 'twelve annas'. That is not permissible and we have to go to the Governor again for permission. So I rule it out of order.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Sir, I move :

"In Article 1 (b) (ii) for the words 'one rupee two annas' substitute the words 'one rupee'."

The amendment was duly seconded.

Mr. SPEAKER :— The question is :

"In Article 1 (b) (ii) for the words 'one rupee two annas' substitute the words 'one rupee'."

The amendment was lost.

Sri S. VEMAYYA :— Sir, I move

"In Article 1 (b) (ii) for the words 'one rupee two annae' substitute the words 'twelve annas'."

The amendment was duly seconded.

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL 1955
( As amended by the Select Committee )

1st Fubruary 1956

Mr. SPEAKER:—

The question is:

"In Article 1 (b) (ii) for the words 'one rupee two annas' substitute the words 'twele annas'."

The amendment was lost:

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Sir, I move:

"In Article 1 (c) (i) for the words 'nine annas' substitute the words eight annas'."

"In Article 1 (c) (ii) for the words 'one rupee two annas' substitute the words 'one rupee'."

The amendments were duly seconded.

Mr. SPEAKER:—

The question is:

"In Article 1 (c) (i) for the words 'nine annas' substitute the words 'eight annas'."

"In Article 1 (c) (ii) for the words 'one rupee two annas' substitute the words 'one rupee'."

The amendments were lost.

SRI S. VEMAYYA:—

Sir. I move:

"In Article 1 (c) (iii) for the word 'seven' substitute the word 'five'."

The amendment was duly seconded.

Mr SPEAKER:—

The question is:

"In Article 1 (c) (iii) for the word "seven" substitute the word 'five'."

The amendment was lost.

SRI S. VEMAYYA:—

Sir, I move:

"In Article 1 (c) (iv) for the word 'thirty' substitute the word 'twenty'."

The amendment was duly seconded.

Mr. SPEAKER:—

The puestion is:

"In Article 1 (c) (iv) for the word thirty' substitute the word 'twenty'."

The Amendment was lost.

Mr. SPEAKER:—

The other amendments standing in the name of Sri S Vemayya cannot be admitted as they seek to enhance the fee.

Article I was put and carried.

Article 2

SRI S. VEMAYYA:—

Sir I move:—

"In article 2 (a) for the word 'five' substitute the word 'four'."

The amendment was duly seconded.

Mr. SPEAKER:—

The question is:
"In article 2 (a) for the word 'five' substitute the word 'four'."
The amendment was lost.

SRI S. VEMAYYA:—

Sir I move:

"In Article 2 (b) for the word 'five' substitute the word 'four'."

The amendment was duly seconded.

Mr. SPEAKER:—

The question is:

"In Article 2 (b) for the word 'five' substitute the word 'four'."

The amendment was lost.

Article 5 was put and carried.

Articles 6 and 7 were put and carried.

SCHEDULE II.

Mr. SPEAKER:—

The motion is:

" That Schedule II do stand part of the Bill."

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

Sir, I move:

"In Article 1 (iii) for the words 'thirty rupees' substitute the words 'ten rupees'."

"In Article 1 (iv) for the words 'thirty rupees' substitute the words 'ten rupees'."

The amendments wers duly seconded.

Mr. SPEAKER:—

The question is:

"In Article 1 (iii) for the words 'thirty rupees' substitute the words 'ten rupees'."

"In Article 1 (iv) for the words 'thirty rupees' substitute the words 'ten rupees'."

The amendments were lost.
Article 1 was put and carried
Articles 2 and 3 were put and carried.
Articles 4 to 10 were put and carried.

Article 11

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

Sir, I move:

"In Article 11 (s) for the words 'one hundred rupees' substitute the words 'twenty five rupees'."

అధ్యక్షా:— ఇది చాలా ముఖ్యమైనది. Executive encroachments వల్ల ఎవరికైనను అన్యాయం జరిగితే Constitution రక్షణ కలుగ జేస్తుంది. Consti-

tution లోని రక్షణలను పురస్కరించుకొని వ్యక్తులు హైకోర్టులోగాని, సుప్రీము కోర్టులోగాని న్యాయం కలుగజేయవలసినదని writ వేయవచ్చు, చిన్నచిన్న విషయాలలోకూడా కొందరు writs వేస్తున్నారని నిన్న సంజీవరెడ్డిగారు చెప్పారు. అందువల్లనే writ petitions కు రు 100/- లు court fees నిర్ణయించామనికూడా చెప్పారు. ఇది సక్రమమైన వాదంకాదు. writ లు వెయ్యలేని బీదలున్నారు. ఉదాహరణకు bunk shop తీసివెయ్యమని ఒక ఆఫీసరు ఆర్డరు ఇస్తాడు. అందుకు అనుగుణంగా ఆ shop ను తీసివేస్తారు. ఈవిధంగా వ్యక్తి హక్కులుపోయినప్పుడు తక్కువ ఖర్చుతో వ్యాజ్యం వేసుకొనే అవకాశం లేకుండాపోయింది. బంకు ఖరీదు 100/- ఉండదు. పౌరసత్వపు హక్కులకు అన్యాయం జరిగినప్పుడు ఈ writ ఒక్కటేరక్షణ కలుగజేసేమార్గం Frivolous cases నిమిత్తంకూడా writ హక్కును కొందరు దుర్వినియోగం చేస్తున్నారని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నట్లయితే ఎటువంటి వ్యాజ్యాలకు writ petitions వేసినచో అధికరుసుం చెల్లించాలో, ఎటువంటి వాటికి తక్కువరుసుము చెల్లించాలో వివరించినట్లయితే నాకేమీ అభ్యంతరంలేదు. కాని writ హక్కు సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండవలెను. ఉదాహరణకు ఏ హరిజన బావికోసమో criminal courts వెళ్ళితే తేలదు. తేల్చుకోవాలంటే writ తప్ప వేరేమార్గముండదు. ఈవిషయమై శ్రీ కొండయ్యచౌదరిగారు చాలాచెప్పారు. ముందుగాచెపితే వారిని Tutor గా పెట్టుకునేవారము. Habeas corpus దరఖాస్తు Fees అవసరం లేదన్నాము. అది న్యాయమే. జైలులోఉన్న వాడికి bail లేనపుడు అతని కాగితానికి Stamp Duty లేదు. ఇదివరకటి పద్ధతే అది. దానిని continue చేస్తున్నారు. బాగానేఉంది. జైలులో ఉన్నవారికి ప్రభుత్వమే ఖర్చుపెట్టి వారిపేర ఖర్చు జమవ్రాయండి. Executive authority వల్ల అన్యాయంజరిగితే రక్షణ కలుగజేసేది వ్యక్తిగల writ హక్కుఅని ప్రభుత్వం గుర్తించగోరుతాను. అయితే frivolous cases విషయంలో writ హక్కును దుర్వినియోగం చేస్తారనే అనుమానం కలిగినపుడు అటువంటి సందర్భములలో court fees హెచ్చు చేయడానికి నాకు అభ్యంతరములేదు.

SRI S. K V. KRISHNAVATHARAM:—

అధ్యక్షా: —Writ అనేది చాలా extraordinary remedy. అపీలుకు అవకాశం లేనపుడు ఈ remedy ఉపయోగించుకొనవచ్చును. కాని మామూలుగా ప్రతివిషయములో ఈ remedy ఉపయోగించడానికి ఎంతమాత్రము వీలులేదు. నేను ఇదివరకు మనవిచేసినట్లు Administrative Law కూడా చాలా ఎక్కువగా పెరిగిపోతూఉంది. Special Tribunals, Special courts పెరుగుతూవున్నవి. Tribunal is final, "Decesion of the Election Tribunal is final" అన్నారు. ఇలాంటివాటిమీద appeal కు గాని revision కుగాని అవకాశం లేనపుడు writ అనేది వస్తుంది. తరువాత ఇతరత్రాఉన్న ప్రొవిజన్ల ప్రకారం adequate relief లేనపుడుకూడా ఈ writ ఉపయోగపడుతుంది. ఇదిచాలా extraordinary remedy. ఈ writ ఎలాగ వచ్చిందో పెద్ద చరిత్రఉంది. ఇది Prerogative right 1952 వరకు దీనికి రు2/-

court fees మాత్రమే ఉండేది. ఇప్పుడు దానిని 20/-కు పెంచినారు. దీనిని ఇప్పుడు అయిదురెట్లు పెంచడము న్యాయముకాదు. Writ లు ఎక్కువగా పెరిగిపోతున్నంతమాత్రమున కోర్టులకు పని తగ్గించేనిమిత్తము prohibition గా కోర్టుఫీజు పెంచడము సమంజసముకాదు. న్యాయసమ్మతముకాదు. దానివల్ల రాజ్యాంగచట్టము ఇచ్చిన ప్రాథమిక హక్కులకు భంగము కలుగుతుంది. ఆకారణముచేతనే రాజ్యాంగచట్టంలోని 226 వ సెక్షను ప్రకారం హైకోర్టుకు writ విచారణ అధికారం ఇవ్వడం అనేది జరిగింది. "concurrent Powers without Jurisdiction" క్రింద హైకోర్టుకు, సుప్రీం కోర్టుకు అధికారం ఉన్నది. ఇది extraordinary right. restricted right కాబట్టి దాని ఉపయోగము చాలా restricted గా ఉంటుంది. కాబట్టి writs పై Court fees ను సగానికి సగం తగ్గించడానికి ఉప ముఖ్యమంత్రిగారు ఆలోచించవలెనని నేను ప్రత్యేకముగా విజ్ఞప్తి చేస్తున్నాను.

SRI S. VEMAYYA:—

అధ్యక్షా, ముఖ్యముగా ఈ writ petition వల్ల administration బందుఅవుతుందని, ఎవరుపడితేవారు writs వేస్తున్నారని మంత్రిగారు చెప్పేరు. అది సక్రమమైనవాదంకాదు. ఉద్యోగాలు పోగొట్టుకుని ఇతర ఆధారంలేకుండా ఫీజు కట్టుకొనడానికి ఏమీలేకుండా ఉన్నవారే writs వేస్తున్నారు. కృష్ణావతారంగారు చెప్పినట్లు court fees ను రు. 2/- నుంచి రు. 20/- వరకు ఇదివరకే పెంచేరు. ఇపుడు మళ్ళీ రు. 100/- వరకు పెంచారు. ఉద్యోగంపోయి ఆధారములేకుండా బిచ్చగానివలె తిరిగేవారికి ఈవిధముగా రు. 100/- కట్టుకొని writ పెట్టుకోవాలనడం ఎంతమాత్రం సవ్యంకాదు. కాబట్టి ప్రభుత్వంవారు rules చేసినప్పుడు అటువంటివారికి ఈ writ fees తగ్గించడానికి లోగడఉన్న పాతరేట్లు అమలుపెట్టి మిగతావాటికి discretion ఉపయోగిస్తే బాగావుంటుంది. అని మనవిచేస్తున్నాను. పొలాలలో ప్రవేశించకుండా చెయ్యడానికి, అడవులలో చెట్లు కొట్టకుండా చెయ్యడానికి వెంకటగిరి రాజాగారు లోగడ writ ఉపయోగించుకున్నారు. అటువంటివారికికూడా ఈతగ్గింపు ఇవ్వమని మావాదంకాదు. బీదవారికి ఉద్యోగాలు పోగొట్టుకొన్నవారికి, నిరుద్యోగులుగా ఉన్నవారికి బాధగాఉంటుంది. కాబట్టి writ fees తగ్గించాలని మీద్వారా ప్రభుత్వాన్ని కోరుచున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

అధ్యక్షా: ప్రత్యేకమైన ఒక point ఉండడమువల్ల నేను మాట్లాడుచున్నాను. ఈపాయింటు consider చెయ్యాల్సిన అవసరం ఉందనుకుంటాను.

Mr. SPEAKER:—

Even otherwise you are entitled to speak.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

Supreme Court లో writ వేస్తే 5/- తీసుకుంటారు. ఈబిల్లు ప్యాసుఅయిన తరువాత మన ఆంధ్ర హైకోర్టులో writ petition కు గాను ను 100/ కట్టవలసి

వస్తుంది. ఢిల్లీకి పోయినప్పుడు రు 5/- ఉంటే ఇక్కడ రు 100/- ఉండడము ఇంత disparity ఉండడము బాగాలేదు. ఇది consider చేసి writ లను గురించి జాగ్రత్తగా ఆలోచించవలెనని నా అభిప్రాయము. అయిదు రూపాయలు ఎక్కడ, వంద ఎక్కడ ఇంత disparity ఉండడము సవ్యముగాలేదని మంత్రిగారి దృష్టికి తీసుకొనివస్తున్నాను.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

అధ్యక్షా, నిన్న యీవిషయంగురించి ప్రారంభంలోనే బాగా చర్చించాము. రమణయ్యనాయుడుగారు ప్రభుత్వంతరఫున వాదించడం, writ వందరూపాయలుండడం ఎంత అవసరమో వారు చెప్పడం జరిగింది. వేమయ్యగారు చెప్పినట్లు writ లు పేదవాళ్లు వేసినటువంటివికావు, పెద్ద పెద్దవాళ్లు ఓడిపోయిన chairman లు no-confidence pass అయిన Chairmen వాళ్లే writ లు వేస్తారు. రెండురూపాయలు అంటే శ్రమలేకుండావుంటే అతి చౌక అయిపోయి అర్థంలేకుండా వుంటుంది. ఏదో పేదవాళ్లు ఒకరో యిద్దరో ఉంటారని instances తీసికొని 2 రూపాయలుండాలనడం సరికాదు. ఇది హెచ్చుచేయడంలో డబ్బు సంపాదించే ఉద్దేశంలేదు. కొంతయినా deterrent గా వుంటుందనిమాత్రమే.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

Mica magnates కు, Bus owners కు, వీళ్ళకు వందరూపాయలనేది ఒక లెక్కా? వెయ్యిరూపాయలైనాకూడా యివ్వడానికి సిద్ధంగావుంటారు. అందువల్ల deterrent గా ఉంటుందని అనుకోవడం పొరపాటు.

The Hon. SRI N SANJEEVA REDDI:—

అంత deterrent లేదంటే మరొకతూరి consider చేసేటప్పుడు హెచ్చించడానికి ఆక్షేపణలేదు. Habeas Corpus విషయంలో వెంకటేశ్వర్లుగారిని రేపు Jail లో ఉంచవలసివస్తుందనుకోండి ఆయనకు రెండురూపాయలే ఉంచాము. వారు యీ రెండురూపాయలతోనే Habeas Corpus పెట్టుకోవచ్చు. దానిలో లాభం మేము తీసుకోలేదు. ఏదయినా frivolous గా Court లకు పదేపదే పోవడాన్ని నిరోధించడమే మా ఉద్దేశం. తరువాత Supreme Court కు 5 రూపాయలు అన్నారు. కాని యిక్కడ అనుభవంపైన 2 రూపాయలు 25 అయినది. 25 రూపాయలు 50 అయినది. 50 రూపాయలు 100 రూపాయలయింది. అన్ని రాష్ట్రాలలో ఒకేరకంగాలేదు. ఇంకా కొన్నేళ్లు అనుభవంవస్తే మంచిదనుకుంటాను. రానురాను writ విలువ తగ్గవచ్చు. ఈరకంగా writ లు వేయడం నిరర్థకంఅని, ఉపయోగంలేదనే సద్భావంకలిగి writ ల విలువ తగ్గిపోవచ్చు. పేదవాళ్లకు వేరే Mica owners కు వేరే రుసుములు నిర్ణయించవచ్చును లేదా ఒకేచట్టానికి ఒకరికింత యింకొకరికింతవున్నదని discrimination చేసి చెప్పడానికి వీలున్నదా అని పరిశీలన చేయమందాం. అందువల్ల యిప్పుడు వందరూపాయలుంచడం మంచిది. అంగీకరించాలని ప్రార్థిస్తున్నాను.

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL 1955
( As amended by the Select Committee )

1st February 1956 ]

Mr SPEAKER:—

The question is:

" In Article 11 (s) for the words 'one hundred rupees' substitute the words 'twenty five rupees'."

The Amendment was lost.
Article 11 was put and carried.
Articles 12 to 18 were put and carried.
Schedule III was put and carried.

Clause 32.

Mr. SPEAKER:—

The motion is:

"That clause 32 do stand part of the Bill."

The Hon. SRI N. SANJEEVA REDDI:—

అధ్యక్షా:—దీనినిగురించి రమణయ్యనాయుడుగారు, బసిరెడ్డిగారు చర్చించారు. ఈ Form ఎట్లామార్చినా ఇంకొకరకమైన ఇబ్బందివస్తుంది ఈ Form వున్నది వున్నట్లుగానే వుండడం మంచిది. కొత్తగామారిస్తే ఎంతవరకు fee కడితే అంతకు decree యివ్వడం జరిగితే మిగిలినదానికి fees కట్టకుండా ప్రభుత్వానికి నష్టంవచ్చే పరిస్థితులు కల్పించడానికి అవకాశాలున్నాయి,

Mr. SPEAKER:—

" The decree shall not be executable."

అని ఉన్నది.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

ఒక కాలపరిమితి నిర్ణయించవచ్చును.

Mr. SPEAKER:—

We have got the other right to recover it under the Land Revenue Recovery Act. There are two alternatives. One is to recover it under the Land Revenue Recovery Act and the other is to compel him to pay the fee on pain of losing the whole decree.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

రెండవ పద్ధతి అవలంబించవచ్చును.

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL 1955
( As amended by the Select Committee )

1st February, 1956]

Mr. SPEAKER:—

Yes; compelling is difficult. In some cases people will be out of property. In cases of partnership dissolution, a huge sum will be involved in the decree and the poor man will not be in possession of the property and will not be able to pay a pie and he will have to lose the whole decree. Therefore let the decree be not executable until the fee is paid.

SRI K. VENKATARAMANAYYA NAIDU:—

That is one aspect of it. Initially a certain amount is paid to settle the court fee. After the final arguments a particular amount is found due. Then the balance court fee has to be paid. So, if the court fee is paid for a certain amount and if the decree is given for the entire amount, that portion of the decree on which court fee is not paid cannot be executed.

Mr. SPEAKER:—

We can say 'the whole decree cannot be executed.'

SRI K. VENKATARAMANAYYA:—

To the extent the stamp duty has been paid, the decree can be executed.

Mr. SPEAKER:—

To be a good deterrent, we can say that unless the balance of stamp duty is paid, the decree cannot be made executable.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

Sir, the possibility that both the parties may collude and not pay the balance stamp duty to the Government, should not be there. I have no objection provided the Government gets the full court fee.

Mr. SPEAKER:—

In several cases; especially in cases where people are out of property, they would not be able to pay.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

My contention is that when the parties know pretty well that money has to be paid to the Government, they just make a compromise and won't pay the fee.

SRI S. VEMAYYA:--

Court fees ను pay చేయకుండా ఉండుటకు రాజీపడతారంటే అటువంటి విషయాలలో చర్యతీసుకోనడానికి గవర్నమెంటుకు discretion వున్నది. మోసం చేస్తే చర్యతీసుకోవడానికి అధికారం Government చేతులలోవున్నది. Arrear Land Revenue క్రింద వసూలుచేయడానికి గవర్నమెంటుకు సర్వాధికారంఉన్నది. న్యాయంగా రావలసినదైనా collude అయి Government కు revenue పోతుందనే ఉద్దేశంతో ప్రభుత్వం court fees ను fix చేసే అధికారం వున్నది కాబట్టి ప్రభుత్వానికి దండగ వస్తుందని భయపడనక్కరలేదు.

Mr. SPEAKER:—

There is no advantage. The difficulty is that the other part of suit will be dismissed. Again there is the difficulty of framing the decree. A number of decrees cannot be passed at different times. If the decree is for Rs. 10,000 and stamp duty is due for Rs. 9,000 the decree will be dismissed to that extent. There are such difficulties.

SRI E. AYYAPU REDDI:—

Sir, the present provision has been made to meet cases where there is collusion soon after a preliminary decree is passed. Usually in cases for dissolution and for taking of accounts a preliminary decree is passed and a commissioner is appointed to take out the accounts. The commissioner examines the account and submits his report. At this stage the parties will know where they stand and they will be able to know what each has to pay the other. They will settle at this stage out of account and no final decree may be passed. If they make a settlement even before a final decree is passed, then the Government will be deprived of the legitimate court fees due to them. What the Speaker has just now suggested is that whetever they do not pay court fees the decree shall not be executed. But there. is the pssibility that the parties may not even ask for passing of a final decree

Mr. SPEAKER:—

On hearing if the parties do not pay they do not get the decree.

SRI E AYYAPU REDDI:—

On hearing the Court will have power

Mr. SPEAKER:—

Under the Revenue Recovery Act, the court will fix the stamp duty and the Government will collect through the Government plea-

der. That power is given in sub-clause 4. As you say, if the parties do not pay and evade under sub-clauses 2 and 3, no court can help it.

The Hon. SRI N. SANJEEVA REDDI.—

Why not we leave it as it is, Sir? Except that the clause is a little bit rigourous why not we rerain it as it is? The more number of lawyers participate, the more I am confused I think the best thing is to leave it as it is.

Clause 32 was put and carried
Clause 33 was put and carried.
Clause 36 was put and carried.
Clause 41 was put and carried.
Clause 19 was put and carried.
Clauses 3; 2 and 1 were put and carried.
The Preamble was put and carried.

The Hon SRI N. SANJEEVA REDDI: Sir, I move:

"That the Bill be passed into law."

Mr. SPEAKER: Motion moved.

" That the Bill be passed into law."

SRI S. VEMAYYA: –

అధ్యక్షా, పేదవాళ్ళు writ petitions ను దాఖలు చేసే విషయంలో హెచ్చు మొత్తాలు చెల్లించనవసరం లేకుండా rules ను తయారు చేయించవలెనని కోరుతున్నాను.

SRI P. BASI REDDI:—

Sir, at the end of the discussion of the Bill in the Select Committee, a suggestion was made to provide for refunding half the court fee in all cases where the parties comprise before evidence, is recorded. There is a similar provision in the City Civil Courts Act and in the Madras Presidency Small Causes Court Act. The Hon. Deputy Chief Minister was pleased to say that he would concider the suggestion and that if it were found to be feasible he would bring in an amendment on behalf of the Government. I want to I now, Sir, what the Government have done with this suggestion.

SRI D. KONDAYYA CHOWDARY:—

అధ్యక్షా; ఈబిల్లు Select committee లో ప్రతిపాదించినపుడుకూడా మంత్రిగారికి మనవిచేసుకున్నాము. కోర్టుల పరిస్థితులు చాల అధ్వానముగా వున్నాయని చెప్పాము. కోర్టులు దగ్గరగావుంటే justice చాలాత్వరగాను cheap గాను దొరుకుతుందని చెప్పినాము. ఇప్పుడు 3, 4 తాలూకాలకు ఒక civil court వున్నది. ప్రతి తాలూకాకు ఒక civil court పెట్టితే Justice చాల cheap గ జరగడానికి అవకాశముంటుంది. ఈవిషయములో ఇట్టి ప్రతిపాదన హైకోర్టునుంచి వచ్చినపుడు ప్రభుత్వమువారికి ఎక్కువ డబ్బు రావడానికి అవకాశముంది కాబట్టి దీనిని ఆరకముగా వినియోగ పెట్టితే ప్రభుత్వానికి నష్టమురాకుండా కోర్టుద్వారా వచ్చేడబ్బుతోనే అదనంగా కోర్టులు స్థాపిస్తే delay కాకుండానే justice చాలా cheap గా రైతులకు ఇతర ఉద్యోగులకు అందుబాటులో వుంటుంది కాబట్టి దగ్గరదగ్గరగా courts కు ఎర్పాటు చేయవలసిందని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. Criminal courts కు library వుండదు. Bar Association వుండదు. వచ్చిన పార్టీలు కూర్చొనడానికి sheds కూడా లేకుండావున్నాయి. ఎండాకాలము వస్తుంది, వాండ్లకు మంచినీళ్లు వగైరాలకు యిబ్బందిగావుంటుంది. Water pendals వుండవు. వనమహోత్సవాల ఫలితాలు మనకు తెలుస్తూనేవున్నాయి. కనీసము వచ్చిన డబ్బువల్ల యీ సంవత్సరమైనా water pendals కాని Partis sheds కాని కోర్టు Dignity ని maintain చేయడానికి Court room కాని library వగైరాలుగాని ఏర్పాటుచేయడము చాలా బాగుంటుంది. ఈవిషయము మనవిచేసినపుడుకూడా డబ్బంతా పూర్తిగా దానికే earmark చేయడానికీ వీలులేదు కాని ఇదిమాత్రము దృష్టిలో పెట్టుకుంటామని మంత్రిగారుకూడా శెలవిచ్చారు. ఈవిషయము మనస్సులోపెట్టుకొని తగిన శ్రద్ధవహిస్తారని మనవిచేస్తున్నాను.

SRI P. SATHYANARAYANA:—

అధ్యక్షా: ఈబిల్లు చర్చజరిగిన ధోరణినిబట్టిచూస్తే Select Committee లోగాని అసెంబ్లిలోగాని కాంగ్రెస్ వారిలోనే చాలామంది యీకోర్టుల వ్యవహారాలలో ఎక్కువ అనుభవము వున్నవాండ్లు ముఖ్యంగా దీనిని ప్రతిఘటించడమూ, ప్రతిపక్షంలో మేమంతా ప్రతిఘటించడమూ, జరిగింది. న్యాయము కలుగజేయడానికి దాని ఖరీదు పెంచడము మంచిదికాదని చెప్పడముతోబాటు యీకాలము అనుకూలమైన కాలము కాదనికూడ గట్టిగా నొక్కి చెప్పవలసియున్నది. Select Committee లో చెప్పినవారి ధోరణినిబట్టి చూచినా ఈసభలో జరిగిన చర్చల ధోరణినిబట్టి చూచినాకూడా ఏదో party discipline వల్లనేకాని లేకపోతే యీబిల్లు pass కావడము చాలా కష్టమైవుండేది. ఐనప్పటికికూడా చాల ధైర్యంగా కృష్ణావతారంగారు, రమణయ్యనాయుడుగారు యీ విషయంలో ప్రతిపక్షముయొక్క వాదనలను చాలా మట్టుకు support చేస్తూ మాట్లాడారు. అసలుచట్టం 1870 లో pass చేసినారు. కాబట్టి ఇప్పుడు 70 ఏండ్ల పైనఅయింది. కనుక court fees బాగా పెంచడానికి

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL 1955
( As amended by the Select Committee )



పాయ వడ్డీ అక్టు కాగితంమీద నేవుంది కానీ వాస్తవంగా 100 కి 2 మొదలు 3 వరకు వడ్డీవున్నదని రూరల్ క్రెడిట్టు సర్వేవారే అంగీకరించియున్నారు. ఈ కారణాల వల్ల ఆర్థికంగా మీ ఋణవ్యవస్థ క్రమక్రమంగా పాడైపోతున్నటువంటి యీ దుర్మార్గంలో ప్రభుత్వానికి ఆదాయం కావాలిఅనే నెపంకొద్దీ Court fees ను పెంచడంఅనేది ఎంతమాత్రం సమర్థనీయంకాదు. ఇప్పటికే న్యాయానికి కోర్టులో ఖరీదు యెక్కువపెట్టినాము, అది ఎట్లా తగ్గించాలనేది ఒక ప్రధానమైన సమస్యగాని పెంచడంఅనేది సమస్యకానేగాదు. ఇప్పుడు భారతదేశంలో కోర్టులకు ముఖ్యంగా Judges కి ఒక విస్సిష్టతవున్నది. శీలంలోమాత్రం వారు యేవిధంగాను corrupt కారనిన్ని చాలా వున్నతస్థాయిలోనే Indian courts వున్నవనిన్ని కొంతమంది చెప్పతూనేవున్నారు. దానిని అంగీకరిద్దాము. కానీ అచెప్పినవారే కోర్టులలో Sub-ordinate staff ను గురించిమాత్రం అమాటలేమీ చెప్పడంలేదు.

పైగా స్పష్టంగా అనేకమంది నిపుణులు వ్రాసినటువంటి గ్రంధాల్లో యీ Sub-ordinate staff లో విపరీతమైన corruption వుందనిన్ని కేవలం దీనివల్లనే చాలామంది లిటిగెంట్సు పాడైపోతున్నారనీ చెప్పతున్నారు. ఈవిషయంలో కోర్టు ఖర్చులు తగ్గించడానికి యేమిచేయవలెనో, క్రింది కోర్టులకు యెక్కువ అధికారాలు యివ్వవలెనా? గ్రామంలోనే కోర్టులేర్పరచి అవసరమైన టెక్నికల్ సహాయంకోసం Ligal Advisers ను కూడా యేర్పాటుచెయ్యడం అనేపద్దతి కొంత మార్చవలెనా? యీ Sub-ordinate Staff లో వుండే corruption తగ్గించడానికి యేయే పనులు చేయాలి? యేవిధంగా వారిని కంట్రోలుచేయాలి యీరకమైనటువంటి విచారణలతో కూడినటువంటి ఒక శాసనంవస్తే అది చాలా సమంజసంగా వుండునేమో కానీ కేవలం ప్రభుత్వానికి కావలసినటువంటి ఆదాయం ఒక్కటే దృష్టిలోపెట్టుకొని దానికోసం అన్ని రంగాల్లోను ఆ ఆయుధాన్ని వుపయోగించినట్టే ఈరంగంలో కూడా ఆ ఆయుధాన్ని వుపయోగించడం యెంతమాత్రం సమర్థనీయంకాదు. ఒక వైపున మనం శ్రేయోరాజ్యాన్ని స్థాపించాలి అని అధికారంలో వున్నటువంటి కాంగ్రెసుపార్టీ గట్టిగా చెప్పతూవుంది, శ్రేయోరాజ్యం అంటే కేవలం మనిషి చుట్టువున్న పరిసరాలని, ప్రాజెక్టులుకట్టి పరిశ్రమలుపెట్టి బాగుపరచడంమాత్రమేనని భావించరాదు. వ్యక్తికీ వ్యక్తికి మధ్యనువున్న సంబంధాలను కూడా కొంతవరకు చక్కబెడితేగానీ శ్రేయోరాజ్యం సాధించినట్లుకాదు.

అందుచేత వ్యక్తికీ వ్యక్తికీ మధ్యవుండే సంబంధాలలో కూడా ఆరోగ్యమైనటువంటి సంబంధాలు కలుగజేయాలె. అన్యాయం పొందినటువంటి మనిషికి సులభంగా చౌకగా న్యాయందొరికేటటువంటి సదుపాయం, ఈరకమైనటువంటి Social facilities యేర్పడితేనే నిజమైన శ్రేయోరాజ్యాన్ని సాధించగలను ప్రాజెక్టులు, పరిశ్రమలు కట్టడంతోబాటు ఈఆశయంకూడా నెరవేరితేనే నిజయమైన శ్రేయోరాజ్యం యేర్పడుతుంది. కాబట్టి మనిషికి మనిషికీ వుండేటటువంటి సాంఘిక సంబంధాలన్నీ కూడా అనారోగ్యపూరితంగా భరించరాని పద్ధతిలోపెట్టి చుట్టూ ప్రాజెక్టులు పరిశ్రమలు కట్టినప్పటికీకూడా వుపయోగంవుండదు. కాని ఈవిషయం కేవలం నిర్లక్ష్యం చేయబడింది. దానికి ఇటువంటి శాసనమే నిదర్శనం. ఈ విషయాన్ని యీ మూడవ రీడింగులోకూడా మేము House యొక్క గుర్తుకు తేకతప్పదు. అందుచేత యీ అక్టును మేము సమర్థించడం కష్టం.

THE ANDHRA COURT FEES AND SUITS VALUAT'ON BILL 1955
( As amended by the Select Committee )

1st February 1956

SRI E. AYYAPU REDDI: Mr. Speaker, Sir, you know full well that the Court-Fees Act is one of the most important Acts on the Statute. This is the one Act which is force and which is in use every day; it is read, interpreted and applied every day, every hour in every court of the State. This is really the key Act to all the other Acts. The constitution Mohammeden law Hindu Law, Transfer of Property Act and every other Act has to be applied only through the Court-Fees Act. As I have already said, this is the key to the other Acts. This can also be a key to the treasury of this State And I hope that the present Act is not merely a key to the treasury of the State, But a key to the other Acts also. All the other Acts can be made invalid and useless by making the Court-Fees Act a dangerous Act also. But the present Act, I must say, is a golden mean between the two views. It will, while helping the State for the upkeep of the administration and justice; not make justice dear as has been contended by the other side. Sir, I will be failing in my duty if I do not congratulate the Law Secretariat for bringing up such a fine Bill. in that the draftsmanship compares very well with the other Acts of the other States' So far as the language, the lucidity and expression in the draft are concerned, they are excellent and they compare very well with any other Act and there will be no complaints in the interpretation and in the enforcement of this Act. But with regard to the enhancement of the court fees, that of course has to be given a fair trail for a period of one year and we will see whether this will not act as a deterrent on the cantankerous litigants and whether it will not at the same time serve the purpose of the really needy litigant. I also want to endorse the proposal made by my friend Mr. Basi-Reddi. It is important that a salutary provision, like encouraging the litigants to compromise even before the Court trial takes place: should be incorporated in the Act. I hope the Government will, in course of time, introduce this salutary principle in the Act and make this Act really a fine one. Thank you, Sir.

SRI G. JAGANNADHA RAJU:—

అధ్యక్షా—ఇప్పుడు నేను సంజీవరెడ్డిగారికి అభినందనలు తెలుపుదామనే ఉద్దేశ్యముతో మాట్లాడుతున్నాను. ఈబిల్లులో court fees ద్విగుణంగా వసూలు చేయదలచడం జరిగింది. ఇలాంటి బిల్లు ఎప్పుడు కనివిని యుండలేదు. ఇందు మూలంగా ప్రభుత్వంవారియొక్క తెలివితేటలు వారికి యుండేటటువంటి support తెలియవస్తున్నది. Extraordinary procedure ఈబిల్లులో పొందుపరచడం జరిగింది. వారిపక్షమున యున్నటువంటి కాంగ్రెసువారు అందరుకూడా ఈబిల్లు సబబు ఆయినా, కాకపోయినా ఆమోదించుతారు. అందుచే లోగడ కాంగ్రెసువారే

"we are killing the opposition with opposition" అనేటటువంటి సామెత మనవిచేశారు. ప్రతిపక్షంలో ఉన్నటువంటి కమ్యూనిస్టులు, సోషలిస్టులు చెప్పే దానికి వ్యతిరేకంగా స్వతంత్ర సభ్యులు మాట్లాడడం చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది. శ్రీ మొదలియార్ గారు, నరసింహస్వామిరావుగారు మమ్ములను oppose చేయడము జరుగుచున్నది. ఇది వారితాలూకు opposition యొక్క main feature. ఇలాంటి పరిస్థితులు ఉన్నంతకాలం ప్రభుత్వంవారు వారి ఇష్టమువచ్చిన బిల్లును తీసుక రావచ్చును. Pass చేసుకోవచ్చును. వారియొక్క బృందము 150 మంది ఉన్నారు.

ప్రస్తుతం Stationary sub-Magistrates Courts ప్రతి తాలూకాకు ఉన్నాయి. వాటిలో కుర్చీలులేవు. అచ్చటచ్చట బెంచీలు ఉన్నాయి. యిప్పుడు prohibition case లో లభ్యమయ్యే బిండెలు కుండలు ఉన్నాయి వాటిమీద clients కూర్చోవడం తటస్థిస్తున్నది ఈ పరిస్థితులను తొలగించి కొంత ఖర్చుపెట్టి అక్కడ సరియైన ఏర్పాటులు చేయించమని ప్రార్థిస్తున్నాను.

SRI V. VISWESWARA RAO:—

అధ్యక్షా:— జగన్నాధరాజుగారు చెప్పినట్లు కాంగ్రెసు పార్టీ చాలా మెజారిటీలో ఉన్నది, కాబట్టి ఈబిల్లులు అన్ని తెచ్చి ప్యాసుచేయించుకోవడానికి అవకాశముఉన్నది. ఇదంతా కూడా మిత్రులైన స్వతంత్రులు కూడా, ప్రోత్సహించడం జరుగుతున్నది.

SRI S. RANGANADHA MODALIAR:—

On a point of order; Sir, There is one Independent in this House (laughter)

SRI V. VISWESWARA RAO:—

ఈ బిల్లులో ఉన్నటువంటి మంచిచెడ్డలను గురించి మాట్లాడడానికి నాకు స్వానుభవంలేదు. నాకు ఎప్పుడూ కోర్టులకు వెళ్లడము అలవాటులేదు. వెళ్లాల్సిన అవసరముకూడాలేదు. కాని ఒక విషయంమాత్రం చెప్పవలసిన అవసరము ఉన్నది. ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టి ఈ న్యాయము అనేది కొనుక్కోవలసిఉన్నదని ఈనాడు ప్రజలలో వాడుకఉన్నది. కోర్టులకు ఖర్చుపెట్టేదే కాకుండా న్యాయమును బజార్లోపెట్టి పాటపాడవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయని నేను విచారిస్తున్నాను. కృష్ణాజిల్లాలో చాలాచోట్ల ఎన్నో కొత్తకొత్త కోర్టులు వెలసినాయి. నూజవీడులో కూడా ఒక మునసబు కోర్టు పెట్టారు. అక్కడకువెళ్లి చూస్తే న్యాయము తూచి అమ్ముతున్నారనేది బాగా బోధపడుతుంది నా చిన్నతనంలో ఒక తెలుగుపండితులు ఉండేవారు. ఆయన రెండు చేతులలో పరీక్ష పేపర్లు పుచ్చుకొని ఏది ఎక్కువ బరువువుంటే దానికి ఎక్కువ మార్కులు ఇస్తూఉండేవారు. అందులో నాలుగు

తెల్లకాగితాలు పెట్టినా మాకు ఎక్కువమార్కులు వచ్చేవి అన్నమాట అదేవిధముగా నూజవీడు మునసబుకోర్టులో ఎవరు ఎక్కువ ఫలములు ఇస్తే వారికిమాత్రమే న్యాయము జరుగుతున్నదన్నమాట.

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఇది న్యాయమైన alligation కాదు. అందులో జిల్లా మునసబు గురించి గౌరవనీయులైన సభ్యులు నిందారోపణలు చేయడము న్యాయముకాదేమో?

SRI V. VISWESWARA RAO:—

అనుకొంటున్నామండి.

The Hon. Dr. B. GOPALA REDDI:—

అనుకొంటున్నాము అని చెబుతున్నారు. అది న్యాయముకాదు. ఆఫీసరు ఇక్కడ లేనప్పుడు సమర్ధించుకోవడానికి వీలులేనప్పుడు చెప్పడం సరికాదు.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

If he has really some charges let him put them in writing We shall send it to the proper authorities to inquire What is the use of making charges on the floor of the House when the officer is not in a position to defend himself. If the hon. Member has the courage let him do it; and the officer will certainly defend himself.

SRI V. VISWESWARA RAO:—

ముఖ్యమంత్రిగారు, ఉప ముఖ్యమంత్రిగారు ఇద్దరుకూడా కల్పించుకొని 'ఆఫీసరు ఇక్కడలేరు' అంటున్నారు. ఏమైనప్పటికి అక్కడకు Sessions Judge రావడము, అక్కడ విషయములన్ని స్వయముగా తెలుసుకోవడము note చేసుకోవడముకూడా జరిగింది, రికార్డులు అన్ని సేకరించడముకూడా జరిగింది. ఏకోర్టులోఅయినాసరే, సబ్ కోర్టులోఅయినాసరే, మునసబు కోర్టులో అయినాసరె, ఎవరిమీదనైనా లంచగొండితనం కేసులు ఉన్నప్పుడు వాటిని వెంటనే పరిశీలించడానికిబదులు వారిని న్యాయాధికారిగా నేఉంచడం సరియైనదికాదు. కనీసం ఆకేసులు విచారించేవరకైనా అయనను మార్చవలసిన అవసరము ఉంటుందనిచెప్పి దానికొరకు ప్రభుత్వము చర్యతీసుకోవలసిన అవసరము ఉన్నది.

ఈనాడు కోర్టులకు ఒకవైపున న్యాయముకావాలని వెడుతూంటె దానికిగాను Court fees పెంచడముఅనేదికూడా జరుగుతున్నది. కోర్టులలో ఇటువంటి పరిస్థితులు ఏర్పడ్డమువల్ల చాలా విచారించవలసిఉన్నది.

ఈనాడు మేజిస్ట్రేటు కోర్టులు అనేకము ఉన్నాయి. అందులో 10, 15 కుర్చీలుఉంటే వాటితో 5, 6 కాళ్లు విరిగిపోయినవి ఉంటాయి. అవి గోడకు ఆన్చి ఉంటాయి. అవి ఇవతలకులాగితే ఆఫీసరుగారుకూడా పడిపోయే కుర్చీలు చాలా

కోర్టులలో ఉండటము జరుగుతున్నది. కొన్ని కోర్టులలో ప్రత్యేకించి కోర్టు dignity ని కూడా కాపాడని పరిస్థితుల్లో prohibition cases కు సంబంధించిన కుండలు, బిందెలు ఉంటుంటాయి. దీని నుంచి వచ్చే ఆదాయము ఏమైనప్పటికి కనీసము కోర్టులయొక్క గౌరవము కాపాడ్డానికి, కొంత ఖర్చు పెట్టి తగినటువంటి వసతులు ఏర్పాటు చేయించాలని కోరుతున్నాను.

SRI S. RANGANATHA MUDALIAR:—

Mr. Speaker, Sir, I want to take serious objection to the unparliamentary insinuation made by Sri Jagannadha Raju, that in the select committee the Hon. Deputy Chief Minister made use of us for killing the Opposition. I do not know what he means by 'opposition'. Does he mean, he was the Opposition, or his party was the Opposition, does he mean the Communists only formed the Opposition party. There is no such thing as Opposition in this Assembly so far as I am able to see. There are groups; one is the Communist Party group; the second is the Praja Socialist Party group and the third is the Nationalist group. The Second group is deliberately using the word 'Independent', when there is only one Independent in this Assembly (Laughter) who forms a party, who forms on institution by himself. While in the P. S. Sri Jagannatha Raju is the only vakil in his party, there are half a dozen or atleast there or four vakils in our party. In every respect we are entitled to assert ourselves and our rights as an opposition party. It is not that the Hon Deputy Chief Minister, when he was pleased to select me as one of the members of the select committee, had a previous talk with me and said. Look here Mr. Mudaliyar, I am going to engage you as my mercenary; you had better come and support all that we want. Certainly, such sort of insinuations are not called for, and do not come with grace from a senior politician like Sri Jagannatha Raju. He had his own say, and we had our say and if the majority agreed with some of the views expressed by me the credit must go to me and my party (laughter) and there is no use of belittling the Nationalist party saying that we are being "engaged" and that we are actuated by mercenary motives. What motives can we have, Sir? (laughter) And what is more what is the meaning of saying 'killing the opposition'. We are the most responsive Opposition. Our policy is responsive co-operation. Whenever Government bring measures which are conducive to the general welfare of the State we are ready to support the Government, and if there is anything which we find objectionable we put the objection, or rather, we express our objections in a reasonable and in a sweet manner and leave it to the good grace of the Government to consider it or not.

We do not indulge in very strong language. I submit that if any Bill was introduced in this Assembly very beautifully drafted it is this Bill. I have seen other Bills that have come up before this Assembly during the last one year. Never was any Bill so beautifully and so tersely drafted. It gives no room or scope for ambiguity or vagueness. I hope other states will take an example if they want to pass a similar legislation by taking this statute as a model for adoptiom On the whole we have not done anything to increase the burden of the poor in the matter of litigation. Of late there has been too much talk of the poor, poor, poor If anybody has been responsible for making litigation costly it is we, the lawyers, That cannot be gainsaid. If lawyers enterin to an agreement and pass a self-denying ordinance, that in the case of poor people, we shall take only so much fee and not more, certainly no amount of enhancement of court-fee will affect the poor. There is no use of bringing in the 'poor' in season and out of season. On the whole, the measure has been a just one. It is only very necessary that an infant State like our State should have as much money as possible. There is no meaning in asking for a Munsif's court in every taluk headquarters. Supposing we should have Munsif's court at every taluk headquarters, just consider how many District Munsifs we should have and what is the grade of pay we should give them. Will any man be willing to work as a District Munsif on Rs. 100/-. Then what about the establishment, and what about the library? Why do not our friends consider all these matters? So, it is a practical proposition. Of course if any particular court were situated in an out-of-the-way place, or if it is extremely far away, we can ask the Government to have it centrally situated. In all such matters Government are prepared to help. Therefore I request my friends not to bring in the case of the poor in season and out of season. After all we are all poor; I am a poor man; I am not a rich man. Therefore the Bill has to be passed into law. I congratulate the Government on the way in which the Bill has been so ably piloted.

Mr. SPEAKER:—

Mr. Jagannatha Raju might have a word to say.

SRI GOTTUMUKKALA JAGANNADHA RAJU:—

Yes,

MR. SPEAKER:—

Do not aggravate it. (Laughter)

SRI GOTTUMUKKALA JAGANNATHA RAJU:—

Mr. Speaker, Sir, in the first place I would like to say that I attribute no motive to any member of this House. It is not a fact that I attributed any motive. Secondly, I may say, I stated definitely that a particular individual has made the statement. So my friend has to find fault with that gentleman and not with me (Laughter) He has to ask his explanation and not me.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

అధ్యక్షా, ముఖ్యంగా ఉన్నటువంటి విషయంగురించి ఇదివరకు మిత్రులందరు మాట్లాడారు. తరువాత opposition ఉన్నదా లేదా అంటె First Opposi. tion, Second oppsition, Third opposition and other members.

Mr. SPEAKER:—

We are not concerned with the opposition now. We are at the Bill.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

ఈ బిల్లు చూస్తే ఇది దాదాపు మద్రాసు బిల్లు నకలుగా కన్పడుతున్నది. కాని కొద్ది తేడాలు మాత్రంఉన్నాయి. వాళ్లువేసిన మొత్తాలకంటె ఎక్కువమొత్తాలు ఉన్నాయి. దాంట్లో ఏమి పొరబాటులేదు. అది బాగానే ఉన్నది. ఈవిషయంలో ఒకటి మాత్రం మంత్రిగారికి మనవిచేయదలచుకొన్నాను. ఒక్కొక్క కోర్టుకు 1, 2, 3 Benches క్రింద Munsifs ఉంటారు. కొన్నిచోట్ల అవి తగ్గించి ఒక area కు సంబంధించినటువంటి Munsif courts ను ఒకే ఊరికే concentrate చేసేబదులు ఆ area మొత్తానికి divide చేస్తే ఎక్కువ ఉపయోగము కావడానికి వీలుఅవుతుంది. సంజీవరెడ్డిగారు కూడ వింటారని మనవి చేస్తున్నాను. కోర్టులన్నీ ఒకే ఊరిలోనే 2, 3 కోర్టులు No. 1. No. 2, No. 3 అని పెడుతున్నారు. అట్లాంటివి ఒకే చోట concentrate చేయకుండ వాటిని ఆ areaలోనే విడివిడిగా దూరదూరంగా పెడితే వెళ్లేవాళ్ళకు తక్కువ ఖర్చు అవుతుంది. ఆ నేసూచన ఒకటి ఉన్నది. ఆవిధంగాచేస్తే బాగుంటుందేమో ఆలోచించవలసిందని చెప్పుచున్నాను.

రెండవది, poor people కోసమని ప్రతి తడవ అనవద్దు అని చెప్పారు. కాని ఏమిచేస్తాము. ఇంకేవరున్నారు? దేశంలో poor people లేకుండాఉంటె, వాళ్ళ సంగతే హెచ్చరించకుండా ఉండవలసివచ్చేది. వీరిగురించె High Court కూడ గవర్నమెంటుకు వ్రాసిందని విన్నాను. వాళ్ళకు కావలసిన legal aid free గా ఇవ్వడానికి వీలవుతుంది. దానికి కావలసిన agency కూడ ఏర్పరచవలసిందని కోరిందనివిన్నాను. ఆరీతిగా Bombay Government కూడా చేసింది. కనుక అది కూడ

వెంటనే చేయమని కోరుతూ ఈ restrictions వీలైనంతవరకు సులువుగా ఉండేటట్లు చేయవలసిందని మనవిచేస్తున్నాను.

SRI K VENKATARAMANAYYA NAIDU:—

Mr. Speaker; Sir. before the Bill is finally passed into law I would like to make certain suggestions to the Hon Deputy Chief Minister who is in charge of Courts and Administration of Justice. The furniture supplied to the Magistrates courts and even sub-divisional magistrates courts and divisional first class magistrates courts is very very inadequate. In many cases I can as well say. as one of my friends has put it. most ricketty chairs dangerous to sit are supplied. Such a state of things should be remedied as early as possible. I know why this defect has been continuing for such a long time. The magistrates are terribly afraid to bring it to the notice of Distric Magistrate that the furniture in their court is not what it ought to be. They think that should they do so, they would incur the disp'easure of the District Magistrate. That appears to be one of the reasons Apart from that, I would request the Hon. Deputy Chief Minister to ascertain in which all courts there is lack of proper furniture and supply them: for that adds grace and dignity to the court, Otherwise if pleaders are to sit on benches or ricketty chairs, the public will form a very poor opinion of the kind of justice that they are going to obtain there. Or in the words of what my friend says here, they will think they will get only ricketty justice and not fair justice. Apart from furniture, there is the question of building In most of the courts which are sub-magistrates courts, which are located in taluk headquarters, not only is the furniture found wanting, there is no place for legal practitioners to rest for a while. I think it is the duty of the Government and the court to see that a rest house or a bar room is provided for the legal practitioners when they happen to sojourn there. That is also one of urgent need: Now that Government is trying to augment its resources from this branch of administration, whatever is required to improve the lot of legal practitioners should be done now. It would add to the dignity and prestige of the courts also, and thereby it would create an impression among the people that the justice done would be straight and fair as the conditions obtaining in those courts. So I appeal to the Hon. Deputy Chief Minister to make a special note of these things, whether the magistrates themselves really apply or not, and see that these courts are provided with good furniture and a bar room.

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL 1955
( As amended by the Select Committee )



Apart from that, I also find that the Law Repots supplied to the magistrates' Courts are not supplied to all courts, and even the few Indian Law Reports series that are supplied are not supplied in time. I appeal to our Government to see that all Law Reports up-to-date are made available, so for as they are available, readily in the sub-magistrates' courts so that the lawyers, and magistrates even, may not feel any difficulty in ascertaining the exact position of law on the subject. With these observations I congratulate the members of the select committee for the language in which they have couched their conclusions in the Bill and I congratulate also the Government and all those people connected with the drafting of the Bill.

SRI P. NARASIMHAPPA RAO:—

అధ్యక్షా:— ఈబిల్లునుగురించి నేను చాలా సంతోషముతో support చేస్తూ మాట్లాడుతున్నాను. కారణము యేమిటంటే, ప్రభుత్వము అన్నిబిల్లులు ఒక్కసారిగా ప్రవేశ పెట్టడమువల్ల నేనంటాను. ఇక opposition పార్టీవారు చూస్తే ప్రభుత్వము తెచ్చినబిల్లులతో ఏదివచ్చినను, దాన్ని oppose చేయడము అనేమాట తప్ప వేరేమాట కాదన్నట్లు కనబడుతున్నది. రేపు యింకొకబిల్లు వచ్చినప్పుడు, దానికి మేముకూడ oppose చేస్తామని మాట్లాతున్నాను. ప్రభుత్వము ఏబిల్లు తెచ్చినను దాన్ని గురించి మాట్లాడడానికి మాకుకూడా హక్కువున్నదని మన జగన్నాథరాజుగారుకూడ చెప్పారు. ప్రతిదానికి మేము opposition వారినే oppose చేస్తూ మాట్లాడుతున్నామని చెప్పారు. అదికాదు, ఓటుచేసేటప్పుడు న్యాయమైన బిల్లుగా ఏదివున్నది అంటే, ఆ ప్రక్కనే ఓటు చేస్తాము. అందువల్ల ముఖ్యంగా యీ బిల్లునుగురించి పూర్తిగా support చేస్తూ మాట్లాడుతున్నాను. నేను నిన్ననే చెప్పాను. ఎప్పుడుకూడా శెక్కులు వ్రాయడం, ఖర్చు చేయడంతప్ప ప్రభుత్వమునకు రాబడిమాత్రం కనబడడములేదు. ఆర్థిక బిల్లులలో యీఒక్క బిల్లువల్లనైనా యింతమాత్రము అదాయము తెస్తే దానికి తగిన ఖర్చుకూడావున్నది. మా శ్రీకాకుళంజిల్లాకు జిల్లా అనే పేరు మాత్రము వున్నదేకాని, జిల్లాకోర్టు అనేది లేదు. గాన్ని యింతవరకూ పెట్టలేదు. కాబట్టి అటువంటిది. యిప్పుడు propose చేస్తూ రాబోయే బడ్జటులోనైనాచేర్చి మాజిల్లాలో జిల్లాకోర్టును open చేయించవలసిందిగా కోరుతూ యీబిల్లును పూర్తిగా support చేస్తూ విరమిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

అధ్యక్షా, ఇంత పెద్దచట్టము యింతత్వరగా ప్యాసు అయినందుకు యీ అసెంబ్లీలో అందరినీకూడ అభినందించాలని అనుకుంటాను. దీనిద్వారా ఏపది, పదిహేను లక్షలలో ఆదాయము వస్తుందని చెప్పారు. ఇదివరకు యిచ్చిన లెక్కప్రకారము

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL 1955
( As amended by the Select Committee )

1st February 1956

మంత్రిగారు చెప్పారు. కొన్ని కొన్ని clauses of writs ను devide చేసేవిషయములో, అంటే Mines విషయములో license కు గవర్నమెంటు పర్మిషను యివ్వకపోతే యింకా యిలాంటివి జిల్లాబోర్డులకు పర్మిట్లు మునిసిపల్ చేర్మను తమయొక్క పురపాలక వ్యవహారములలో హైకోర్టులో writs దాఖలు చేస్తున్నారు. కాబట్టి యిలాంటివి writs కొన్నికొన్ని తరగతివారీగా విభజించవలసిన అవసరము మాత్రము ఉన్నది. ఇదికాకుండా యీనాడు హరిజనులు ముందుకురావటానికి మనను ప్రభుత్వము ఎంతో కృషి చేస్తున్నాము. ఈహరిజనులు కొంతమందితో తగాదాలు రావడమువల్ల Civic liberties rights విషయములో High Court లో writs దాఖలు చేస్తున్నారు. ఆ writs కు గాను నూరురూపాయలు fees fix చేస్తున్నారు ఆడబ్బు కట్టుకోమని అంటే వాళ్ళకు అంతడబ్బు ఎక్కడనుంచి వస్తుంది. వాళ్లు ఆడబ్బు కట్టలేక చాలా యిబ్బంది పడుచున్నారు. అటువంటి విషయాలు వచ్చినప్పుడు యీ writs విషయములో ఏమైనా విభజించడానికి వీలువుంటుందేమో చూచి కనీసము యీ హరిజనులు దాఖలు చేసే యీ Civsc liberties కు సంబంధించినంతవరకైనా తగ్గిస్తే బాగుంటుందేమో ఆలోచించవలసిందిగా మంత్రివర్గాన్ని కోరుతున్నాను.

ఇకపోతే, Opposition sake oppose చేస్తున్నారు. యీ opposition వారు అని విమర్శ చేశారు. మేముగాని మా పార్టీలోనివారు గాని ఎవ్వరూకూడా ప్రభుత్వము ప్రవేశపెట్టే బిల్లును దేనినికూడ opposition sake oppose చేయడం లేదు, ఇదివరకుచేయలేదు.

The Hon Dr. B. GOPALA REDDI:—

మీరు ఏబిల్లును support చేస్తారు?

SRI PILLALAMARRI VENKATESWARLU:—

ప్రభుత్వము యింతవరకు తెచ్చిన బిల్లులో ఏదిమంచిదో చెబితే సరే, లేకపోతే Opposition మెచ్చుకోదగ్గది. ఫలానా బిల్లుతెస్తే అది Oppose చేసారు అని చెప్పండి. రేపు Land Revenue surcharge Bill కావాలి కావాలి అని ప్రభుత్వము అంటున్నారు, అందులో మేము చేసిన సూచనలు ఏవి మీరు ఒప్పుకున్నారో చెప్పండి. అందువల్ల అందులోవి ఏవి support చేయాలో ఏవిచేయకూడదో అవివచ్చినప్పుడు చెబుతాము. ఈ Surcharge వేసేటప్పుడుకూడా రైతు ఎంతవరకు భరించగలడో చూచి అంతవరకే పన్ను వేయండి అది న్యాయముగా వుంటుంది అని చెప్పాను. ఏదో అందరికి ఒకేమాదిరి రేటువేసి Land Revenue Surcharge యీ రెండూ వేసి వసూలు చేసేదానికంటె రైతులు భరించేటట్లుగా వేయండి support చేస్తాము అందులో ఏదైనా న్యాయముగా ఉన్నది అంటే తప్పకుండా Support చేస్తాము. అంతే కాని పైకి మాత్రము మాట్లాడేటప్పుడు యీ బిల్లు యేమి

బాగాలేదు అని చెబుతూ తీరా ఓటు చేయవలసినప్పుడు బిల్లును support చేస్తూ ఓటుచేయడమనేది మాలో ఎవ్వరుచెయ్యరు మాపార్టీ దృక్పథముగాని, సిద్ధాంతముకాని అదికాదు ఈసంగతి ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. అందువల్ల Opposition sake oppose చేయడమునేది మాపార్టీలోలేదు. మాపార్టీది ఎప్పుడుకూడా Constructive opposition అనిమాత్రము చెప్పగలను. అంటే యిప్పుడు ఉన్న సూచనలకంటె మంచి సూచనలు మేమియిస్తున్నప్పుడు అవి ప్రభుత్వము అంగీకరిస్తే సంతోషిస్తామని చెబుతూ విరమిస్తున్నాను,

The Hon. SRI N. SANJEEVA REDDI:—

ఉపాధ్యక్ష మహాశయా, ఈబిల్లును గురించి చెప్పవలసింది అంతా అయిపోయింది. యిప్పుడు ఏవో ఉపన్యాసాలు యివ్వాలి కాబట్టి ఉపన్యాసాలు యివ్వడమూ దానికి సమాధానము చెప్పడమూ జరుగుతున్నది. ఈబిల్లును తయారుచేయడములో సెలెక్టుకమిటీ సభ్యులు యిచ్చిన సహకారాన్ని మాత్రము సంపూర్ణముగా అందరము అంగీకరించాము ఈబిల్లు యిక్కడికి వచ్చిన తరువాతనే నేను opposition side మెంబరును అదేది జ్ఞాపకమునకు వచ్చింది శ్రీ జగన్నాధరాజుగారికి, అంతకుముందు Select committee లో మాత్రం మన రంగనాథ మొదలియారుగారికంటే జగన్నాధరాజుగారే ఎక్కువగా ఉపయోగించారు. వారుచాలా సలహాలు చేశారు. అంతో యింతో యిప్పుడు కోర్టుఫీజు యొక్క రేట్లు ఎక్కువ చేయటానికో యింకా ఎందుకో జగన్నాథరాజుగారి సహకారము మాకు Select Committee లో చాలావరకులభించింది. వారే మాకు పెద్దలు అనుభవజ్ఞులు కాబట్టి వారి సహకారాన్ని మేము స్వీకరించాము. యీబిల్లును తయారుచేయడమైంది. ఇకవారుచెప్పిన సలహాలు కొన్ని ఉన్నవి. కోర్టులలో బెంచీలు లేవని, కుర్చీలులేవని కుండలపైన కూర్చుంటున్నారని చెప్పారు. కుండలపైనవున్న కుర్చీలలో కూర్చునేటప్పుడు కొంచము జాగ్రత్తగా పగిలిపోని కుండలమీద చిన్నకుర్చీలమీదనే కూర్చోండని మాత్రం సలహాయిస్తున్నాను. (Laughter) కాబట్టి మనమందరము జాగ్రత్తగావుంటే ఏమైనా కొంతవరకు ఆదాయం పెరుగుతుంది కాని దీనివల్ల ఏదో బ్రహ్మాండమైన ఆదాయము అంతా వచ్చిపడుతుంది అని అనుకోవటము పొరపాటు. అదికూడ పెద్ద ఆదాయమును యివ్వదు సుమారు 10, 15, లక్షలు మాత్రము రావచ్చునని అనుకుంటాను. కాని యీకోర్టుఫీజు పెంపకమువల్ల వచ్చేఆదాయమును ప్రభుత్వము వాస్తవముగా పొందడము లేదు. కోర్టులవల్ల వచ్చేఆదాయమునకు అక్కడ అయ్యే ఖర్చుకుకూడ సరిపోతున్నది. మన సుబ్బారావుగారు యిచ్చిన అంకెలనుబట్టి కోర్టులవల్ల సుమారు ఇరవైలక్షల ఆదాయము మిగులుతుందని చెప్పారు. కాని దానికి నిన్న నేనుచెప్పాను. కాని యీ stamp duties యింకా యితరములు అన్ని కలుపుకుని వారుచెప్పారు వారుచెప్పినది ఒకకోర్టు ఫీజేకాదు.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

కోర్టులలో Judicial stamp అని non-Judicial stamp అని ఉన్నవికదా

The Hon. SRI N. SANJEEVA REDDI —

ఉన్నవి సరే వారు చెప్పినలెక్కలుచూస్తే అన్నిరకాల ఫీజులు కలుపుకొని చెప్పారు. అందుకనే నేను చెబుతున్నాను. అన్నీ కలుపుకొని చెప్పినందువల్లనే, అంత అవుతున్నది కాని వారు అనుకున్నంత ఆదాయము ప్రభుత్వానికి రావడము లేదు. తరువాత యిప్పుడు వచ్చేకొద్ది ఆదాయముతో Judges కు అనండి, Judges నియామకము అనండి, వారి salaries అనండి యిలాంటివి అనేకము హెచ్చుగా ఖర్చుఅవుతున్నవి అసలు ఈ separation of Judiciary from the Executive అనే దానివల్ల ఏక్కువగానే ఖర్చు అవుతున్నది. మొదట్లో తక్కువవుతుందని అనుకున్నాము. కాని ప్రతిజిల్లాలోకూడ యీవిషయములో ఖర్చుఎక్కువగానే అవుతున్నది. East Godavari జిల్లాను గురించి యీవిషయములో పరిశీలించి లక్షరూపాయలకంటె ఎక్కువగా ఖర్చుఅవుతుందనే వుద్దేశ్యముతోనే దాన్ని పునర్పరిశీలన జేయటానికి ప్రస్తుతము ఒక సంవత్సరమువరకూ వాయిదా వేయడము జరిగింది. ఈకోర్టుఫీజువల్ల వచ్చే ఆదాయమును పెంచినందువల్లనే రాష్ట్రఆదాయము పెంచుకోవచ్చుననే ఆశమాత్రము మాకులేదు, ఆలాంటి అభిప్రాయము మాకు ఎన్నడునూలేదు.

కొద్దిగా ఆదాయము పెరిగినట్లయితే, కోర్టులలో చేయవలసిన మార్పులు చేసి అనుకూల వాతావరణము కలిగించవలెననే ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము. మన బాసిరెడ్డిగారు ఒక ముఖ్యమైన సమస్య లేవదీశారు. కోర్టులలో ఒకకేసు ప్రారంభించకముందే, యిరుపక్షాలవారు రాజీకివస్తే అందులో ఒకపార్టీవారు కేసుఉపసంహరించుకుంటె. అప్పటికి కట్టిన కోర్టుఫీజు refund చేయాలని చెప్పడము సబబుగావుంది. ఇదిమంచిదేకాదు. సెలెక్టు కమిటీలోకూడ సూచనచేశారు. అదిచాలా బాగానే వుంది కాబట్టి నేను దాన్ని అంగీకరించుతాను. మరచిపోలేదు.

సెలెక్టు కమిటిమీటింగు ముగిసినతరువాత ఎసంబ్లీలో ప్రవేశ పెట్టేముందు దాని విషయమై పరిశీలన చేసినాము Court fees Act ను సవరిస్తున్నాము. దాని ఫలితాలు ఒక సంవత్సరంపాటు చూసి దానివల్ల ఆదాయం ఎంత వస్తుంది? బసిరెడ్డిగారి అమెండుమెంటు అంగీకరిస్తే ఎంతనష్టం వస్తుంది? ఈ విషయాలు ప్రభుత్వం గమనించిన తరువాత మరొక పర్యాయం దానిని గురించి మనము చర్చించుకొనవచ్చును. ప్రిన్సిపులు అంగీకరిస్తున్నాము అని చెబుతున్నాను. న్యాయంగాఉన్నది, కాబట్టి ఎంతనష్టం వస్తుందోచూసి న్యాయం అయిన సవరణ తీసుకొనివస్తాం అని చెబుతున్నాను. మద్రాసు ప్రభుత్వంవారి శాసనంలో ఉన్నదే.

SRI K V KRISHNAVATARAM:—

Madras Act లో ఉన్న మాదిరిగా చేయడం సబబు.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

I do not want to go into the details. I consider it as a healthy one. సంవత్సరం కాగానే ఎంత లాభం వస్తుంది. ఎంత నష్టం వస్తుంది. ఎంత మిగులుతుంది అనే విషయాలను చూడవలసి ఉన్నది. ఇంతకుముందు ఈ ప్రావిజను మన చట్టములో లేదు. నూరు సంవత్సరాలుగా లేదు. కొత్తగా ప్రావిజను చెయ్యమంటున్నారు. మంచిదే. ఆలోచించవలసిన విషయాలు ఇంకా ఎన్నో ఉన్నాయి. అన్నింటితోపాటు ఇదికూడా ఆలోచిస్తాము. లాభనష్టాలను తీసుకొని సవరణ చేస్తాము. అని చెపుతున్నాను. ఇక opposition గురించి Ranganadha Modaliar గారు చెప్పారు. మన రంగనాథ మొదలియారుగారు, అప్పారావుగారు ఇతర నేషనలిస్టు పార్టీ వారు సంపూర్ణముగ సహకారం ఇస్తున్నారు. వారికి న్యాయం సవ్యం అని తోచిన సలహాలు యిస్తున్నారు అపోజిషనువారు అపోజిషను కోసం కాక అక్కడక్కడ వారు కూడా సపోర్టు చేస్తున్నారు. సెలక్టు కమిటీలో సపోర్టు చేసినా సరే అసెంబ్లీకి వచ్చి పేపర్లు వ్రాసుకొంటారు. కాబట్టి ఇక్కడ oppose చెయ్యాలనే ఉద్దేశముతో కాక వారు అక్కడ ఇక్కడ కూడా సపోర్టు చేస్తున్నారు. వారు చేస్తున్నది సవ్యముగా ఉంది. అందుకు వారిని ప్రత్యేకముగా అభినందిస్తున్నాను.

ఇక మిగిలిన మిత్రులు సత్యనారాయణగారు Socialistic Pattern of Society తో రక్షణ ఎట్లా ఉండాలో చెప్పారు. పేదవారి పేర్లు పలుమార్లు ఉపయోగిస్తున్నాం. ఈ పేదతనానికి కప్పుతున్న sympathy వల్ల అజీర్ణం వచ్చి పేదవారు నలిగిపోతున్నారు పేదతనం నలిగిపోవడం ఒకటి. ఈ expression of sympathy తో నలిగిపోవడం ఇంకొకటిగా పరిణమిస్తున్నది. ప్రతితూరి పేదవారిమీద ప్రతి పక్షాలవారొక్కరికే monopoly లేదు. Sympathy ని express చెయ్యడానికి ఏమీ ఖర్చు లేదు. కాబట్టి ప్రతిరోజు చెయ్యవచ్చును, కాని పేదవారికి ఆకలి తీరలేదు. ఈ Sympathy వల్ల అజీర్ణం వస్తుంది. కాబట్టి కొద్దిరోజులు అది మానుకొని realistic గా సలహాలు, ఈయవలసినదని కోరుతున్నాను. దేనిని గురించి మాట్లాడినా పేదవారి పేరే చెప్పడం ఒక ఆచారం అలవాటు అయిపోతూ ఉంది. ఎవరు మాట్లాడినా ప్రత్యేకంగా ఒక పార్టీని గురించిగాని, వ్యక్తిని గురించిగాని చెప్పడంకన్న బిల్లుయొక్క ఫలితాన్ని గురించి చెపితే బాగుంటుంది.

మిగిలిన విషయంలో నేను చాలా accommodating గా ఉంచినాను సెలక్టు కమిటీలో. ఏదైనా మార్పులు సూచిస్తే ఇటు అటు అన్ని ఆలోచించిన తరువాత నే

నేను ఏదో బలవంతంగా చేతులు ఎత్తండి ఓటు చెయ్యండి ఆనేరకంగా majority division మేము తీసుకోనలేదు. అన్ని విషయాలు చర్చించి accommodate చేసుకున్నాం. ఏదోఒకటి రెండింటిమీద disagreement ఉంటె perseuati on ద్వారా గాని, ఇంకోరకంగా గాని adjustment కు వచ్చేము. ఇంటికిపోయిన తరువాత ఏదోపంపాలికదా అని ఇప్పుడు కమ్యూనిష్టులు dismissing notes పంపేరు. పంపక పోతే బాగుండేదేమోనన్నట్లు వోటుకు పెట్టడములేదు. ఎన్నిఓట్లు ఇక్కడ ఎన్ని అక్కడ అనేవిధముగా చూడలేదు అటువంటి పరిస్థితులు రానేలేదు. అందరు సెలక్టుకమిటి సభ్యులు ఈ బిల్లును సవ్యంగా చేయడానికి కృషిచేశారు.

తాలూకాకు ఒక మునసబుకోర్టు కావాలని వెంకటేశ్వర్లుగారు అన్నారు. తాలూకాకు ఎన్నికోర్టులు పెట్టాలన్నది కేసులసంఖ్యనుబట్టి work నుబట్టి ఉంటుంది. అనంతపురం జిల్లాలో ఎక్కువ దూరముగాఉన్న ప్రాంతాలుకూడా ఉన్నాయి. పెనుగొండలో 4, 5 తాలూకాలకు కలిపి ఒకకోర్టు ఉన్నదని వారుచెప్పారు, 50,60 మైళ్లు పోవాలన్నారు. అన్నిప్రాంతాలుకలిసినా ఒక మునసబుకోర్టుకు పనిలేదు. మీరుచెప్పిన పరిస్థితులకు 5 మంది మునసబులను నియమిస్తే వాళ్ళు పనిలేక గోళ్లుగిళ్ళు కుంటూ కూర్చోవాలి. అక్కడ ఎంతో staff కావాలి, ఎంతో ఖర్చు అవుతుంది. అవసరాన్నిబట్టి హైకోర్టు రికమండుచేసిన దానిని మేము accepect చేస్తున్నాము. తాలూకాకు ఒకటి అని principle పెట్టుకుంటేమాత్రం ఇంతకు నాలుగురెట్లుఖర్చు ఎక్కువ అవుతుంది. మీరు ఇచ్చేవ కోర్టుఫీజు ఆఖర్చుకు సరిపోదు. ఇలాంటి కోర్టు ఫీజు నాలుగింతలు హెచ్చిస్తేనేగాని ఆ Expenditure ను మనము Meet కాలేము. మనము స్పెషల్ గా ఏదైనా కావాలంటె చెయ్యవచ్చును.

మొబైలు కోర్టులను గురించి చెప్పారు. దానివిషయం ఆలోచించాలి. దానిని గురించి experment వెయ్యాలి.

శ్రీకాకుళంలో కోర్టులేదని మిత్రులు అక్కడి అడ్వకేటులుకూడా చెప్పినారు, అది న్యాయమైన కోరిక. ప్రత్యేక జిల్లావుండి కోర్టు లేకపోవడం అన్యాయం అని చెప్పవచ్చును. ఇప్పుడు District Magistrates గా ఉన్నవారిని Additicnal District Judgesగా నియమించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. అటువంటి వారిని Judiciary Separate అయిన జిల్లలలో నియమించడానికి నిర్ణయించుకొన్నాం. అటువంటివారిని శ్రీకాకుళంజిల్లాలో వెయ్యడానికి వీలు అవుతుందేమో చూసి Additional District Judges ను వెయ్యడానికి అవకాశం ఉంటుందేమో పరిశీలిస్తున్నాం. నేను Of hand గా మాట్లాడుతున్నాను. ఎలాంటి అవకాశముఉన్నా అటువంటి Additional District Judges ని శ్రీకాకుళంలో నియమించడానికి ప్రభుత్వం సిద్ధముగా ఉంది. ఏదైనా Construtive గా చెబితే ఆలోచిస్తాము.

SRI S. RANGANATHA MUDALIAR:—

Will there be any difference in pay between newly proposed additional district judges and the seniormost Subordinate Judges?

The Hon. N. SANJEEVA REDDI:—

The Seniormost Subordinate Judge automatically becomes an Additional District Judge.

SRI S. RANGANATHA MUDALIAR:—

Does it carry any special pay, or any additional pay?

The Hon. N. SANJEEVA REDDI:—

Whatever one gets, when promoted as District Judge, he also gets.

SRI S. RANGANATHA MUDALIAR:—

Will it not be sufficieut if a Senior Subordinate Judge is appointed as District Judge; now that District Judge's work has gone down very much.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

That is why he is getting something extra now. Since we are converting them into district judges naturally their pay goes up a little Therefore he will get almost all the status of a district judge.

SRI S. RANGANATHA MUDALIAR:—

Let the expense be less, Sir. A Senior Subordinate Judge will be all right as a district magistrate (judicial).

The Hon, SRI N. SANJEEVA REDDI:—

I agree, Sir. We are calling him 'additional district judge'. It costs us a little more than what it is costing us to-day?

SRI S. RANGANATHA MUDALIAR:—

Is that cost necessary?

The Hon. SRI N. SANJEEVA REDDI;—

The new Act has almost compelled us to take this step. We have consulted the High Court also about this. We have taken their

opinicn. It is a proposa! made by the High Court, which we have accepted, though it costs a little more than what it would normally do.

పేదవారువేసే రిట్ దరఖాస్తులమీద రుసుము తగ్గించడానికి సాధ్యమవుతుందా అని, ధనవంతులకు రుసుము ఎక్కువపెట్టేటట్లు చెయ్యాలని వెంకటేశ్వర్లుగారు అన్నారు. అది సాధ్యముకాదని నాకు layman గా తోస్తున్నది. Categories చెయ్యడం కష్టం categories గా define చేసి పేదవారికి writ అనేది ఇంకొక విధముగా చెయ్యగలమా? అది సాధ్యము కాదని నాకు తెలుస్తుంది. పేదవారు election లలో ఓడిపోయినారు. ధనవంతులే కాదు election లో ఉండేది. వ్యక్తికి, వ్యక్తికి Discrimination చెయ్యడము అగుతుంది. అది సాధ్యము కాదని అనుకొంటున్నాను. Supjet Matter ను బట్టి ఆయనే ఏమి చెయ్యడమో ఆలోచిస్తాడు, Writ లు వేస్తే వాడికి ఆస్తి ఇంతఅని అనడం ఏచట్టంలోను సాధ్యము కాదు అనుకుంటాను.

ఇంత కూలంకషముగా చర్చించి యీ చట్టాన్ని ఈవిధముగా రూపొందించడానికి తోడ్పడిన సభ్యులందరికి అభివందనములు తెలుపుతూ దీనిని చట్టముగా pass చెయ్యవలసినదిగా కోరుచున్నాను.

Mr. SPEAKER: The question is:

That the Andhra Court fees and Suits Valuation Bill, 1955 be passed into law.

The motion was passed and the Bill was passed into law.

Mr. SPEAKER :—

The House will now proceed to the next item.

## IV Government Resolution
## Re: Formation of Visalandhra.

Mr. SPEAKER :—

I have admitted the resolution of Government regarding the immediate formation of Visalandhra. The Hon. Deputy Chief Minister will move it.

The Hon. Sri N. SANJEEVA REDDI—

Sir, I beg to move: This Assembly notes with regret that the Government of India have not yet announced their decision on the merger of Andhra with the Residuary Hyderabad. The wishes of the people were amply given expression to by people's representatives in Hyderabed and in Andhra. In the Andhra

Assembly the resolution was passed NEM CON, and that represents the unanimous view of the Andhras. Even in the Hyderabad Assembly quite a large number of people spoke in favour of Visalandhra. The Andhra opinion is not casual in asking for Visalandhra. They are determined to get all the Telugu speaking people under one Administrative set up.

This Assembly hereby reiterates its previous resolution dated 25th November 1955 and requests the Government of India to implement the resolution and announce their decision early.

అధ్యక్ష మహాశయా! ఇది ఆంధ్రదేశానికి, విశాలాంధ్రరాష్ట్రానికి సంబంధించిన తీర్మానం. అతిముఖ్యమైనది. ఇప్పటి పరిస్థితులలో దీనిని రెండవతూరి మన అసెంబ్లీ ముందుకు తీసుకురావలసిన అగత్యం కలిగినందుకు విచారిస్తున్నాను. భారతదేశంలో యితర రాష్ట్రాలకు సంబంధించినంతవరకు ప్రభుత్వంవారు తమతీర్మానాలేమిటో తెలియ జేశారు. ఒక పంజాబు విషయంలోమాత్రం ఏవో చర్చలు జరుగుతూఉన్నాయి, అక్కడున్న ప్రత్యేక పరిస్థితులనుబట్టి హిమాచలప్రదేశ్‌ను కలపడమా లేదా అనే విషయం గురించి, తరువాత పంజాబీ, హిందీ యిలాంటి రెండు మూడు భాషలు కలిగిన భాషాసమస్యల గురించి పరిశీలన చేస్తున్నారు. అది పరిశీలనకు అవసరమైన సమస్యే అనుకుంటున్నాను. చాలాయిబ్బందులున్నాయి నాకు తెలుసును. కాని తెలుగువారికి సంబంధించినంతవరకు ఎంత ఆలోచించినాసరే అట్టి ప్రధానమైన పరిస్థితులు కనపడ లేదు. కాబట్టె యీ విశాలాంధ్రను గురించిన సమస్య ఎందుకు వాయిదా వేస్తున్నారో ఎంత అర్థంచేసుకోవాలని ప్రయత్నంచేసినా అర్థంకావడంలేదు. ఇది చిన్న సమస్య, మళయాళం మాట్లాడేవారికి మళయాళరాష్ట్రం యిచ్చినట్లు ప్రకటన జరిగింది. కర్ణాటకులకు అన్ని రాష్ట్రాలలోవున్న భాగాలనుచేర్చి ప్రత్యేకరాష్ట్రం ఏర్పాటు చేయడానికి అంగీకరించారు. Madras రాష్ట్రంలోవున్న South canara జిల్లాను ప్రత్యేక రాష్ట్రంగా నున్నటువంటి Coorg, Hyderabadలో నున్నటువంటి కర్ణాటక ప్రాంతం కొద్దిగా బొంబాయిలోఉన్న కొద్ది కన్నడప్రాంతం యివన్నీకూడా కలిపి మైసూరురాష్ట్రంగా ప్రత్యేకంగా ఏర్పాటుచేస్తున్నాము అని 'ప్రభుత్వం ప్రకటించడం ఆ ప్రకటనతరువాత అన్ని ప్రాంతాలలోని ప్రజలుకూడా ఉత్సాహపూరితంగా స్వీకరించి కర్ణాటకరాష్ట్రం ఏర్పడినతరువాత ఏరకమైనచర్యలు తీసుకోవాలో ఆలోచించుకొని తమ భవిష్యత్తుగురించి చర్యలు తీసుకొనడం జరుగుచున్నది. ఈమధ్య ఢిల్లీ పోతూంటే ముఖ్యమంత్రి హనుమంతయ్యగారు హైదరాబాదుకువచ్చి అక్కడి కర్ణాటక మిత్రులను, ఉద్యోగస్తులను కలిసికొని వారియొక్క అభిప్రాయాలు తెలిసికొని రానున్న మైసూరురాష్ట్రంలో ఏరకంగా వారి సహకారం పొందడం అని వారు ఆలోచిస్తున్నారు. ఇతర రాష్ట్రాలవారిని మహారాష్ట్రులు మొదలైనవారందరు తమ రాష్ట్రాలకు సంబంధించుకొని తమ శ్రేయస్సు, భావిభాగ్యోదయం ఆలోచించుకొంటూ

ఉంటే యీనాడు ఆంధ్రులకుమాత్రం మా future ఎట్లావుంటుంది? భవిష్యత్తులో మేము కలిసివుంటామా లేక ఆంధ్రులలో చీలికలుంటాయా, అని ఆందోళన చెందుతున్నారు. ప్రత్యేకంగా ఆంధ్రులకుమాత్రమే యీ సమస్య ఎందుకువచ్చింది. అని అతృతపడుతున్నారు. ఇంత ఆలస్యం చేయడానికి కారణంఏమిటి? హైదరాబాదు మిత్రులు కొందరు ఆక్షేపిస్తున్నారని Hyderabad culture వేరుఅని Hyderabad Ample State అని యిలాంటివి పత్రికలలో చదువుతున్నాము. కాని యివన్నీ చిన్న సమస్యలు, ఈ సమస్య అంతా రెండురోజులలో ఆలోచించి తీర్మానంచేసివుండవలసినది. ఇది మన దురదృష్టం. ఇలాంటి చిన్నసమస్యను పెద్దసమస్యగా మార్చి గోటితో పోవలసినది గొడ్డలితో కొట్టవలసిన పరిస్థితికావడం మన దురదృష్టం అనే అనుకుంటున్నాను. ఇప్పటికయినా యీ విషయం త్వరగా తేల్చమని చెబుతున్నాను. ఈ సమస్య అంత బ్రహ్మాండమైన సమస్యకాదు అనిమాత్రం మనం ఢిల్లీప్రభుత్వానికి తెలియజేసేనిమిత్తము ప్రత్యేకంగా యీతీర్మానాన్ని అసెంబ్లీలో ప్రవేశపెట్టుకొన్నాం. ప్రత్యేకంగా తెలంగాణా surplus రాష్ట్రం అనుకుంటున్నారు తెలంగాణావాదులు. తెలంగాణా ఆంధ్రరాష్ట్రంలో కలిస్తే ఆదాయం తగ్గిపోతుందంటున్నారు. వీంట్లో ఏమాత్రం అర్థంవున్నదని అనుకోడానికి అవకాశం కనపడలేదు. ఈ భారతదేశంలో ఏరాష్ట్రం అయినాసరే surplus రాష్ట్రం అనడానికి వీలున్నదా అనేసమస్య అర్థం కాకుండావున్నది. అలాంటప్పుడు భారతదేశ రాష్ట్రాలలో ఎన్నో యిబ్బందులుకూడా వున్నాయి. కావలసిన విద్యలేదు. ఆరోగ్య సదుపాయాలులేవు. రోడ్లు అభివృద్ధి ఏమీ లేదు అన్నివిధాలా వెనుకబడిన భారతదేశంలో మిగులురాష్ట్రం వున్నదంటే అదిచాలా పొరపాటు, ఏమీ పనిచేయకుండా ప్రజలకు కావలసిన సౌకర్యాలు సమకూర్చకుండా సిబ్బందికి జీతాలిచ్చి నాలుగుకోట్లు మిగిలించుకున్నామని చెప్పుకోడం ఘనతకాదు. అది మనశక్తిని వెల్లడించే విషయంకాదు అని అనుకుంటున్నాను. కాబట్టి ఆంధ్రరాష్ట్రం యీనాడు నాలుగుకోట్ల తరుగులోవున్నదన్నా నేను గర్విస్తున్నాను. మన schemeలో అభివృద్ధిచూస్తే మద్రాసురాష్ట్రమును మించిన scheme లున్నాయి. ఇలాంటివి ఆదాయాన్ని గురించి ఆలోచించకుండా ఎంతనష్టంవస్తుందని ఆలోచించకుండా Schools, Colleges, ప్రారంభించడమునుబట్టి deficit State గా వున్నాం. కాని హైదరాబాదు మాదిరి Schools ప్రారంభించకుండా Electricity కింద వచ్చేఆదాయాన్ని ఉపయోగించకుండావుంటే ఆంధ్రరాష్ట్రం ఎంత Surplus గా వుండేదో ఆలోచించమని కోరుతున్నాను. ఇక యిప్పుడు ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకరాష్ట్రంగా పెడతాం 5 ఏండ్ల తరువాత ఆలోచిస్తాం అనేసమస్య కొందరు లేవదీస్తున్నారు. ప్రత్యేక రాష్ట్రంగా ఉండడంవల్ల ఎన్నియిబ్బందులున్నాయో హైదరాబాదులోని మనమిత్రులకు తెలియకపోలేదు. మద్రాసులో మన ఆఫీసులు యింకోచోట కొన్ని ఆఫీసులు చిందరవందరగా వుండడంవల్ల, Madras లోని మన ఆఫీసులతో ప్రభుత్వానికి Coutact లేకుండా యిప్పటికి 2½ సంవత్సరాలనుండి ఎన్నోయిబ్బందులకు గురయ్యాం. ఇప్పటికప్పుడే యీ కర్నూలుపట్నంలో 2½ కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాం. 5 ఏండ్ల

1st February 56

అవుతుంది. అది నగ్నసత్యము. అందులో ఏవిధమైనటువంటి అభిప్రాయభేదాలు లేవు. కాని ఇటువంటి నిర్ణయాలన్నీ ఒకప్రక్క తీసుకుంటూ, విశాలాంధ్ర సమస్య రాబోయే సరికి దీనిమీద ఒకనిర్ణయాన్ని చేయకుండా రోజురోజుకుకూడా గడువు పొడిగిస్తూ, High Power Committee ఈవేళ ఒక గంట కూర్చొంది. రేపు నాలుగు గంటలు కూర్చుంటుంది అని కాలక్షేపము యెప్పుడు అయితే చేస్తూవస్తున్నారో, విశాలాంధ్ర సమస్యమీద ఇక్కడ శాసనసభ్యులందరికి, ఆంధ్రదేశములోని యావన్మంది ఆంధ్ర ప్రజలకుకూడా ఒక అనుమానము ఒయలుదేరింది. అందుచేత ఈరోజు మరల మనము ఒకసారి దీనిని కేంద్రప్రభుత్వము దృష్టికి తీసుకువెళ్ళవలసిన అవసరము ఉందని ఈ తీర్మానము తీసుకురాబడింది.

High Power Committeeలో నలుగురు పెద్దలు ఉన్నారు. వారికి గట్టిగా మన అభిప్రాయాన్ని చెప్పవలసిన అవసరము ఉన్నది. "విద్యావిషయములో మనము వెనుకబడి ఉన్నాము, ఇంకా వెనుకబడిపోతాము. ఆంధ్రప్రజలు వచ్చి మనలను dominate చేస్తారు" అనే ఉద్యమం కొంతమంది రాజకీయవాదులు విద్యార్థులలో ప్రవేశపెట్టడముచేత తెలంగాణాలో పెద్దపెద్ద సమ్మెలు జరపడము జరుగుతున్నది. కాని మనము నిజముగా హైదరాబాదు ప్రజలకు చెప్పవలసినది ఒకటే. ఈరోజున మనము విశాలాంధ్ర స్థాపించుకుంటున్నాము అంటే తెలంగాణాలో ఉన్న ప్రజల కోసమే అనేది నగ్నసత్యము. కాని ఏవో ఇబ్బందులను ఊహించుకొని ఆ కమిటీవారి ముందు పెట్టడమువల్ల, భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతాన్ని అంగీకరించినవారుకూడా ఈ సత్యాన్ని తెలుసుకొనగలిగినవారు అయికూడ, తెలివితేటలుగల పెద్దనాయకులు అయికూడా, ఈ విశాలాంధ్ర సమస్య రాబోయేసరికి ఇంతకాలము ఉపేక్షించి ఒక నిర్ణయానికి రాకుండాపుండడం మనము చాలా విచారించవలసిన విషయమే. దీనిమీద తక్షణమే చర్యతీసుకోవలసిన అవసరం ఎంతైనావున్నదని మనవిచేస్తున్నాను.

ఇవేళ సంజీవరెడ్డిగారు ఆంధ్రదేశములోఉన్న యదార్థవిషయాలను అన్నింటినీ కూడా చాలా విపులముగా ఈ సభముందుకు వచ్చి చెప్పారు. వాటిని సంపూర్ణముగా మనము అంతాకూడా అంగీకరించవలసినదే. ఇంక వేరే కొత్తగా చెప్పవలసిన విషయాలు ఏమీలేవు. ఈనాడు ఆంధ్రదేశములో విద్యార్థులు చాలామంది హర్తాలు, సమ్మెలు శాంతియుతముగా జరుపుతున్నారు. ఈరోజు శాసనసభ్యులము అంతాకూడా మనయొక్క ఆవేదనను ఎట్లా ప్రజలముందు పెట్టాలని అంటున్నామో అలాగే తెలంగాణాలో ఉన్నటువంటి విద్యార్థులు, అక్కడ వున్నటువంటి విశాలాంధ్ర అభిమానులు అంతాకూడా ఊరేగింపులద్వారా, హర్తాలులద్వారా వారివారి అభిప్రాయాలను కేంద్రప్రభుత్వానికి తెలియపరచడముకోసము ప్రయత్నము చేస్తున్నారు. కాని అంతకంటే ఏమీలేదు. అందువల్ల "తక్షణం విశాలాంధ్రను ఏర్పరచాలి" అనిమనముందు

**1st February 1956**

వున్న తీర్మానమును అందరూ ఏకగ్రీవముగా ఆమోదించాలని నేను చెబుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

THE HON. SRI G. LATCHANNA :—

అధ్యక్షా, విశాలాంధ్రగురించి మరొకసారి ఈనాడు తీర్మానము చేసుకోవలసిన అవసరం ఏర్పడిందిఅంటే, ఢిల్లీనుంచి పత్రికలలో వచ్చినవార్తలు, జరుగుచున్నటువంటి ప్రచారాలే ప్రధాన కారణమని నేను చెప్పవలసినపనిలేదు. ఇటీవల మన రాష్ట్రములో అక్కడక్కడ సభలు జరిగాయి, హర్తాల్స్ జరిగాయి అనేదానికికూడా ఢిల్లీ వార్తలే ప్రధాన కారణము. ఆంధ్రదేశములో ఉన్నటువంటి నాయకులు యావన్మందికూడ విశాలాంధ్ర సమస్యపట్ల చాలా శాంతియుతమైన సక్రమమైన పద్ధతులలో ఏకాభిప్రాయముతో విశాలాంధ్ర వాంఛను ప్రకటిస్తున్నప్పటికీ, ఆంధ్రదేశములో ఉన్న ప్రజలకు విశాలాంధ్ర సమస్యపట్ల ప్రత్యేకమైన పట్టుదలలేదని ఢిల్లీలోఉన్న పెద్దలు అభిప్రాయపడినారనేటటువంటి వార్తలు వీటన్నింటికి కారణమవుతున్నాయి. ఇది చాలా శోచనీయమైన పరిస్థితి. మరి ఈనాడు ఆవేశాలలోగాని, ఉద్రేకాలలోగాని మనం ఇతర రాష్ట్రాలతో పోల్చిచూచుకొంటే, ఆంధ్రజాతి ఏ ఇతర రాష్ట్రానికి తీసిపోదు అనేసంగతి ఈరోజున కొత్తగా ఎవరూ చెప్పనవసరంలేదు. భారతదేశచరిత్రలో ఆంధ్రజాతియొక్క ఆవేశము, ఉద్రేకము, పట్టుదలగురించి అందరికి తెలిసిందే, ఇది లోకవిదితమైనటువంటి విషయము. అట్లాంటి పరిస్థితులలో ఇటువంటి వార్తలు వస్తున్నాయిఅంటె ఈ వార్తలు ఎంతవరకు సత్యము అనేది సందేహాస్పదముగా ఉన్నది. సత్యమేఅయినట్లయితే పట్టుదల ఉన్నది అని రుజువుచేయడానికి ఏమిటిమార్గాలు అనేది మనము పరిశీలించవలసియున్నది. ఈనాడు భారతదేశములో భాషాప్రయుక్త విభజన సిద్ధాంతాన్ని అనుసరించి వివిధ రాష్ట్రాలు పునర్విభజన జరుగుతున్న ఈ సందర్భంలో అనేక రకాలైనటువంటి దుస్సంఘటనలు కలుగుచున్నాయంటే, ఇట్లాంటి అసందిగ్ధమైనటువంటి, సత్యదూరమైనటువంటి వదంతులు ప్రచారాలు, విమర్శలే అందుకు కారణమని చెప్పవలసియున్నది, అందుచేత మన జాతీయనాయకులు, పెద్దలు ఇప్పటికైనా ఈ పరిస్థితిని గమనించి, అనవసరమైనటువంటి కాలయాపనచేయకుండా వెంటనే పరిష్కారంచేయడం అవసరం. నిన్ననూ, మొన్ననూ వస్తూన్నటువంటి వార్తలనుచూస్తే, ద్విభాషారాష్ట్ర నిర్మాణము అనే నూతనమైన అభిప్రాయాలు, ప్రతిపాదనలు వస్తున్నందువలన విశాలాంధ్ర పంజాబు రాష్ట్రనిర్మాణసమస్యలు వాయిదావేయడం జరిగిందనేవార్తలు, ఇవి ఎంతవరకు నిజమోగాని, ఒకవేళ నిజమేఅయితే ద్విభాషా రాష్ట్రనిర్మాణము అనేది నిజంగా జరుగుతుందా అనేది యావత్తు ఆంధ్రజాతి సందేహించవలసిన పరిస్థితి యేర్పడుతుంది. ఇది 'కడనారికి కల్యాణం' అనే సామెతమాదిరిగా ఉన్నది. అసలు ఒక్కజాతికి, భాషకు చెందినవారి రాష్ట్రనిర్మాణమే జరుపలేక దీనికి కాలయాపనచేస్తూ మీనమేషాలు లెక్కపెట్టుకొనుచున్నటువంటి మన పెద్దలు ద్విభాషారాష్ట్రనిర్మాణము చేస్తారు అని నమ్మడం అంటె ఇది చాలా కష్టంగాఉన్నది. ఈ ప్రతిపాదన నమ్మడానికి సాహసం

చాలడంలేదు. ద్విభాషారాష్ట్రనిర్మాణము అనేది మంచిదా, చెడ్డదా అనేది వేరే సమస్య. అది ఏకభాషారాష్ట్రనిర్మాణం జరిగిన తరువాత ఆలోచించవలసిన సమస్యే గాని, ఇప్పుడు ఆలోచించవలసిందికాదు. ఇప్పుడు ఏకభాషారాష్ట్రనిర్మాణము అనే ఒక కార్యక్రమమును ప్రారంభించి, దానిని మధ్యలోనేఆపి, మరొక కార్యక్రమమును గురించి ఆలోచనచేయడం అనేది ఒక అసందిగ్ధమైనపరిస్థితి. ఒక అనవసరమైన ఆందోళన ఏర్పడడానికి దారితీస్తుందేగాని, ఇది సమస్యాపరిష్కారానికి ఏమాత్రమూ దోహదమివ్వదని చెప్పవలసియున్నది. మరొకసమస్యకూడా ఉన్నది. ఇటీవల కేంద్రప్రభుత్వము ప్రకటించినటువంటి నివేదికలో సరిహద్దుల సమస్యలపట్ల వారు చేసినటువంటి సూచనలు, ఆలోచనలు చూస్తే ఎవరైనా బాధపడకతప్పదు. నూటికి 75 మంది ఉన్నటువంటి సరిహద్దులగురించే పునరాలోచించడానికి వీలుంటుంది, మిగతావాటిని గురించి వీలుండదు. అని మనజాతీయపెద్దలు అభిప్రాయపడినట్లుగా పత్రికాప్రకటనలవల్ల మనకు తెలుస్తున్నది. అది ఎంతవరకునిజమో తెలియదు నిజమేఅయితే, అది సరిఅయిన పద్ధతి కాదు అని సవినయంగా ఏకగ్రీవంగా చెప్పవలసియున్నది. ఎందువల్లనంటే, అది సమస్యల పరిష్కారానికి దారితీయదు. అనేక సంవత్సరములనుంచి, ముఖ్యంగా ఒరిస్సారాష్ట్ర నిర్మాణం అయిననాటినుంచి, ఒరిస్సా, ఆంధ్ర సరిహద్దులగురించి జరుగుతున్నటువంటి వాదోపవాదములు, తర్కవితర్కములగురించి స్వాతంత్ర్యము రాకముందే జాతీయకాంగ్రెస్ కార్యవర్గము కొన్ని హామీలు యిచ్చియున్నది. స్వాతంత్ర్యము వచ్చినతరువాతగూడ, జాతీయ ప్రభుత్వము కొన్ని హామీలు యిచ్చియున్నది. ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసుసంఘానికి, ఒరిస్సా కాంగ్రెస్ సంఘానికి కూడ, రాష్ట్రపునర్విభజన జరిగే సందర్భములో 'ఈసమస్యలు మేము పరిష్కారం చేస్తాము' అని అధికారపూర్వకమైనటువంటి వాగ్దానాలుకూడ మన సర్దార్ పటేల్ గారు చేసినటువంటి సందర్భాలు ఉన్నాయి. అట్లాంటి హామీలు, ప్రకటనలు ఉండగా, ఈనాడు 'నూటికి 75 మంది ఉన్నచోట్లనే, దీన్ని గురించి పునరాలోచన చేయబడుతుంది' అని చెప్పడం అంత సరిఅయినటువంటి మార్గంకాదు. అది ప్రజాస్వామిక సూత్రములకు గాని, పద్ధతులకుగాని ఏమాత్రము అనుకూలించదు. ఒరిస్సా సోదరులు అధిక సంఖ్యాకులు గల ప్రాంతము ఆంధ్రరాష్ట్రములో ఉన్నా, అది ఆంధ్రప్రభుత్వానికి శ్రేయోదాయకమైనదికాదు. ప్రభుత్వమువారికి ఎంత మంచి చేసినాకూడా మాకు అన్యాయము చేస్తున్నారని వారు చెప్పడం జరుగుతున్నది. అల్పసంఖ్యాకుల ప్రజలు అధికంగా ఒక ప్రాంతములో ఉన్నప్పుడు, వారిని బలవంతముగా ఆ రాష్ట్రములో ఇమిడ్చి ఉన్నప్పుడు ఆ రాష్ట్ర ప్రభుత్వము ఎంత మంచిపనిచేస్తున్నా, ఆ ప్రాంతములో ఉన్నటువంటి యితర రాష్ట్రీయులు మాకు అన్యాయముచేస్తున్నారు అని చెప్పడానికి, విమర్శించడానికి, నిందించడానికే తావు ఇస్తుందిగాని, సామరస్యానికిగాని, సద్భావానికిగాని తావు ఇవ్వదు. ఇరుగుపొరుగు భాషాప్రయుక్తరాష్ట్రాలలో సుహృద్భావాన్నిగాని, శ్రేయాన్నిగాని ఏర్పాటుచేయాలంటే, ఆ ప్రాంతాలు, తాలూకా ప్రాతిపదికమీదనే కాకుండా ఫిర్కాప్రాతిపదికమీద ఆలోచనచేసి, ఎవరైనా 'మీ రాష్ట్రములో మేము ఉండలేము,

మేము యితరరాష్ట్రానికి పోతాము' అని అనుకొన్న వారికి అవకాశము కల్పించడమే నిజమైన శాంతిస్థాపన, సహృదయస్వభావము పునరుద్ధరించడానికి మార్గదర్శకం అవుతుంది గాని బలవంతముగా ఒకచోట ఒకరిని అట్టిపెట్టేవిధానము నిజమైన శ్రేయానికి గాని, సుహృద్భావానికిగాని అవకాశమివ్వదు. ఒరిస్సా, ఆంధ్రరాష్ట్రసరిహద్దుల సమస్యలను పరిశీలిస్తే ఈ రోజున ఎవరూ ప్రత్యేకమైన ఒక argument చెప్పవలసిన పనికలుగలేదు. ఆ రోజున Samuel Hoare గారు విదేశాంగ మంత్రిగా పార్లమెంటులో చేసిన ప్రకటన పరిశీలించినప్పటికి, రెండవది అప్పుడు ఉన్నటువంటి Commission వారు గోపాలపురములో వచ్చిచేసినటువంటి ప్రకటనలు చూచినప్పటికీ పర్లాకిమిడిప్రాంతము మనదే. బళ్ళారిగురించి తాము ఏర్పాటుచేసినటువంటి కమీషన్ వారు చెప్పినటువంటి వివరాలనైనా గమనించకుండా, దానికి వ్యతిరేకముగా వ్యవహారము చేయడం న్యాయంకాదు. కనీసం రాష్ట్రప్రభుత్వము ఇచ్చినటువంటి కనీస కోర్కెనైనా మన్నించిననేగాని, నిజమైనటువంటి శాంతియుతమైన సద్భావాలతో కూడిన రాష్ట్ర పునర్విభజనకు ఏమాత్రము అవకాశముండదు. తరువాత ఇతర కన్నడ సరిహద్దులే కాకుండా, కోలారులో ఆంధ్రులు అధికసంఖ్యాకులుగా ఉన్నా, అక్కడివారికి ఇందులో చేరుటకు ఇష్టములేదనే టటువంటి ఒక నెపము ఏర్పాటుచేస్తున్నారు ఈ విధముగా చేరుతాము అన్నవారికి వీలులేదని చెప్పడము, ఇంకొకచోట చేరము అంటున్నారు గనుక చేర్చము అనడము చాలా శోచనీయముగా ఉన్నది. విదర్భలో ఉన్న ప్రజలు మేము బొంబాయిలో చేరుతామని ఏ ఒక్కడు చెప్పలేదుఅని నేను వేరే చెప్పవలసినపనిలేదు. అలాంటి విదర్భను మహారాష్ట్రములో కలపడానికి నిశ్చయించినపుడు, 'కోలారు ప్రాంతమును ఆంధ్రరాష్ట్రములో కలపడానికి అక్కడి ఆంధ్రప్రజలు ఇష్టపడడంలేదు' అని చెప్పడం సరియైన పద్ధతి కాదని మనవిచేస్తున్నాను. అందుచేత దానిననుసరించి సక్రమమైనటువంటి నిర్ణయమునకు ఎంత త్వరగా వస్తే అంత త్వరగా ఈ సమస్యలు పరిష్కారమవుతాయి. మన దేశములో భాషాప్రయుక్తముగా ఉన్న విభేదాలు సమన్వయం కావాలంటే, ఆ సమస్యల పరిష్కారం త్వరగా జరిగినపుడే అది సాధ్యమని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri P. NARASIMHAPPA RAO:—

అధ్యక్షా, ఈ తీర్మానాన్ని నేను బలపరుస్తూ, కొన్ని విషయాలు మాట్లాడదలచాను. చాలా కాలముగా మన పెద్దలు, మనలోవున్న కాంగ్రెసునాయకులు విశాలాంధ్రను గురించి చాలా తాపత్రయపడుతూ వున్నారు. కాని యీ విశాలాంధ్ర అనేది ఎప్పుడో వస్తే, ఏ కొద్దిమందో చూచి వుండేవారు. ఇప్పుడు యీ విషయమును రామరాము ప్రతి కూలిగాని, ప్రతివ్యక్తిగాని, ప్రతి చిన్న పిల్లవాడితో సహా విశాలాంధ్ర ఎప్పుడు వస్తుందా అని నిరీక్షించుకొని కూర్చుంటున్నాడు. కాని అప్పటికీ, యిప్పటికీ ఎంతో తేడాకన్పిస్తున్నది. ఏ చిన్న పిల్లవాడినోటివెంబడిచూచినా, విశాలాంధ్ర ఎప్పుడు వస్తుందా, ఏగంటలోవస్తుందా, మన కళావెంకట్రావుగారు ఢిల్లీకివెళ్ళి, అది

తీసుకొనిరావటానికే ఆక్కడనే వుండివున్నారు. వారు తప్పకుండా విశాలాంధ్రకు గాను announcement order చేత తీసుకొని వస్తారని. ప్రజలు ఎంతో ఆశతో శాంతముగా కాచుకొని వున్నారు. ఈ విషయములో ఆంధ్రులు ఎంత శాంతముగా కాచుకొని వున్నారో, అంత ఆలస్యముతో వెనుకకు పోతున్నట్లు కన్పిస్తున్నది. ఈ విధముగా ఆలస్యము కావడము చాలా విచారకరముగా ఉన్నది. ఈ మధ్యన పిలవని పేరంటమునకు పోయినట్లు ఎవరూ కూడ పిలవకుండానే S. K. Patil గారు హైదరాబాదుకు వెళ్ళి హైదరాబాదువారిని విచారించారు హైదరాబాదువారికి తెలంగాణా వేరుగావుండాలని కోరుతున్నారు. వేరుగావుంటేనే మంచిది. నేను ఢిల్లీప్రభుత్వము వారితో చెప్పినందువల్లనే, యీ విశాలాంధ్ర రాకుండా ఆలస్యము అవుతున్నది. అనేమాదిరిగా పిలవని పేరంటమునకు వెళ్ళినట్లు పాటిల్ గారు సలహా యిచ్చినారు. ఇదివరకు 1936-వ సంవత్సరములో సైమన్ కమిషన్ వచ్చినపుడు మన కాంగ్రెసు నాయకులందరూ యీ కమీషన్ వద్దకు వెళ్ళకూడదు అని సంకల్పించినప్పుడు ఆంధ్రుడు అనేవాడు ఎవ్వడూకూడా వెళ్ళలేదు. ఆ కాలములో విశాఖపట్టణముజిల్లా ఎంతో పెద్దదిగా వున్నటువంటది, యీనాడు నాలుగుభాగములుగా మార్చబడింది. అటు గంజాముజిల్లా, యిటు కోరాపుట్ జిల్లా, యింకొకవైపున శ్రీకాకుళంజిల్లా, అందులో రెండుభాగములుగా ఒరిస్సాకు సగభాగము, శ్రీకాకుళము, విశాఖపట్టణముజిల్లా అని వుంచారు. ఈ విధముగా యీ జిల్లా చీల్చబడింది. ఎక్కడో మధ్యన ఒక ముక్క ఒరిస్సాలోకి వెళ్ళింది. విశాఖపట్టణములోగుండా వెళ్ళితేగాని. ఆ ప్రాంతానికి వెళ్ళటానికి వీలులేదు, కాబట్టి దీని అర్థము ఏమిటంటే, ఎటుతిరిగినా రాయఘడ్ నుంచి గునుపూరుపోవాలి. రాయఘడ్ నుంచి, గునుపూరు రావడానికి తిన్నగా విశాఖపట్టణముజిల్లాలోవున్న పార్వతీపూరుకు రావాలి పార్వతీపూరునుంచి మరల కురుపాము మీదుగా గునుపూరుపోవాలి. అవతలపర్లాకిమిడికి రావాలంటే Berhampore దాటి యిచ్ఛాపురం మీదుగా సోంపేటవచ్చి. అక్కడినుంచి పర్లాకిమిడిపోవాలి. ఎటువెళ్ళినప్పటికనీ చుట్టూ తెలుగువారు, మధ్యన ఒక ముక్క ఒరిస్సాఅంటూ విడదీశారు. ఇది ఎట్లా ఉన్నదంటే మనకు కాకినాడ దగ్గర ఫ్రెంచివారి దేశముఅన్నట్లుగా ఒక చిన్న pocket గా వున్నది. అటువంటి ప్రాంతము సంగతి Fazul Ali Commision వారు ఏమాత్రము ఎత్తుకోలేదు. ఒరిస్సా ప్రాంతము అనిపిలవబడే చోట వున్న ఆంధ్రులు ఏమాత్రము agitate చేయడములేదు. వారికి అది అక్కరలేదు కాబోలు అనే అపోహ దేశములో ప్రబలించారు. ఇది సరికాదు. ఇంతకాలముగా కమిషనువారు పరిష్కారముచేస్తారని ఆంధ్రులు శాంతియుతముగా వేచియున్నారు. కాంగ్రెసుపెద్దలు మా ఆంధ్రులకు శాంతి, శాంతి అని ఆదేశము యిచ్చినందువల్లనే యింతకాలము శాంతియుతముగా కాచివున్నారు. ఒరిస్సావారికన్నగాని, తెలంగాణా కావాలిఅనే స్వార్థపరులైన ఒక అల్పసంఖ్యాకవర్గముకంటెగాని, మహారాష్ట్రులకంటెగాని. ఆంధ్రులు ఎక్కువగా ఆందోళన, అల్లరులుచేయగల సాహసులు. ఆంధ్రుడైన వాడు తన ఆత్మను దేశముకొరకు బలిదానముగా : యిచ్చివేశాడు. కాబట్టి

Sri P. Narasimhappa Rao] [1st February 1956

అల్లరిచేయడమనేది ఎంతో గొప్పవిషయము కాదు. అనే సంకల్పముతో సాహసించడము లేదు, అని నమ్మవలసిందిగా హెచ్చరిస్తున్నాను. ఇతరులకంటే 99 పాళ్ళు మిగులుగా చేయగల సాహసులు యీ ఆంధ్రులు. స్టేషనులు తగులపెట్టగలరు, బ్రిడ్జిలు పడగొట్ట గలరు, రైళ్ళు ఆపగలరు, ఇతరులకంటే ఎక్కువగా ఘోరకృత్యములు చేయగలరని నమ్మండి.

కాని మన కాంగ్రెసునాయకులలోని పెద్దలు యిచ్చిన సలహాలవల్ల యింతవరకూ ఓపికతోను, శాంతయుతముగాను విశాలాంధ్ర సాధించుకోవాలనే ఉద్దేశముతో నున్నారు. ఇంతవరకున్నూ, announcement యిదిగో వస్తుంది, అదిగో రాబో తున్నది అని వేచియున్నారు. ఇంత ఆలస్యము జరగడమువల్ల ఆంధ్రులు యావన్మందీ చాలా నిరుత్సాహపరులై వుంటున్నారు. ఇదిగాకుండా, అటు మద్రాసులో భాగము రావలసియున్నది ఆకాలములో అనగా 1950-వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్ర విభజన జరగడానికి ప్రయత్నాలు జరిగినప్పుడు ప్రకాశం పంతులుగారు, గోపాలరెడ్డిగారు కళా వెంకటావ్రుగారు వగైరాల సలహాలవల్ల మనకు రావలసిన మద్రాసులోని భాగము వదులుకోవలసివచ్చింది. ఆరోజున యింకను మనకు చెంగల్పట్టుజిల్లాలో కొంతభాగము కూడా యిస్తామని అన్నారు. ఆంధ్రప్రభుత్వపు ఆఫీసులుగూడ పెట్టుకోటానికి ఒప్పు కున్నారు. అటువంటిది వదులుకొని యిక్కడ కర్నూలు రావలసినగతి పట్టింది. ఇదిగాక విశాలాంధ్రవస్తుంది, హైదరాబాదు వెళ్ళవచ్చునని ఆశిస్తూవుంటే, అదిగూడ ఆలస్యము అవుతున్నది. ఇకపోతే బళ్ళారి విషయముచూస్తే దాన్ని తీసుకొనివెళ్ళి కర్నాటక ప్రాంతములో కలిపివేశారు. ఆవిధముగా బళ్ళారి పోగొట్టుకున్నాము. ఇటు ఆంధ్ర ప్రాంతాలను తీసుకొనివెళ్ళి ఒరిస్సాలో కలిపారు. ఈ విధముగా ఆంధ్రులకు ఎక్కడ పడితే అక్కడ అన్యాయమే చేయడము కనబడుతున్నది. ఇది యేదో కొంతభాగము బళ్ళారిలో యిస్తాము. ఒరిస్సాసంగతి తర్వాత చూస్తామని కాలయాపన చేస్తున్నారు. ఆకలిగొన్న వారికి ఆకలితీరినదాకా అన్నము పెట్టితే మంచిదిగాని, కొద్దిగా పెట్టి ఆకలితీర్చుకోమని చెప్పడము కానీ, పెట్టినంతే చాలునని సంతోషపడడము కాని కూడదు అని నా అభిప్రాయము. ఈ విషయములో నేను ఒక్క సంగతిమాత్రము చెప్పదలచాను. మన ఆంధ్రులకు రావలసినదంతాగూడా రావలసిందేగాని, కొద్దో గొప్పో యిస్తామని అంటే, అంతటితో సంతృప్తి పడటానికి వీలులేదు. ఏదో స్వలాభ పరులున్నారని అంటున్నారు. స్వలాభపరులు కొంతమందివుంటే వుండవచ్చు. హైదరాబాదుస్టేటు ఆంధ్రులకు యిస్తే, వారి దరిద్రముఅంతా తీర్చుకోవచ్చు, తీరి పోతుందని కాదు. అంధ్రులంగరుఒకేచోటవుండటానికి అనువుగా వుంటుందన్న వుద్దేశ్యము, అందరియొక్క అభివృద్ధి సమానముగా చూచుకోవచ్చునని వుద్దేశ్యము. ఆంధ్రు లందరూ కలిసి కట్టుగా వుండటానికి వీలుకలుగుతుందన్న ఉద్దేశ్యముకాని. అందులో ఏదోవస్తుంది. బాగుపడదామున్న ఉద్దేశ్యము కానేకాదు. ఏదో సామెత చెప్పినట్లు అన్నదమ్ములం ఒక యింట్లోవుండి ఒకేకుండలో భోజనముచేస్తే, ఖర్చుతక్కువ

అవుతుంది, అందరు వృద్ధిలోకిరావచ్చు, వేరువేరుకుండలలో వండితే ఖర్చులు ఎక్కువ కాగలవు అనే సంగతి గుర్తించాలి. ఆదేవిధముగా ఆంధ్రులందరము ఎక్కడవున్నప్పటికిని, ఒక్కచోటచేరుకొని, అభివృద్ధిపరచుకోవచ్చుననే ఆంధ్రులఆశయము. అంతేకాని హైదరాబాదువస్తే, మన దరిద్రముఅంతా తీరిపోతుందని కాదు. ఆంధ్రులయొక్క హక్కులనుబట్టి మిగతా చోట్లలోవున్న ఆంధ్రప్రాంతాలు రావాలని కోరుతూ, ఆంధ్రులయొక్క అభివృద్ధిదృష్ట్యా, విశాలాంధ్ర సాధనకు తోడ్పడవలసిందిగా కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri K. SUBBARAO:—

అధ్యక్షా, మన డిప్యూటీ ముఖ్యమంత్రిగారు తెచ్చిన తీర్మానాన్ని నేను హృదయపూర్వకముగా బలపరుస్తున్నాను. తీర్మానాన్ని బలపరుస్తూ, తీర్మానములోని మొదటి వాక్యములో కేంద్రప్రభుత్వమువారు విశాలాంధ్ర నిర్మాణమువిషయమై ఆలస్యము చేస్తున్నారన్న సంగతికి నేను చాలా విచారిస్తున్నాను. ఈ ఆలస్యము ఎందువల్ల జరుగుచున్నదో, దీనికి యింతటి ఆలస్యముచేయుటకు కారణముఏమో తెలియపరచవలసిందిగా కోరుతున్నాను. మేము ఆంధ్రులము, హైదరాబాదులోవున్నా, పర్లాకిమిడిలోవున్నా, కోలారులోవున్నా, మడకసిరలోవున్నా. బళ్లారిలోవున్నా, ఎక్కడవున్నప్పటికినీ, మేముఅందరము ఆంధ్రులమేనని అంటున్నాను. ఆంధ్రులందరికినీ ఒక్కే భాషారాష్ట్రము కావాలని ప్రయత్నముచేయుచున్నప్పటికినీ అటువంటిభాషారాష్ట్రము యింతవరకు ఏర్పాటు కాకపోవడమువల్ల. మాయొక్క విచారమును తెలియజేస్తున్నామని ఈసభవారికి గట్టిగా మరలనొక్క వక్కాణించిచెబుతున్నాను ఇంతవరకు ఆంధ్రులందరు కేవలము ఎక్కువ ఆవేశపరులనే మాటవుండేది ఆంధ్రులలోనొకరు తనఆత్మను బలిదానముచేసి ఆంధ్రరాష్ట్రము సంపాదించుకున్నతరువాత, దానియొక్క అందచందాలు అన్ని విధములా తీర్చుకోటానికి అవస్థపడుతూ ఆదర్శపరులై, ఆదర్శప్రాయముగా చేసుకొనుటకు ఆతురతతోవున్నాము. ఆంధ్రులఆవేశము ఎంతటిదో, చరిత్రాత్మకమైయున్నది. అదిఎంతటిదో తెలుసుకోటానికి వేరేప్రయత్నించనక్కరలేదు, అందరకు తెలిసిన విషయమే. ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రము కావాలనికోరడమే కాకుండా, ఎంతో అలజడికి కారణభూతులు అయినప్పటికినీ, ఎంతో శాంతియుతముగా రాష్ట్రాన్ని సాధించగలిగారు. ఆదేవిధంగా విశాలాంధ్రకోరుతూ శాంతిపరులై కేంద్రప్రభుత్వమువారి ఆర్డరుకు వేచియున్నారు. ఇతరరాష్ట్రములలో చేర్చబడినటువంటి వాటివిషయములుగాని, వున్నవాటిని విడదీయమనికోరుతున్నవాటి విషయములోగాని, ఆంధ్రులు ఆదర్శప్రాయముగా, శాంతియుతముగా కోరుతున్నారేగాని, అలజడికి, అల్లరికి ఆందోళనకు తావుఇచ్చుటలేదు. కాని, ఆంధ్రులు ఆవేశపరులుకాదని అనుకోనక్కరలేదు. ఆంధ్రులయొక్క ఆవేశము ఎంతటిదో యిదివరకే కేంద్రప్రభుత్వానికి తెలిసియున్నది. ఆంధ్రులు అందరు యిదిసక్రమముగా సాధించుకోవాలనే సంకల్పించియున్నారు. ఇంతవరకు ఎంత ఓపికపట్టియున్నారో కేంద్రప్రభుత్వమువారే ఆలోచించుకోవలసియున్నది. కాని వారు ఆంధ్రులుచేతకానివారు అని తలంచుచున్నట్లుగా తెలుస్తున్నది.

వీరు ఆవేశపరులు అవునో కాదో, చూడనక్కరలేదు. సమయమువచ్చినప్పుడు వెనుదీయరు. ఆంధ్రులు యితరులకంటే ఎక్కువ ఆవేశపరులు. ఎంతటికైనా సాహసించగలరు. ఇది కేంద్రప్రభుత్వమువారికి తెలియజేయండి అని యీ సభవారిని కోరుతున్నాను. ఆంధ్రులు విశాలాంధ్రనిర్మాణము విషయములో యింతవరకు ఆలస్యము జరుగుతున్నప్పటికినీ, యింకను కేంద్రప్రభుత్వమువారు ఏరోజు కారోజు యిస్తారన్న ఆశతో, ఎంతో ఓపికతో ఉండడమువల్ల, శాంతిపరులై వుండడమువల్లనే దేశవ్యవహారములు సక్రముగా సాగిపోతున్నవని కేంద్రప్రభుత్వమువారికి హెచ్చరిక చేస్తున్నాను. ఆంధ్రులు ఎంతో పట్టుదలతో. కంకణముకట్టుకొని, ఆంధ్రరాష్ట్రము సాధించుకున్నట్లు, విశాలాంధ్ర కూడా సాధించుటకు పూనుకొనియున్నారు. శాంతియుతముగా యింతవరకు వుండడము, వారియొక్క చేత కానితనము కాదు. హైదరాబాదులో ఎవరో కొంతమంది అల్ప సంఖ్యాకులు ఆంధ్రులు మాకుఅక్కరలేదని అంటున్నారు కాని ఆంధ్రులకు వుత్సాహము లేదు, ఉద్రేకము లేదు అది వారిచేత కానితనము అనే భావము దేశములో వ్యాపింపచేయబడుతున్నది. దీనియొక్క నిజానిజములు తెలుసుకోవచ్చును. వారికి ఉత్సాహము వున్నదో లేదో, ఉద్రేకము వున్నదో లేదో చూడాలంటే. చూడండి. ఒకసారి తడాఖాచూపిస్తారు. విశాంధ్రరాకుండాపోతే, అదియేదో బయటపడుతుందని గట్టిగానమ్మండి. ఆవిధంగా ఆవేశపడడము మంచిది కాదనే వుద్దేశ్యముతోనున్నారు. కాని యీ సమయములో అదిఅంతయు చూపవలసినపని లేదు. ఇదిసమయము కాదు, న్యాయము కాదనే వూరకున్నారు. ధర్మముకూడా కాదు. ఆంధ్రులమైన మనము యిన్నిచోట్లలో యిన్నిసార్లుగా బహిరంగసభలలోనూ, యిక్కడ శాసనసభలోనూ విశాలాంధ్ర నిర్మాణముకొరకు తీర్మానాలుచేస్తున్నప్పటికినీ, యింతమటుకు ఢిల్లీ ప్రభుత్వమువారు దాని నిర్మాణమునుగురించి ప్రకటించకపోవటము చాలా విచారకరముగావున్నది. దీనివిషయములో వారికి సంశయముఎందువల్ల కలుగుతున్నదో! ఆంధ్రులలో చాలా విచారము కలిగించుచున్నది. ఆనాడు హైదరాబాదును భారతదేశములో కలిపివేయటానికి సిద్ధపడిన పటేలు, అంతటిదిట్టమైన మనుజుడు యీనాడు దేశములో లేకపోయినాడు అనేది చాలా విచారముగావున్నది. అటువంటివారు ఆంధ్రదేశములో లేరా; ఆంధ్రరాష్ట్రము ఏమైనా గొడ్డుపోయిందా? అనే అనుమానాలకు కారణము యేమని ఢిల్లీప్రభుత్వాన్ని అడుగుచున్నాము. ఎందుకు జాగుచేయవలసివచ్చిందో చెప్పండి? హైదరాబాదువారి సంస్కృతివేరు, ఆంధ్రులయొక్క సంస్కృతివేరు అని ఒకమిష లేవదీశారు. ఇది సరియైన భావము కాదు. ఆంధ్రులు ఎక్కడవున్నప్పటికినీ, వారియొక్క సంస్కృతిఅంతయు ఒక్కటే ఒక్కసారి ఆంధ్రులయొక్క చరిత్ర యేమిటో చూచుకొనండి. ఆనాడు హైదరాబాదువారే 'ఢిల్లీసుల్తాన్‌ను పట్టుకుపోతాన్' అని చెప్పి, పట్టుకొనివచ్చి స్థాపించుకున్న వరంగల్ సంస్థానముఎవరిదో గుర్తించండి. ఆంధ్రులకు విచారము కాదు, కలిగించవలసింది. ఆంధ్రులకు ఒకసారి విచారము కలుగజేస్తే, ఢిల్లీకివెళ్లి సుల్తానునుపట్టుకొనివచ్చి విశాలాంధ్రను స్థాపించుకున్నదాకా పట్టుదలవిడవరు, చివరకు సాధించుతారు, సాధించుతారు, అని నమ్మండి. అంతట

ఆవేశపరులుఅవుతారు ఆంధ్రులు, అని యీసభవారిద్వారా గట్టిగా హెచ్చరిక చేస్తున్నాను

ఢిల్లీకి వెళ్ళి మా హైదరాబాదురాష్ట్రాన్ని మేము తీసుకొనివస్తాము. దానిని హైదరాబాదు రాష్ట్రముఅన్నా మాకు ఇబ్బందిలేదు. ఏమైనా అనండి. ఆంధ్రరాష్ట్ర చరిత్రచూస్తే సర్కారుప్రాంతాలు, రాయలసీమప్రాంతాలుఅన్నీకూడా ఒకానొక నాడు హైదరాబాదు రాష్ట్రములో ఉన్నటువంటివే. బ్రిటిషువారికుట్రలవల్ల, వారు జేసిన కర్నాటక యుద్ధాలవల్ల, ఆ యుద్ధాలలో వారు ఎలుకమీద పిల్లిని, పిల్లిమీద ఎలుకనుపెట్టి సంపాదించుకున్నారు కొన్ని ప్రాంతాలను. హైదరాబాదురాష్ట్రము అన్నా మేము ఒప్పుకుంటాము. ఆంధ్రులను ఏకముచెయ్యండి. ఆంధ్రులందరు ఏకం అని చెప్పండి. అట్లా పిలవకపోతే దేశములో ఎక్కువ అలజడి జరుగుతుంది మీరు సంశయంవిడిచిపెట్టి దీని విచారణ సరిగాచేసి వెంటనే మాకు విశాలాంధ్రను ఇవ్వండి. అని మేము ప్రార్థన చేస్తున్నాము అంతకంటే ఎక్కువగా బళ్ళారి ప్రాంతాన్నిగురించి చెప్పాలి. ఇది వారు కర్నాటకులదిఅంటున్నారు. కాని సహజీవనము, సహధర్మము అందరికి చెపుతూ, ప్రపంచానికి చాటుతూఉండేవారు ఢిల్లీ ప్రభుత్వం. వారు 20 లక్షలమంది తెలుగువారిని కర్నాటకరాష్ట్రంలోఉంచి 20 వేలమంది కన్నడిగులను ఆంధ్రరాష్ట్రమునకు ఇవ్వడానికి మేము నోచుకోలేదో. మేము ఎక్కడైనా సహజీవనానికి అడ్డుతగిలినవారమా? 20 లక్షల ఆంధ్రులు నివశిస్తున్న తెలుగుప్రాంతాన్ని కన్నడ రాష్ట్రంలో ఉంచుకోవాలని తాపత్రయపడుతూ, 20 వేలమంది కన్నడిగులు ఆంధ్రరాష్ట్రంలో ఉండాలంటే మైసూరువారు గిజగిజలాడుతున్నారు. ఆంధ్రులు ఆదర్శప్రాయముగాఉన్న కారణంచేత అది వారి చేతకానితనం అని భావించడం సబబు కాదు. ఇందువల్ల ఆంధ్రదేశంలో ఆందోళన కలుగుతున్నదని చెపుతున్నాము. కర్నాటకులకు చరిత్ర తెలియకపోవచ్చును. వియజనగరరాజ్యం, కర్నాటకరాజ్యం అని వారు అంటారు. విజయనగరరాజ్యం కర్నాటకరాజ్యం కాదు. ఇద్దరు తెలుగువారు. ఇద్దరు కర్నాటకులు రాజ్యపరిపాలన చేసినారు. అది ఎప్పుడుకూడా విజయనగరరాజ్యంగా పిలువబడలేదు. ఆంధ్రకర్నాటక సామ్రాజ్యాధీశులు అన్నారు వారినందరిని. కనుక ఆంధ్ర కర్నాటకాధీశులు ఉన్న బళ్ళారి ప్రాంతము యావత్తు మనది. బళ్ళారిలో ఉండేటటువంటి తుంగభద్రానదీతోయాలు త్రాగిన తరువాతనే తెలుగుభాషకు ఒక తియ్యదనం వచ్చింది. దేశంలో ఎక్కడచూచినా తెలుగుభాషకు, సంస్కృతికి, తెలుగుతనానికి తియ్యదనమే కాకుండా, జగత్ విఖ్యాతమైన కీర్తి ప్రతిష్ఠలు వచ్చినవి విజయనగరరాజులు పరిపాలిస్తున్నప్పుడే. కనుక బళ్ళారి కర్నాటక ప్రాంతమని చెప్పడానికి వీలులేదు. బళ్ళారిని కర్ణాటక ప్రాంతంలో చేర్చడంవల్ల మేము అలజడి పడుతున్నాము. ఎవరు అడిగితే మదకసిరాప్రాంతం కర్ణాటకరాష్ట్రానికి ఇచ్చారు? ఏమి ఇది ? ఎవరిని అడిగి మీరుచేసినారు? ఎందుకుచేసినారని మన తరఫున మంత్రులు కేంద్రప్రభుత్వాన్ని అడిగినారు. మైసూరురాష్ట్రంలోకి బళ్ళారి వెళ్ళిపోయింది. ఇది ఆంధ్రుల

హైదరాబాదువిషయంలో మనము చాలా ఆందోళన చేస్తున్నాం, హైదరాబాదు మాది అని చెబుతున్నాం. అది మా మాతృస్థానం. ఆంధ్రులకు జన్మభూమి. హైదరాబాదులో ఉండే శ్రీ రామచంద్రమూర్తి మావాడు. కాబట్టి మాది ఇది నీవు కాదు అనడానికి అధికారంలేదు అంటున్నాము. అయితే ఒక్కటేచిక్కు. ఈ దినం కొంతమంది చెబుతున్నారు! హైదరాబాదు నవాబు బెదిరిస్తున్నాడట' "నే ఫకీరు కావలసినదేనా అని అడుగుతున్నాడట!" ఫకీరు కాకపోతే ఏమైనా కానీయండి. హైదరాబాదునవాబు అక్కడే ఉండవచ్చును. మాకు అభ్యంతరంలేదు. హైదరాబాదునవాబు రామభద్రునకు, సీతమ్మవారల తలంబ్రాలకు ముత్యాలు ఈనాటికి ఇస్తున్నాడు. అతను అక్కడ చల్లగా, సౌఖ్యంగా, సౌభాగ్యంగా ఉండనీ మా అభ్యంతరం ఏమీలేదు. కాని మా రాజ్యం, మాది. మేము దానిలోవుండి సర్వతోముఖాభివృద్ధి పొందవలసి ఉన్నది. ఆంధ్రులు ఆవేశపరులు. అయినా అనుభవంతో, ఆదర్శప్రాయంగా మెలగగలరు అనే అభిప్రాయాన్ని పెద్దలకు కలుగజేయుటక్కే ఇంతవరకు శాంతంగా ఉన్నాము. మమ్ములను రెచ్చగొట్టవద్దని కేంద్రప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. మీరు శాంతంగా ఉండండి అంటే ఎలాగ? శాంతానికి మితి, హద్దు ఉన్నది. కనుక వెంటనే సమగ్రమైన విశాలాంధ్ర మాకు యివ్వండి. అని వారికి మనవి చేస్తున్నాను. విశాలాంధ్రను ఢిల్లీప్రభుత్వమువారు వెంటనే ఏర్పరచాలి. ఆంధ్రులు సర్వవిధములా, సర్వతోముఖాభివృద్ధి పొందడానికి, ఆంధ్రచరిత్రను, సంస్కృతిని ఆంధ్రులయొక్క గౌరవాన్ని ఆంధ్రుల ప్రతిష్ఠను నిలపడానికి ఢిల్లీ ప్రభుత్వంవారు సంశయాత్ములు కాకుండా ధైర్యముతో, సాహసముతో, దీక్షతో, జాగ్రత్తగా ఆలోచించి విశాలాంధ్ర ఇస్తారని చెప్పి ప్రార్థన చేస్తూ ఈ తీర్మానం వెంటనే వారికి పంపించవలెనని మంత్రివర్గాన్ని కోరుతున్నాను.

Sri G. YELLAMANDA REDDI :—

అధ్యక్షా, ఇక్కడ ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ఉపముఖ్యమంత్రిగారు ఇది చరిత్రాత్మకమైన విషయముఅని చెప్పారు. నిజముగా ఈరోజు, మొదటిసారిగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలనిచెప్పి సంపాదించుకున్న మనకు, భారత దేశములో భాషా ప్రయుక్త రాష్ట్రాలనుగురించి కేంద్రప్రభుత్వం ఇన్నివిషయాలు చెప్పినప్పటికీ మన విశాలాంధ్ర విషయము ప్రకటించకపోవడము చాలా విచారకరమైన విషయము అనడానికి సందేహములేదు. అసలు ఈ విశాలాంధ్ర విషయములో ఏమాత్రం ప్రకారం చూసినా వెంటనే తీర్పు ఇవ్వవలసినది. ఎందువల్ల ఈవిధముగా ఆలస్యంచేస్తున్నారో ఏమాత్రం అర్థం కాకుండాఉన్నది. ఒకవైపు విశాలాంధ్ర ఇవ్వతగినదిఅని, విశాలాంధ్ర అభివృద్ధి అవుతుందని చెపుతూ ఇంకో వైపున ఎవరో కొంతమంది ప్రత్యేక తెలుగు రాష్ట్రము కావాలని అన్నారని ఏనిర్ణయమూ లేకుండా దీనిని నానపెట్టడంవల్ల దేశంలో ఒక విధమైన అశాంతి ఏర్పడడానికి అవకాశం కలుగుతున్నది.

ఈరోజున విశాలాంధ్ర మనకు తప్పకుండా వస్తుందని నూటికి నూరుపాళ్లు నమ్మకున్నప్పటికీకూడా దేశంలోవున్న పరిస్థితుల దృష్ట్యా చాలా అనుమానాలు కలగడానికి అవకాశం ఉన్నది. అన్నిరాష్ట్రాలనుగురించి కేంద్రప్రభుత్వ నిర్ణయాలు ప్రకటించి మనరాష్ట్ర విషయం ప్రకటించకపోవడం, రెండోవైపున డాక్టరు చెన్నారెడ్డి మొదలైనవారు యింకా కేంద్రప్రభుత్వం నిర్ణయంచేయలేదని, అట్లాచేసేటప్పుడు ప్రజాభిప్రాయం చూస్తారు కాబట్టి దేశంలో అల్లరులుచేయండి అని statement యివ్వడం దానికి అనుగుణంగా తెలంగాణావాదులు దౌర్జన్యం సాగించడం, ప్రజాభిప్రాయంవ్యక్తం కాకుండా ఆందోళన కలుగజేయడంజరుగుతున్నది. Secunderabadలో విశాలాంధ్ర మహాసభ సమావేశాన్ని చెడగొట్టాలని అల్లరిచేసి ప్రజాభిప్రాయం వ్యక్తీకరించకుండా ఆటంకంచేసినట్లు ఉపముఖ్యమంత్రిగారు శలవిచ్చారు. ఆంధ్రదేశంలో, తెలంగాణాలో విశాలాంధ్ర కావాలనిచెప్పి ముక్కోటి ఆంధ్రులలో అత్యధిక సంఖ్యాకులు అయిన ప్రజానీకం కోరుతున్నారు. విశాలాంధ్ర వచ్చినట్లయితే దేశం ఏరకంగా ముందుకుపోతుందో ఆవిషయం తడవతడవకు చెప్పవలసిన అవసరంలేదు. రాష్ట్రపునర్వ్యవస్థీకరణ నిర్ణయాలు భాషాప్రయుక్త సూత్రంమీద ఆధారపడి జరుగకపోవడంమూలాన అక్కడక్కడ జరిగిన అల్లరుల ఆధారంగాచేయుమని కేంద్రప్రభుత్వం, 50 సంవత్సరాలనుంచి కాంగ్రెసుపార్టీ దేశం భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభాగం అయినప్పుడే దేశం పటిష్ఠంగా వుంటుందన్న ప్రచారంచేసిన సిద్ధాంతానికి తిలోదకాలిచ్చి, బహుభాషారాష్ట్ర సూత్రం లేవదీసినప్పుడు భాషాప్రయుక్తరాష్ట్రం కావాలన్నవారికి సందేహాలు, అనుమానాలు కలగడానికి సంపూర్ణమైన అవకాశాలు ఏర్పడుతున్నాయి. సూత్రప్రాయంగా యీ విషయాన్ని పరిష్కరించడానికి ఎప్పుడైతే కేంద్రప్రభుత్వం గాని లేక దానికి సంబంధించిన పెద్దలుగాని విఫలులైనారో అప్పుడు దాని విషమఫలితాన్ని అర్థంచేసుకొని సక్రమమైన పరిష్కారంచేసి దేశంలోని జాతుల మధ్య వైషమ్యాలు లేకుండా వుండడానికి వీలుగా వున్న దానిని గమనించకుండా దానికి ఏదో ఒక Electric shock, ఏదో యిలాంటి trickలు ద్వారా దేశంలో ఉద్యమాన్ని గాని ప్రజాభిప్రాయాన్ని అణచుదాం, పెడమార్గాన పెడతాం అని అనుకోవడం చాలా విచారకరమైన విషయం. స్వతంత్రపోరాటంలో భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ పోరాటంకూడా ఒక భాగంగా పెనవేసుకొని ఉంది. ఈనాడు ఈ సిద్ధాంతాన్ని త్రోసిరాజనడం న్యాయం కాదు ఇప్పుడు ద్విభాషా, త్రిభాషా రాష్ట్రాలు ఏర్పాటుచేయాలని చెప్పడం చాలా విచారకరమైన విషయం. బెంగాలు విషయంలో ఒక జిల్లా సమస్య పరిష్కారం చేసుకోడం చేతకానటువంటి పరిస్థితి వున్నప్పుడు Bengal, Bihar లలోని యిద్దరు ముఖ్యమంత్రులు, మేమందరం కలిసివుంటాం అని statement యివ్వడం, ప్రజల అభిప్రాయం తీసుకోకుండా సమైక్యం చేస్తాంఅని చెప్పడం సాహసం. ఏరకంగా సఖ్యంచేయగలరో దురూహ్యంగా వున్నది. ముక్కోటి ఆంధ్రుల విశాలాంధ్ర కోర్కెను కాదని, భాషాప్రయుక్త సూత్రాన్ని కాదని బహుభాషా

రాష్ట్రాలను ఏర్పర్చడం, యీ రకంగా ఆలోచించడం చరిత్రను వెనక్కు త్రిప్పడానికి జరిగే ప్రయత్నం చేసినట్లవుతుంది. అరకంగా సమైక్యమైనటువంటి, పటిష్ఠమైనటువంటి బహుభాషా రాష్ట్రాలు ఏర్పాటుచేయడం సాధ్యం కాదని యీ రోజున దేశంలో జరుగుతున్నటువంటి ఘటనలన్నీ నిరూపణచేస్తాయి. బొంబాయి నగరానికి సంబంధించిన సమస్యను పరిష్కరించడానికి విఫలులై పోయి, దేశంలో ఒక విషమైన ఆందోళన, అల్లరులు చెలరేగినపుడు వాటికెవరో బాధ్యులని ప్రకటించడానికి సాహసించడం చాలా విచారకరమైన విషయం. దేశంలో సమస్యలు పరిష్కరించకపోతే ఎలాంటి దౌర్జన్యాలు జరుగుతాయో అర్థంచేసుకున్నప్పుడు నిజంగా విశాలాంధ్ర విషయంలో యింత జాప్యం జరిగివుండేదికాదు. ఇవ్వాళ విశాలాంధ్ర విషయంలో యెంత ఆందోళన జరుగుతున్నదో ఉపముఖ్యమంత్రిగారు శెలవిచ్చారు. కొందరు లారీలు తీసుకొని హైదరాబాదు బజార్లో చేసిన దౌర్జన్యాలు చూచినప్పుడు దేశంలో శాంతి భద్రతలు వుండటానికి ఏరకంగా అవకాశంవుంటుందో ఆలోచించమని మనవిచేస్తున్నాను.

విశాలాంధ్ర విషయంలో యిప్పటికే చాలా ఆలశ్యం జరిగింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత వచ్చిన లాభాలు ఏమిటో ఆంధ్రజాతికి కొంతవరకయినా చవిచూడడానికి అవకాశం లభించింది. ఇలాంటి పరిస్థితులలో మళ్ళా వెనక్కు వెళ్ళికలిసిపోతాం అని చెప్పడం మూలంగా సమస్యాపరిష్కారం కాదు. కాబట్టి వెంటనే విశాలాంధ్ర ఏర్పాటుచేయాలని కోరుతున్నాను. ఈసందర్భంలో S. K. Patil పిలువని పేరంటంగా హైదరాబాదు వచ్చారు. బొంబాయి రాష్ట్రంలో ఆయనసంగతి ఆయన పరిష్కారం చేసుకోలేకపోయాడు. "కాని తెలుగుభాష వేరు, తెలంగాణావేరు. ఆ భారతంవేరు, ఈ రామాయణంవేరు" అంటూ, ఆంధ్ర ప్రభలో కార్టూను వేసినట్టు, తనయొక్క ప్రజ్ఞ ఉపయోగించి ఒక పరాయివాడు చీలదీయ ప్రయత్నించడం చాలా విచారకరమైన విషయము ఈ రకంగా సమస్య పరిష్కారం కాదు. ఇదేసందర్భంలో డాక్టరు చెన్నా రెడ్డిగారు ఒక memorandum యిచ్చినట్లు Paper లో వచ్చింది. అందరంకూడా అక్కడే వుండి ఒక్కే High Court ఒక్కే Governor వుండాలనడం మూలంగా తెలంగాణా, ఆంధ్రదేశాలలో అందరికి ఐక్యత ఏర్పడదు. తెలంగాణా ప్రజల హక్కులు, ముస్లిం సంస్కృతి, విజ్ఞానం సక్రమమైన పద్ధతిలో రక్షించి అభివృద్ధి కావడానికి ఆంధ్రఅసెంబ్లీ హామీ యిచ్చింది. మంత్రివర్గం ప్రత్యేకరక్షణయిస్తాం అని హామీ యిచ్చినాకూడా యింకా నచ్చచెప్పలేక పోవడం విచారకరం. ఉపముఖ్యమంత్రిగారు చెబుతూ మనం నచ్చచెప్పడంలో లోపమో వారు అర్థంచేసుకోవడంలో లోపమో అర్థంకావడంలేదన్నారు. లోపం ఎక్కడాలేదు. బుద్ధిలోపమే అర్థంచేసుకోకూడదని అనుకున్న మనిషికి అర్థం కావాలని నచ్చచెప్ప ప్రయత్నించడంవృథా. స్వతస్సిద్ధంగా 'వద్దు' అనే పట్టుదలతో వాదిస్తున్నారు. ఐక్యంకావడానికి సంపూర్ణ అవకాశంవున్నది. ఆలోచించమని కోరుతున్నాను. ఇదే సందర్భంలో వారె అసెంబ్లీ నిర్ణయం చేసినపుడు అది నిర్ణయం కాదన్నారు. ఇది మరీ విడ్డూరమైన సంగతి, విస్సన్న చెప్పిందే వేదమని, "నేను గెలిస్తే నే

Sri G Yellamanda Reddi] [1st February 1956

ప్రజాభిప్రాయం, ఇతరులు గెలిస్తే ప్రజాభిప్రాయంకాదని'' చెప్పడం సాహసమైనది. చాలా దుర్మార్గమైనదని ఖచ్చితంగా చెప్పదలచుకున్నాను. తెలంగాణా సభ్యులలో 80% విశాలాంధ్ర కావాలని కోరుతున్నప్పుడు కనీసం ఏ ప్రజాస్వామిక సూత్రాల గురించి మాట్లాడుకున్నారో వాటి ప్రకారం యిష్టంలేకపోయినా ఆ ప్రజాస్వామిక సూత్రాలను ఆమోదించాలని ఒప్పుకోవాలి. కేంద్ర ప్రభుత్వం యివన్నీ ఆలోచించి విశాలాంధ్ర ఏర్పరచాలని కోరుతూ, ఆ విధంగా విశాలాంధ్ర ఏర్పరచకపోతే జరిగే దుర్ఘటనలకు ఏ పార్టీవారు బాధ్యత వహించరనీ, కేంద్ర ప్రభుత్వమే బాధ్యతవహించ వలసివస్తుందని సూచిస్తూ విరమించు కొంటున్నాను.

Mr. Dy. SPEKER మాట్లాడవలసిన సభ్యులు చాలమందివున్నారు. ఇంక అరిగంటసేపు మాత్రమే చర్చకు అవకాశంవున్నది. విషయం సంక్షిప్తంగా ముగించమని ప్రార్థిస్తున్నాను.

Srimathi Ch. AMMANNA RAJA:—

అధ్యక్షా, ఈ విశాలాంధ్రవిషయమై మన మనస్సులన్నీకూడా ఎన్నాళ్లనుంచో ఆందోళనపడుతున్నవి. ఏరోజుకారోజు ఏదోఒక నిర్ణయం తెలుస్తుందని ఎప్పటికప్పుడు ఎదురుచూస్తున్నాం. నేనుకూడా కొంతమంది హైదరాబాదు స్త్రీలు వ్యతిరేకం అనుకున్నప్పుడు వారికి పత్రికలద్వారా వ్రాద్దామని అనుకుంటూకూడా యివ్వాళో రేపో నిర్ణయంవస్తుందని ఎప్పటికప్పుడు ఊరుకుంటూ వచ్చాను. ఎప్పటికప్పుడు వస్తుందని అనుకున్నాం. మళ్లా యీ వేళకూడా 11, 12 తేదీలవరకు రాదని వినడంలో చాలా విచారం కలిగింది. ఒకవేళ అన్ని రాష్ట్రాల విషయంలో ఏదో నిర్ణయాలు ఒక్కరోజున వెలిబుచ్చినట్లయితే ఇంతకష్టం వుండదేమో. బొంబాయి రాష్ట్ర విషయం ముందు తేల్చారు. అక్కడ ఆందోళన జరిగింది. దానివల్ల కొంతభయంకలిగి మిగతానిర్ణయాలను వెనక్కు పెడుతూ వచ్చినట్లు కనపడుతూంది. అక్కడ అసెంబ్లీ యిక్కడ అసెంబ్లీ అక్కడప్రజలు, ఇక్కడప్రజలు అక్కడమంత్రులు ఇక్కడమంత్రులు అందరి అభిప్రాయాలు తెలుసుకున్నతరువాత High Power Committee కూర్చున్న తరువాత విషయాలన్నీ తెలుసుకుని ఒక్కేసారి నిర్ణయం చేయడమైతే న్యాయంగావుంటుంది. కాని అలాజరుగలేదు. అసలు భాషాప్రయుక్తరాష్ట్రాలు కావాలని చాలాకాలంగా ఆందోళన చేస్తున్నది ఆంధ్రులు.

ఆ సిద్ధాంతాన్ని ఒప్పుకొన్నామని చెప్పుతూకూడా ఏరోజుకు ఆరోజు ఎవరు మాట్లాడినకూడా అన్నివిషయాలు వస్తున్నాయి కాని విశాలాంధ్రవిషయం రాకపోయే టప్పటికి దేశంలో పెద్ద గగ్గోలుగాఉన్నది, నెహ్రూగారు ఏమీ మాట్లాడుటలేదు. విశాలాంధ్ర విషయముతప్ప అన్నివిషయాలు మాట్లాడారు. కారణమేమిటీ? పసిబిడ్డలతో సహా 'మనకు విశాలాంధ్రరాదా' అని అడుగుతూవుంటే ఏమి జవాబుచెప్పాలో తెలియడంలేదు, ఏవిషయంలోనైనాసరే సరిగా అర్థముచేసుకొని అందరు ఏకగ్రీవ

ముగా వుండరు. మన అదృష్టవశాత్తు మన ఆంధ్ర రాష్ట్రంలో మాత్రము ఎటువంటి వ్యతిరేకము లేకుండా అందరము ఏకగ్రీవముగా విశాలాంధ్ర కావాలనే తీర్మానమును pass చేశాము. ప్రతిచోట సభలుజరిగాయి, ప్రతిచోట తీర్మానాలు pass అయినాయి. కాని తెలంగాణా వారిలో మన దురదృష్టవశాత్తు కొంతమంది వ్యతిరేకముగావున్నారు. ఆ వ్యతిరేకము వుంటేవుంటుంది. ప్రతిచోటవుంటుంది. కాబట్టి న్యాయమన్న విషయము, ఎక్కువమందికి అంగీకారమైన విషయముగురించి, నిర్ణయించవలసిన పెద్దలు అందరు ఆలోచించాలి. దీనికై ఎర్పాటుచేయబడిన ఆకమిటీవారు యీపాటికే నిర్ణయముచేసి వుండవలసినది. ఎంతఆలస్యమైతే అన్నిఅడ్డంకులు కల్గుతూనే వుంటాయి, మహారాష్ట్రులు హైదరాబాదు విచ్ఛిన్నము అయినతరువాత మా సోదర మహారాష్ట్రులతో చేరుకోడానికి మాకు ఎంతో సంతోషమని ప్రకటనచేశారు. ఎటువంటి వ్యతిరేకము లేకుండా వారితో కలసిపోవడానికి వారు నిర్ణయము చేసికొన్నారు. ఆ విధముగానే కన్నడీగులు ఇతర కన్నడీగులతో చేరుకోడానికి యిష్టపడ్డారు. కాని కొందఱు ప్రత్యేక తెలంగాణా కావాలంటున్నారు. అది మన దురదృష్టమనుకోవాలి. ఇదేమిటి. ఇదొక దురాక్రమణమా? ఒకరిపై నొకరు dominate చేసే ఉద్దేశమా? లేకపోతే ఎవరిపైనను అన్యాయముచేసే వుద్దేశమా? మనమందరమూ తెలుగువాండ్లమే. ఒకప్పుడు అందరమూకలిసి వున్నాము. తర్వాత విడిపోయినాము. మళ్ళీ కలసిపోదాము. ఏ ఒక్కకుటుంబములో చూచినాకూడా బంధువులు హైదరాబాదులో వుంటూనేవున్నారు. అటువంటపుడు మన అందరికికూడా common interests వున్నాయి. భాష ఒక్కటే. ప్రాజెక్టులు ఒక్కటే. ఏదిచూచినా ఒక్కటే. భద్రాచలము మనది. వాండ్లచేతులలో కొంత మన చేతులలో కొంత అధికారము వుంటూవచ్చినది. ఇటువంటి సందిగ్ధావస్థ లేకుండా ఏకమై పోదాము. తెలుగువాండ్లంతా ఒక కుటుంబముగా వుందాము. ఎక్కడైనా ఏమైనా లోపాలు, కష్టాలు వుండినా అందరముకలసి పరిష్కారము చేసుకుందాము. ప్రతిచోటకూడా ఆంధ్రులకు కష్టపడకుండాఏ ఉపకారమైనా జరిగిందా అంటే ఏమీ లేదు. కష్టపడినాము, రాష్ట్రం సంపాదించుకొన్నాము. ఆ విధముగానే యిదికూడా వస్తుంది. కాకపోతే కొంచెము ఆలస్యము జరుగవచ్చును. దీనివల్ల ప్రమాదమేమీ రాకూడదు. వారూమనమూకూడా న్యాయంగా ఆలోచించి ఏనిర్ణయము తీసికొన్నప్పటికికూడా అందరి అంగీకారముతో చేస్తామనే నా ఉద్దేశము. అది వేరేవిధముగా జరుగడానికి వీలులేదు. జరుగదు. దానిలో నాకు దృఢ విశ్వాసము వున్నది. కాకపోతే ఓపికపట్టలేకుండా వున్నవాండ్లకు ఒపికపట్టుకోమని చెప్పడము కష్టముగావున్నది. పురుషులు శాంతముగా వుండాలని నేను చెప్పుతున్నాను. మేము జాగ్రత్తగావున్నాము. ఎక్కడ అల్లరులు చేస్తారో, ఎక్కడ అల్లరులు చెలరేగుతాయో అనే భయము తప్ప మరొక అనుమానంలేదు. దైవకృపచే invoke చేసి విశాలాంధ్ర తెప్పించగలుగుతాము. రేపు విశాలాంధ్రవస్తే మావల్లనే వచ్చిందనినమ్మకోండి. కాబట్టి స్త్రీలకు నేను ఒక ప్రత్యేక మనవిచేస్తున్నాను. అక్కడ స్త్రీలు కొందరు వ్యతిరేకముగా వుంటున్నా

రని వింటున్నాను. దీనికికూడా స్త్రీలే ముందడుగువేస్తున్నారు. వారు పురుషులకు మంచి సలహాలిచ్చి విశాలాంధ్రకు వ్యతిరేకతను తొలగించుటకు కృషి చేయవలెనని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. వారు చక్కటి సలహాలిచ్చి పురుషులకు నచ్చజెప్పితే మన మందరమూ ఏకమై చక్కని సుస్థిరమైన రాష్ట్రమును స్థాపించుకోవచ్చును. ద్విభాషా రాష్ట్రాలుంటే చాలమంచిదన్నారు కొంతమంది, కావచ్చును. బీహారు, బెంగాలుకు, హిందీ భాష common గా వుండవచ్చును. కొంచెము భాషలో తేడావున్నప్పటికి కూడా ద్విభాషారాష్ట్రాలనే ఒప్పుకొన్నప్పుడు ఒకేభాష మాట్లాడే రెండు రాష్ట్రాలను కలుప డానికి ఎటువంటి కష్టమువుండేదికాదు. విశాలాంధ్ర అంటే తెలంగాణాలో అల్లరులు బయిలుదేరుతాయేమో, తెలంగాణా అంటే ఆంధ్రలో అల్లర్లు బయల్దేరుతాయేమో అనే భయమువుండడెములో తప్పులేదు, వుండవచ్చును. కాని ఎప్పుడైనాసరే ఒక నిర్ణయానికి రావలసి యున్నది. అది త్వరగా జరిగితేమంచిది కాని విలంబనము ఐనట్లయితే చాలకష్టము. కాబట్టి యీనాడు మనము హైదరాబాద్‌కువెళ్లి అక్కడ యీకార్యక్రమము ప్రారంభించాలి. అది తెలియకుండానే ఇటువంటి సందిగ్ధపరిస్థితులలో పెట్టవద్దని పైవారిని తెలంగాణావారినికూడా ప్రార్థిస్తున్నాను. విశాలాంధ్రను వెంటనే నిర్మించమని కోరుతూ యీ సభవారు ఆందోళన తెలియపరుస్తున్నారు. మనము ఆంధ్రులము, ఆవేశపరులము. ఆవేశాలకు తావువుండదని నేను మా స్త్రీల తరఫున హామియిస్తూ ఆ విధంగా జరుగాలని కోరుతూ ఇంతటితో నా ప్రసంగము ముగిస్తున్నాను.

Sri G. JAGANNATHA RAJU :—

అధ్యక్షా, ఈ తీర్మానాన్ని బలపరుస్తూ రెండు మూడు అంశములు తమతో మనవిచేయవలసియున్నది. విశాలాంధ్ర విషయమై ఢిల్లీలోవున్న మన పెద్దల చర్య ఆశ్చర్యము కలుగజేస్తున్నది. ఇంగ్లీషులో దానిని 'Strange' అంటారు. తెలంగాణా వారు కోరింది ఒక్కటే. ప్రజలు హెచ్చుమంది ఏమికోరితే అది చేయవలసియున్నదని దానిని గురించి వారు చాలా press చేశారు. కొసకు దానిని గురించి మన పెద్దలు అభయమిచ్చారు. ఇచ్చినతర్వాత యీ సమస్య Legislative Assembly లో discussion కు వచ్చినపుడు 110 మంది మాట్లాడినతర్వాత sudden గా ఏకారణం చేతనో votes తీసుకోవద్దని orders వచ్చాయి. దీనికి కారణమేమో strange కాదా? చాలామంది విశాలాంధ్రకు అనుకూలంగా మాట్లాడిన తర్వాత ఓటు తీసుకోవద్దని అక్కడినుంచి orders రావడము అనేది మంచిపనికాదు, ఎందుకు అలాగు పంపాలో ఇప్పటికికూడా మనకు బోధపడకుండా వుంది. భారత దేశమును పరిపాలనచేస్తున్న నెహ్రూగారు stern dissiplination గా వుండాలని మనము expect చేశాము కదా. అటువంటి violance తో కూడిన agitation తెలంగాణాలో start అవుతుందనే కారణంచేత విశాలాంధ్ర నిశ్చయం ప్రకటింపబడిలేదని అనుకుంటున్నారు.

1st February 1956 ]

విశాలాంధ్ర నిర్మాణాన్ని ప్రకటించడంలో ఇంతకాలము ఆలస్యం చేయడం వల్ల Violant agitation కు దారి తీయవచ్చునని నాభయం. వెంటనే action తీసికొని వున్నట్లయితే యీదేశములో ఇంత అల్లకల్లోలము రావడానికి అవకాశములేదు. గ్యారంటీలవిషయమై ఎవరో ఏదోఅడుగుతున్నారని యీగారంటీల విషయమై ఎంతమాత్రము అడగడానికి వీలులేదు. విశాలాంధ్ర విషయమై ఎవరైనా గారంటీలు అడగాలంటే Central, northern districts అడగాలి కాని మరెవరూ అడగడానికి అవకాశములేదని నాఅభిప్రాయం. వారేభయపడాలి. విశాలాంధ్రవస్తే ఏలాగుంటుంది? ఎవరెవరు కలుస్తారు? కలిసిన తర్వాత ఆ Districts ఏలాగుంటాయి? విశాలాంధ్ర ఏర్పడిన తరువాత రాయలసీమ, తెలంగాణాలవారంతా ఒక్కటౌతారు. అప్పుడు గారంటీలు ఎవరూ కోరవలసిన అవసరములేదు. ఇవ్వవలసింది అంతకంటే లేదని నా ఉద్దేశము. ఇంక ఒక్కమాటచెప్పి సెలవు తీసుకుంటాను.

Human nature తెలియకుండా మనమందరము behave చేస్తున్నామేమోఅని నాఅభిప్రాయం, బ్రతిమాలినకొద్ది మనిషి వ్యతిరేకంకావటం మామూలు. అది మనం తెలుసుకోకుండానే పూరికే సమయంవచ్చినప్పుడెల్ల బ్రతిమాలుతున్నాము. మీకు యేమి Guaranties కావాలన్నా యస్తామన్నాము. హైదరాబాదుపేరు కావలిస్తే హైదరాబాదుంచుకోండి నవాబుగారు కావాలిఅంటే నవాబుగారిని Head of the State గా ఉంచుకోవచ్చును. ఏమిటికావాలిస్తే అది వుంచుకోనమని బ్రతిమాలుతున్నికొద్దివారు విఱ్ఱవీగుతున్నారుగాని ఆంధ్రదేశం తెలంగాణాతో కలవడం చేత నష్టం మనకేగాని వారికి యెంతమాత్రంలేదు. అది మనంగ్రహించి ఒకపర్యాయం మాకు తెలంగాణా అక్కరలేదని మీరుఅనండి మర్నాటికి విశాలాంధ్ర రాకపోతే నన్ను అడగండి.

SRI L. LAKSHMANA DAS:—

అధ్యక్షా! యీనాడు ఉప ముఖ్యమంత్రిగారు తీసుకొచ్చిన యీతీర్మానాన్ని హృదయపూర్వకంగా ఆమోదిస్తున్నాను. యీతీర్మానం ఇప్పట్లో మనం తీసుకగావలసిన అవసరంలేకపోయినా యీమధ్యలో జరుగుతున్న వేపరు స్టేటుమెంట్లయితేనేమి, S. K. పాటిల్ మన ఆంధ్రదేశంవిషయములో జోక్యంకల్గచేసుకొని చెప్పతున్న మాటలనుబట్టి అయితేనేమి మళ్ళి ఒక్కసారి మనం యీతీర్మానాన్ని తీసుకరావలసివచ్చింది. ఆసలు భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతం అంగీకరించినప్పుడు ఒకొక్క ప్రాంతంయొక్క ఉద్దేశ్యం తెలుసుకోవాల్సిన అవసరం ఎవరికిలేదు అ ది పెద్దలు తెలుసుకోవాలని నేను కోరుతున్నాను. ఆంధ్రులంతా కలిపి ఒక రాష్ట్రంగావుండాలి. యేభాషకు ఆరాష్ట్రం వుండాలిఅనే సిద్ధాంతాన్ని అంగీకరించినప్పుడు హైదరాబాదులోవున్నవారి యిష్టంవున్నదా లేదా అని తెలుసుకోవలసిన ఆవసరం యేమివున్నదో నాకు అర్థంకావడంలేదు. ఈ వేళ మనకు భయంగావుండినా విశాలాంధ్ర వచ్చితీరుతుంది అన్న సంపూర్ణ విశ్వాసంలో వున్నాను నేను.

1st February 1956

SRI L. LAKSHMANA DAS:—

ఈ మధ్యన విశాఖపట్టణంలో విద్యార్థులందరు సమ్మెలు చేసి అనాడు వాళ్ళ మధ్య వుపన్యసించమనేటప్పుడుకూడా నేను ఈవిషయమే చెప్పాను. కేవలం ఒక ప్రొటెస్టుగా మీరు సమ్మె చేశారు; అందుకు సంతోషమే. గానీ దీన్ని మీరు విస్తీర్ణింపచేయకుండా అల్లర్లకు తావుయివ్వకుండా చెయ్యాలని వారిని కోరినాను. శాసనసభ తీర్మానం చేసినప్పుడు అది అమలుపెట్టలేనప్పుడు కర్తవ్యం శాసనసభ్యులపైన వున్నది అని వారికి హామీయిచ్చాను, అందుచేత శాసనసభకు ఒక పరీక్షాసమయంగావున్నది అని నే మనవిచేస్తున్నాను. తరువాతను ముఖ్యంగా చెప్పవలసిన విషయం ఆంధ్రరాష్ట్రపు సరిహద్దులగురించి. ఒరిస్సారాష్ట్రం యేర్పడినప్పుడు ఆంధ్రులకు జరిగిన అన్యాయం అందరకి తెలిసినవిషయమే. పర్లాకిమిడి రాజాను సంతోషపెట్టడానికి పర్లాకిమిడి బెర్హాంపూరులను ఒరిస్సాకు యివ్వడము జరిగింది. రెండు మూడు సంవత్సరముల క్రిందటివరకుకూడా గునుపూర్, బర్హాంపూరు, పర్లాకిమిడి ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘంయొక్క Jurisdiction లో ఉండెడివి. ఆ ప్రాంతాలనుంచి A. P. C. C. మెంబర్లుగా ఒకరిద్దరిని ఎన్నుకొంటున్న సంగతికూడా కాంగ్రెసు పెద్దలకు తెలుసును. ఈలాంటి పరిస్థితుల్లో అనాడు అన్యాయంజరిగిందికదా! అక్కడ 100 కి 65 మంది ఆంధ్రులు వుండేటప్పుడు పర్లాకిమిడివిషయంలో యెందుకు ప్రత్యేకంగా ఆలోచనచేస్తున్నారో నాకు అర్థంకాలేదు.

పర్లాకిమిడికి ఇతర ఒరిస్సారాష్ట్రానికి రాకపోకల మార్గాలు లేవు పర్లాకిమిడి చేరడానికి 75 మైళ్లు ఆంధ్రప్రదేశంనుంచి ప్రయాణం చేయాలి. పర్లాకిమిడిలో అడుగు పెట్టడానికి వారికి యింకొక మార్గంలేదు. వంశధారానదికి ఆనకట్ట కట్టాలని శ్రీకాకుళంజిల్లాను సస్యశ్యామలం చేయాలని సెకెండు ప్లానులో ఆస్కీముని వేసుకున్నాము, అయితే ఒరిస్సావాళ్లు యీనాడు అడ్డుపడుతున్నారు, వాళ్ల ప్రదేశంలో ప్రాజెక్టు కట్టకూడదని. పర్లాకిమిడిలో 100 కి 65 గురు తెలుగువాళ్లు వున్నప్పటికి కూడా 'అదిమాది, ఇక్కడ మీరు ప్రాజెక్టు కట్టకూడదు' అని చెప్పతున్నారు. వాళ్ళు కట్టకూడదని చెప్పినట్లయితే మనం దిగువ ప్రాంతాలలో రిజర్వాయర్ కట్టాలనా? అదికట్టినప్పుడు అక్కడ ప్రజలు మాత్రం సహించగలరా? అని నేను మనవి చేస్తున్నాను. అందుచేత పరిపాలనా సౌలభ్యం తీసుకొన్నా, జనాభా లెక్క తీసుకున్నా, యేదృష్టిలో తీసుకొన్నా పర్లాకిమిడి ఆంధ్రలో చేరవలసియున్నదని యీ సభకే నిర్ణయంచేసి వుండవలసింది. దానికి ప్రత్యేకంగా ఒక బార్డరు కమిషను కూడా అనవసరం అని నేనుమనవి చేస్తున్నాను. అందుచేత హైదరాబాదు భాగంలో వున్న తెలుగు ప్రదేశం, యిప్పుడున్న ఆంధ్రదేశం కలిస్తే విశాలాంధ్ర కాదు అని నా విశ్వాసం. అటువంటి విశాలాంధ్ర కావలసింది అని నేను కోరడంలేదు, ఆంధ్రులు యెక్కడెక్కడ వున్నారో ఆ ప్రదేశాలనన్నింటిని మనరాష్ట్రంలోనికి తీసుకొచ్చిననాడే నిజమైన విశాలాంధ్రను సంపాదించినవాళ్లం అవుతాము. అంతవరకు యీ శాసనసభ ఒక ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవలసిన అవుసరంవుంది. విశాలాంధ్ర రాదు అని మనం అనుమానించవలసిన అవుసరంలేదు. విశాలాంధ్ర ప్రకటన వచ్చితీరుతుంది. అట్లా రానప్పుడు ఇక్కడ 196 మంది శాసనసభ్యులు యేకగ్రీవంగా న్యాయమైనకోరి

SRI L. LAKLHMANA DAS:—

కను కోరినప్పుడు, దానిని మన్నించనప్పుడు యీ శాసనసభ్యులు చేయవలసిన కర్తవ్యమేమో మనం నిర్ణయం చేసుకుందాం. అందుచేత దేశంలో అల్లకల్లోలాలకు తావులేకుండావుండేటట్లు ప్రతి ఒక్కరు ప్రజలకి విజ్ఞప్తి చేయవలసివుంది. ఈనాడు ఒరిస్సాలో జరిగిన అల్లర్లవల్ల సామాన్యమైన ప్రజానీకం చాలాఇబ్బందులకు గురికావలసివచ్చింది. అనేకమంది ప్రజలు చచ్చిపోయినారు. ఇస్థులు నాశనమైపోయిన పరిస్థితివచ్చింది. అయినా ఆంధ్రజాతి చాలా న్యాయంగా మననాయకులపట్ల వున్న విశ్వాసంతో తప్పకుండా మనశాసనసభ అన్ని ఆంధ్రప్రాంతాలను సంపాదించి తీరుతుందనే సంపూర్ణమైన విశ్వాసంతోనే ఎటువంటి అల్లరులు చెయ్యకుండా శాంతియుతంగా కాసుకు కూర్చొనివుంది. ఈ అవకాశాన్ని తీసుకొని ఆంధ్రదేశం యేమో యేమాత్రమూ విశాలాంధ్రగురించి సుముఖంగాలేదుఅని S. K. Patil చెప్పిన వాక్యానికి కాంగ్రెసు పెద్దలు యెటువంటి విలువ యివ్వకూడదని నేను మనవిచేస్తూ యీనాలుగైదు దినాల్లోనో యెంతవేగరంగా విశాలాంధ్రగురించి ప్రకటన చేయడమే కాకుండా విశాలాంధ్ర ప్రకటనతో పహా. అన్నిసరిహద్దులు వుత్తర సరిహద్దు, ఇటు మద్రాసు సరిహద్దు నిర్ణయానికి నిష్పక్ష పాతమైన ఒక కమిషన్ యేర్పాటు చెయ్యవలెనని కోరుతున్నాను. అంతేకాకుండా అన్నిరాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రులని ఒకచోట కూర్చోబెట్టి మీ సమస్య లేమిటి? ఇక్కడవున్న కష్టాలేమిటి అని తెలుసుకొని వెంటనే సక్రమమైన నిర్ణయాలు చేయవలసిన పరిస్థితులున్నాయి. పర్లాకిమిడిలో 60% తెలుగువాళ్లు వున్నారు. 32% ఒరియావాళ్ళున్నారు అని మనం యీనాడు చెప్పతున్నాము అంటే అదికాదని ఒరియావారుగాని, ఒరిస్సాగవర్నమెంటు కాని చెప్పేస్థితిలో లేదని నేను మనవి చేస్తున్నాను. అలాంటి లెక్కలన్నీ మన దగ్గరున్నాయి. ఈ లెక్కలన్నీ దృష్టిలో పెట్టుకొని ఆప్రాంతాలలోని అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని మన్నించడంన్యాయం. అలాగ చేయలేనపుడు ఒక కమిషన్ను వేసి ఆ కమిషన్ ద్వారా మనకు రావలసిన భాగాలు మనకుయిచ్చి ఇతరులకు పోవలసిన ప్రాంతాలు ఉండేవారికి ఇచ్చుటకు మనకేమీ అభ్యంతరంలేదు. ఆవిధంగా ఏక భాషారాష్ట్రాలను యేర్పాటుచేసిన తర్వాత ద్విభాషారాష్ట్రాలను గురించిగాని, ఇతర విషయాలను గురించిగాని ఆలోచించుకోవచ్చును. దేశంలో అల్లరులు లేకుండా విజ్ఞప్తులు చేస్తూ యీ తీర్మానాన్ని ప్రతి ఒక్కరూ యేకగ్రీవంగా ఆమోదించి దీనిని అమలు పరచడానికి శాంతియుతంగా పట్టుదలతో వుండాలని నేను మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—

ఉపాధ్యక్షా, ఈరోజున మన ఉప ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు యీ తీర్మానమును ప్రతిపాదించారు అంటే నేను చాలా సంతోషిస్తున్నాను, రెండుసంవత్సరముల రెండుమాసముల క్రిందటనుంచి విశాలాంధ్ర తప్పకుండా 56 నవంబరు 27 తారీఖులోపున వస్తుందని చెప్పినవాళ్లలో మొదటివాడిని నేను. కాని నాకు ఒక్కడికేకాదు, ఆంధ్రులందరికి ఆకోరికవుంది. నేను మళ్లీ తిరిగి ఆవిషయమై మనవిచేయ

1st February, 1956 ]

SRI P. SATYANARAYANA:—

ఉపాధ్యక్షా, నాల్గురోజులక్రితమే విశాలాంధ్రయొక్క స్వరూప పరిహద్దులు మొదలైన వివరములతో ఒకబిల్లు మనముందు ఉంటుందేమో అనుకొని ఈసమావేశము ఒక నెలరోజుల క్రిందట నిర్ణయించబడింది. అదిరాలేదు సరికదా, ఇపుడు మరల మనము నెలరోజులక్రిందట ఏలాంటి ఆందోళనతో ఉన్నామో దానికి రెట్టింపు ఆందోళన ఈనాడు ఏర్పడింది. ఇదిచాలా దురదృష్టకరమైన అంశము. ఈ నెలఅంతాకూడా దేశము బాగాకదిలింది. అనేకరాష్ట్రాలతోపాటు, అనేకపట్టణాలతోపాటు ఆంధ్రలో ఉన్న పెద్దపెద్ద పట్టణాలలో రెండవరకపు పట్టణాలన్నింటిలో కూడా హర్తాళ్‌లు జరపడము, పాఠశాలలకు వెళ్ళకుండా మానివేయడముమొదలైన సంఘటనలు జరుగుతున్నాయి. ఆంధ్రదేశంలో ఉన్నటువంటి 2 కోట్ల జనము కదిలింది. తెలంగాణాలో ఒక మైనారిటీ వర్గము తప్ప మెజారిటీవర్గము కూడా బాగాకదిలింది. ఇది కదలికమాత్రమేకాదు. ఇందులో విపరీతమైనటువంటి ఆవేశముకూడా ఉన్నది. అవసరము అయితే అనేకులు త్యాగము చేయవలసినటువంటి ఒక మహోత్కృష్టమైనటువంటి, పవిత్రమైనటువంటి ఒక ఆదర్శము ఉన్నదనే ధోరణిలో దేశంఅంతా కదిలింది. చివరకు ఈరాష్ట్ర తుపానులో భాషారాష్ట్ర సిద్ధాంతాన్ని తృణీకరించినవాళ్లు, కించపరచినవాళ్ళు ఇదిఒక సిద్ధాంతము కాదని వాదించినవాళ్ళుకూడా చివరకు ఈతుపానులోకి రాక తప్పలేదు. అనేకమంది భాషారాష్ట్రాలు అంటే పట్టించుకోనివారు ఆదేశముఖ్ గారిలాంటి వారు ఇలాంటి విషయంలో ఒక చిన్న కార్యముచేయలేరు. చాలా బ్రహ్మాండమైన రాజీనామా వరకు కూడా వెళ్ళడం తటస్థించింది. మొత్తము మీద ఈనాడు దేశానికి కూకటి వేళ్ళతో పూపేటటువంటి జాతీయ సమస్యగా ఈభాషారాష్ట్ర సమస్య అయింది. ఇంతవరకు వచ్చిన తరువాతకూడా ఇంతమహత్తరమైన ఉద్యమానికి వెనుక చారిత్రక సామాజిక సూత్రం ఒకటిఉంటుంది అన్న సత్యాన్ని హైకమాండు గమనించకపోవడము ఈయావత్తు భారతదేశాన్ని అనవసరముగా కష్టాలుపాలవుడానికి హేతువు అవుతూఉన్నది. భాషను పురస్కరించుకొని జాతిలో ఏర్పడటము యుగయుగాలుగా ఆభాషను ఒకకీలకము చేసుకొని దాని చుట్టూ ఒక సంస్కృతీ ఏర్పడటం ఒక సంస్కారము, ఒక సాంప్రదాయము, అపరిసరాల్లో యావత్తు భౌతికమైనటువంటి సంపదమీదకూడా ఒకహక్కు ఒక సెంటిమెంటు ఏర్పడడము అనేటటువంటిది చారిత్రకమైన సత్యము. దీనిని గ్రహించకుండా హైకమాండు తిరస్కరించడం జరుగుతున్నందువల్లనే దేశం అనవసరంగా ఇలాంటికష్టాలపాలవడము తటస్థిస్తున్నది. అసలు దీనిని భాషారాష్ట్రము అనే సూత్రము ఒకటి ఎంతవిలువైనదో ఎంత సత్యమో గ్రహించకపోవడం మీద మనలో చాలామంది మాట్లాడినారుకూడా. ఆంధ్రరాష్ట్రము రాకపోవడానికి కారణము ఢిల్లీ సెక్రటేరియెట్ లో 2, 3 ఉద్యోగాలలో మనవాళ్ళు ఎవరైనాఉంటే సరిపోదు అదే భావములనుకూడా వ్యక్తము చేస్తున్నారు. అసలు national sentiment ను, దీనివెనుక ఉన్నసత్యాన్ని గ్రహించకపోవడమే దీనికి కారణము. ఎట్లా

1st February 1956

SRI P. SATYANARAYANA:—

అయితే హైకమాండు గ్రహించకుండా దేశమును కష్టాలపాలుచేస్తున్నదో అడి టటువంటి మనముకూడా ఆవిధముగా గ్రహించకుండానే కొంతవరకు దీనిని పెడ మార్గాన్ని పెడుతున్నామేమో అనిపిస్తున్నది. ఇప్పుడు కోలారు ఆంధ్రరాష్ట్రములో తప్పకుండా కలసితీరాలనే విషయముమీద ఇప్పుడు కేంద్రీకరించవలసిన అవసరము ఉన్నట్లు తోస్తున్నది. ఇదివరకే కొంతవరకు తుంగభద్ర head works ఉంటె ప్రాంతానికి ఒకే కేసు తయారుచేశాము. బాగానేఉన్నది. మిగతా ప్రాంతా విషయము ఎల్లాఉన్నప్పటికి అసరిహద్దుల head works కు సంబంధించినంతవరకుఒక argument తయారయి ఉన్నది. దీనిని గురించి హైకమాండుకూడా ఆలోచిస్త న్నట్లు తెలుస్తున్నది. కాని కోలారు విషయములో మాత్రము మనము సరియైనట వంటిది ఏదో ఉత్త ఉత్తమాటలతో కాలక్షేపముచేస్తున్నామేగాని, ఆవిషయా యందు సరియైన కేంద్రీకరణ తీసుకొంటున్నట్లు తోచదు. కోలారులో 100 60 మందివరకు ఆంధ్రులు ఉన్నారన్న విషయము సత్యము. అక్కడకు వెళ్లి ఏకా ణముచేతనైనా అక్కడఉన్నటువంటి బంగారుగనులను అభివృద్ధి చేయడము విషయ ములో మైసూరు ప్రభుత్వము ఇంతవరకు ఏమైనా ఖర్చుచేసినట్లయితే ఆ account ప్రకటించమనండి. ఎంతవరకు ఖర్చుచేశారు, వాటిమీద ఎంత ఆదాయము వచ్చింది వాస్తవముగా ఆలోచించినట్లయితే వారు ఖర్చుచేసిన దానికంటె ఆదాయమే ఎక్కు వచ్చింది. ఇప్పుడుకేవలము ఆగనులు విషయములో మేము పెట్టుబడులు పెట్టాము కనుక ఆఏరియా అంతామాకు వస్తుంది జనాభాలో మెజారిటీ మీరు ఉన్నప్పటి రాగుఅనే సూత్రము ఎంతమాత్రము సమర్థనీయముకాదు. అందుచేత కోలారు విష యములో మాత్రము మనము ఎక్కువ శ్రద్ధవహించి ఇకముందు గట్టిగాపని చేయవల ఉంటుందని మనవి చేస్తున్నాను.

SRI T V RAGHAVULU:—

ఉపాధ్యక్షా, నేడు ఉప ముఖ్యమంత్రిగారు తెచ్చినటువంటి ఈ తీర్మానాన్ని బలపరుస్తున్నాను. అయితే కొన్నిమాటలు చెప్పడము చాలాఅవసరము. సహ జమైనటువంటి, సహజమైనటువంటి ఆంధ్రరాష్ట్రవాంఛ ప్రస్ఫుటంగా అన్నికోణా నుంచికూడా మన అగ్రనాయకులకు ఇదివరకే మనము తెలిపిఉన్నాము. ఈకోరిక కేవలము ఈనాటిదేకాదు. ఒకరినొకరు దోచుకోవాలనిగాని, పదవీవ్యామో హముతో చేసిన కోరికకాదు. ఒకరినొకరు ఓడించుకోవాలని చేసిందికాదు చరిత్రలో చెల్లాచెదరు అయిపోయినటువంటి ఆంధ్రజాతి అంతాకూడా కల సుకొని, సమిష్టిగా కృషిచేసుకొని విశాలాంధ్రరాష్ట్రాన్ని సముచితమైనటు వంటి భవిష్యత్తుఉండే పరిస్థితుల్లో ఏర్పరుచుకోవాలని కృషిచేయడానికి ఈతీర్మా నాన్ని మనము చేస్తున్నాము. అందుచేత ఈవిషయములో ఎవరికి ఎక్కడా అపోహ ఉండదుఅని మనము సహజముగా అనుకొన్నాము. అయితే మన దురదృష్టవశాత్తు అక్కడక్కడ అపోహాలు పొటమరించడము అనేది జరిగింది. అయినప్పటికి ఈ ప్రజాస్వామికయుగంలో మనముఉన్నాము. అందుచేత మన పాలకులు, ప్రజలు

1st February 1956 ]

SRI T. V. RAGHAVULU:—

పరిపాలనలో సౌలభ్యముఅనేది దృష్టిలో పెట్టుకొని ఈలోపున ఈ భాషా రాష్ట్ర సిద్ధాంతాన్ని గత 30, 40 సంవత్సరములలో అందరియొక్క ఆమోదాన్ని పొందినటువంటి ఈసూత్రాన్ని అమలు పరచడములో ఉండేటటువంటి సాధకబాధకాలు కొన్ని ఉంటే ఉండవచ్చును అయినప్పటికి మన అగ్రనాయకులు ఇంత విలంబన చేస్తారని ఏ ఆంధ్రుడు అనుకొనలేదు. ఇక్కడగాని లేక హైదరాబాదులోగాని ఎవరూ అనుకొనలేదు.

అయితే ఈ విలంబన జరగడంలో ఆంధ్రులు చూపినటువంటి సహనాన్ని ప్రశాంత చిత్తాన్ని, ఓర్పును కొంతమంది అగ్రనాయకులే కాదు. అగ్రనాయకుల పేరుచెప్పుకొని లేదా పిలువని పేరంటంగా పురస్కరించుకొని ఇప్పుడు అక్కడ జరుగుతున్నటువంటి వాటిని అపార్థంచేసుకోవడం చాలా దురదృష్టకరము. పాటిల్ లాంటి వారుకూడా అదొక జాతి, ఇదొక జాతి, వీరి రామాయణము ఒకటి, వారి రామాయణము ఒకటి అని చెప్పడంఅంటే, తనకు తెలుగుభాషలో ఉన్నటువంటి ప్రమేయంఏమిటో, తనకు ఉన్నటువంటి అధికారమేమిటో తెలియదుగాని, ఇటువంటివి పిలువని పేరంటంగా చెప్పడంఅనేది చాలా సహించరానటువంటి విషయము. అది వారి మర్యాదకు, గౌరవానికి భంగకరమని వారు గుర్తించడం అవసరం. ఇప్పుడు దేశాన్ని ఎదుర్కొన్నది మూడు సమస్యలు. ఒకటి జాతీయ ఐక్యత, రెండవది భాషావాదము, మూడవది పరిపాలనా సౌలభ్యము. ఈ మూడు సమన్వయపరచుకొని భాషారాష్ట్ర సిద్ధాంతాలను ప్రాతిపదికగాపెట్టుకొని దేశాన్నంతాకూడ రాష్ట్రాలుగా విభాగము చేయవలసిందిగా వొక Commission వేయడంకూడ మన కందరికి తెలిసిన విషయమే. అయితే ఆ Commission చేసినటువంటి సిఫార్సులను అమూలాగ్రంగా విచారించి మన అగ్రనాయకులు మనకు సత్వర విశాలాంధ్ర నిర్మాణానికి తగినటువంటి నిర్ణయము చేయవలసియున్నది. ఈ నిర్ణయం వస్తుందనే నమ్మకము నాకు ఉన్నది. అయితే మనము అనుకొన్నంత త్వరగా రానికారణంచేత అక్కడ నిరుత్సాహము పొటమరించింది. నిరుత్సాహంవల్ల అసహనంగా రూపొందింది. చిన్నపిల్లలలోను, విద్యార్థులలోను ఇంకా కొద్దిరోజులు పోయినట్లయితే, ఇది సరిహద్దులను మించిపోయి మనము చూపుతున్నటువంటి సహనంకూడ మరొకరకంగా మారవచ్చును. అందుచేత అగ్రనాయకులు ప్రజానీకముయొక్క వాంఛను మన్నించి వెంటనే విశాలాంధ్రకు అనుగుణ్యమైనటువంటి నిర్ణయాన్ని ప్రకటించవలెనని మనవిచేస్తూ హృదయపూర్వకంగా ఈ తీర్మానాన్ని బలపరస్తూ విరమిస్తున్నాను.

SRI P. RAJAGOPALA NAIDU:—

ఉపాధ్యక్షా, ఈతీర్మానాన్ని నేను బలపరుస్తూ దక్షిణ సరిహద్దును గురించి మాత్రము మాట్లాడదలచుకొన్నాను. ఈమధ్య మద్రాసు మంత్రులు చేస్తున్నటువంటి ప్రకటనలు చాలా అలజడిని ఆందోళనను కలిగిస్తున్నాయి. ఎందువల్లనంటే, దక్షిణ

SRI P. RAJAGOPALA NAIDU:--

సరిహద్దులలో ఉన్నటువంటి జిల్లాలలో హోసూరు తాలూకా, వేపనపల్లి ఫిర్కా, క్రిష్ణగిరి, ఉత్తర ప్రాంతము, అవన్నీకూడా తెలుగు ప్రాంతములు. అలాగే, చెంగల్పట్టు జిల్లాలోగూడ రెండు తాలూకాలలో అధికసంఖ్యాకులు తెలుగువారు. ఈవిధంగా ఉండినప్పటికీ, మద్రాసు మంత్రులు హోసూరు పూర్తిగా తమకే చెందింది అంటున్నారు. ఇది చాలా అక్రమమైనటువంటి విషయము. (At this stage the bell was rung.)

The Hon. SRI K. VENKATA RAO;—

ఈ bell వరండాలో తిరుగుతున్న సభ్యులకు ఆహ్వానంగాని, poll bell కాదు.

SRI P. RAJAGOPAL NAIDU:—

హోసూరుతాలూకా పూర్తిగా తెలుగుప్రాంతము. అందులో నూటికి 60 మందికిపైగా తెలుగువారు ఉన్నారుఅని లెక్కలు రుజువుచేస్తున్నాయి. అటువంటప్పుడు, అక్కడ ఉన్నటువంటి ప్రజానీకము మద్రాసురాష్ట్రములో నేఉండాలని అనుకొంటున్నారని మద్రాసుమంత్రులు ప్రకటనలుచేయడం చాలా శోచనియమైన విషయము. ఎందువల్లనంటె హోసూరుతాలూకాలో ఉండే 72 పంచాయితీలలోను 52 పంచాయితీలు, ఆంధ్రరాష్ట్రంలో చేరాలనిచెప్పారు. అమద్యనే మునిస్వామిరెడ్డిగారి నాయకత్వన హోసూరుకు, కర్నూలుకు .....Interruption)

SRI P. VENKATASUBBAYYA:—

On a point of order, Sir, దీన్ని Division Bell అంటారు. దీనిని division వచ్చినప్పుడైనా కొట్టవచ్చు, లేకపోతే శాసనసభలో quorum లేనప్పుడైనా కొట్టవచ్చుకాని, ఈ రెండు లేనప్పుడు కొట్టడం ఏమైనాసబబా? దీన్ని గురించి సెలవిస్తారా?

The Hon. SRI K. VENKATA RAO:—

బయట ఉన్నటువంటి గలాటాను తగ్గించి సభ్యులయొక్క విద్యుక్తధర్మాన్ని నిర్వహింపచేయడంకోసం కొట్టబడింది.

SRI P. VENKATASUBBAYYA:—

దానికి rule ఏమైనావున్నదా?

Mr. DEPUTY SPEAKER:—

శాసనసభకు అధికారముఉన్నది. సభ్యులు అక్కడక్కడ పారాడుకొంటూ ఉంటే, ఇక్కడ చాలాముఖ్యమైన విషయంగురించి చర్చ జరుగుతూఉన్నప్పుడు, వారిని రమ్మనిపిలిచే పిలుపు బెల్ ఇది.

1st February, 1956 ]

SRI P. RAJAGOPALA NAIDU:—

హోసూరు తాలూకాలో ఉండే 72 పంచాయితీలలో 52 పంచాయితీలు పూర్తిగా ఆంధ్రరాష్ట్రములో చేరాలని తీర్మానాలను చేసినప్పుడు, ఆ ప్రజాభిప్రాయము ఆంధ్రలో చేరడానికి సుముఖంగా ఉన్నదో లేదో ప్రపంచానికే తెలుసును. అలాంటి సమయములో మద్రాసు మంత్రులు హోసూరు తాలూకా తమకే ఇచ్చివేయబడిందని అక్కడక్కడ ప్రకటనలు చేయడాన్ని మన మంత్రులు ఖండించాలని వారిని కోరుతున్నాను. అంతేకాకుండా అక్కడిసంగతి శ్రీ కళా వెంకటరావుగారికి కూడ తెలుసును. అక్కడ వారు పర్యటన చేసిఉన్నారు. హోసూరు తాలూకా గాని వేపనపల్లి ఫిర్కాగాని మన చిత్తూరుజిల్లాకు సరిహద్దులలో ఉన్నాయి. Contiguity కూడ ఉన్నది. అలాంటప్పుడు వారందరికీ కూడాను ఆంధ్రరాష్ట్రంలో చేరాలని ఎక్కువగా ఆసక్తి ఉన్నప్పుడు ఆ ప్రజాభిప్రాయముతో నిమిత్తము లేకుండా మద్రాసు మంత్రులు అలాంటి ప్రకటనలు చేయడం శోచనీయంగా ఉన్నదని నేను తెలుపుతూవున్నాను. అంతేకాకుండా చెంగల్పట్టుజిల్లాలో ఉన్నటువంటి తెలుగు ప్రాంతాల విషయంలో కూడ మనము గట్టిగా పట్టుబట్టాలి. ప్రత్యేకంగా హోసూరు తాలూకా నేగాక, ఆ ప్రక్కన ఉన్నటువంటి కోలారుజిల్లాగురించి కూడ పట్టుపట్టాలని నా మిత్రులు చెప్పడం చాలా సబబైన విషయము, కోలారుజిల్లా మనకు నిజంగా రావాలికూడాను. ఈనాడు మైసూరు Capital గా ఉన్న బెంగుళూరు కట్టింది తెలుగువారే అనేది ఎవరూ మరచిపోవడానికి వీలులేదు. ప్రత్యేకంగా కోలారుజిల్లాలో నూటికి 60 మందికిపైగా తెలుగువారుఉన్నారు. అలాంటప్పుడు అది ప్రత్యేకంగా మనకు రావలసిన అవసరమున్నది. అంతేగాక, హోసూరులో బంగారు గనులు కూడా ఉన్నాయిఅని వింటున్నాము. హోసూరులో అడవులుకూడ ఎక్కువగా ఉన్నాయి అందువల్ల ఎక్కడో సింకోటా మొదలైనటువంటి ప్రాంతాలు మద్రాసు రాష్ట్రవాసులు పోగొట్టుకొన్నందువలన దానికి పరిహారంగా హోసూరు తీసుకోవాలని అనుకోవడం చాలా అన్యాయము. అందువల్ల వారు అలాగుఅనడాన్ని మనము ఆక్షేపించవలసియున్నది. అంతేగాకుండా మన మంత్రులు రాయబారవర్గంగా వెళ్లి వారితో చర్చలు జరపాలని అనుకొన్నప్పుడు అచర్చలకు అవకాశము ఇవ్వకుండా ఆ హోసూరు తాలూకానుగురించి మాట్లాడడానికే అవకాశంలేదని వారు అనడం చాలా శోచనీయంగాఉన్నది. Boundary Commission ఉండాలని వారు అంటున్నారంటే అది తప్పనిసరిగా పెట్టినట్లయితే, మనంకాదు అనవలసినటువంటి అవసరంలేదు. ఎందువల్లనంటే అది పెట్టినట్లయితే హెచ్చుభాగము మద్రాసు రాష్ట్రంలోనుంచి మనకే వస్తుందిగనుక మనము భయపడవలసిన అవసరంలేదు. అంతేగాక చిత్తూరుజిల్లాలో ఉన్నటువంటి అందరు M. L. A. లు పార్టీ విభేదాలతో నిమిత్తంలేకుండా హోసూరుప్రాంతాన్ని తప్పనిసరిగా ఆంధ్రరాష్ట్రములో చేర్చడానికి ఎంత ప్రయత్నమైన చేయడానికి పూర్తిగా కంకణబద్ధులుగా వున్నారు. గనుక హోసూరుతాలూకాలో వున్నటువంటి ఆంధ్రులు ఏలాంటి భయముపడవలసిన అవసరంలేదని ఈశాసన ద్వారా వారికి నేను తెలియజేస్తున్నాను. ఎందువల్ల

1st February 1956

SRI P. RAJAGOPALA NAIDU:—

నంటె ఈమధ్యను, నిన్ననూ, మొన్ననూ, ఈదినమూసుమారు 20, 30 మంది ఆందోళనపడుతూ లేఖలు వ్రాశారు. మద్రాసు మంత్రులు ఈవిధంగా ప్రకటనలు చేస్తున్నారని, ఈవిధంగా మాట్లాడుతున్నారని ఆందోళన చెందుతూ వ్రాశారు. అందువల్ల ఆసరిహద్దుప్రాంతాలలో వున్నటువంటి ఆంగ్రులయొక్క హక్కులను విస్మరించకుండా వారిని ఈ రాష్ట్రములో చేర్చడానికి గట్టిప్రయత్నము చేస్తామని ఈశాసనసభమూలకంగా వారికి నేను తెలియజేయదలచుకొన్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA·—

ఆద్యక్షా, విశాలాంధ్ర స్థాపనను గురించిన తీర్మానాన్ని తెచ్చినందులకు, మన సంజీవరెడ్డిగారినిన్నీ, యీవిషయములో తీవ్రంగా కృషి చేస్తున్న హైదరాబాదు ముఖ్యమంత్రి అయిన బూర్గుల రామకృష్ణారావు గారినిన్నీ, ఉద్దేశపూర్వకంగాను, హృదయపూర్వకంగాను నేను అభినందిస్తున్నాను. విశాలాంధ్ర నిర్మాణముపట్ల ఎవరికినీ రెండవ అభిప్రాయములేదు. మన నెహ్రూగారే భాషారాష్ట్రములు ఏర్పడే విషయములో నాకు అభిప్రాయములేదు, అటువంటి రాష్ట్రములు ఉండవలసిందే" అని అన్నారు, కాని ఒకటిమాత్రము చెప్పారు. వారుకోరింది Constitution విధానాలకు వ్యతిరేకముగా కాకుండా agitate చేసినన్నాళ్లు, భాషారాష్ట్రాలు ఏర్పరచటానికి వారికెట్టి అభ్యంతరమూ వుండదు అని అన్నారు. వ్యతిరేకించి ఉద్యమము నడిపించేటట్లయితే తీవ్రంగా ఎగుర్కోవలసివస్తుందనికూడా హెచ్చరిక చేశారు. Constitution ల విధానాలను వ్యతిరేకించకుండా ఆందోళనచేస్తున్న మమ్ములను మాత్రము వేరు మార్గము పట్టించవద్దని కోరుతున్నాను. విశాలాంధ్ర విషయములో ఆంగ్రులమందరము ఏకభాషారాష్ట్రము కావాలని యిక్కడ ఏకాభిప్రాయముతో వున్నప్పటికినీ, కొన్నిచోట్ల అనేకమైన అభిప్రాయభేదాలు లేవదీస్తున్నారు.

రెండుభాషలు కలవారిని కలిపి ఒకరాష్ట్రముచేయాలని ఒక ఆలోచన లేవదీస్తున్నారు. ఒక్కభాషకు ఒక్కరాష్ట్రము ఏర్పడడమే అమలు జరుపబడలేదు. కాని, అదిఅటుండగా ద్విభాషలతో ఒక రాష్ట్రము యేర్పడడమనేది అన్యాయముగా వున్నది. మేము ఎప్పుడును ఒకేభాషకలవారము ఒకే రాష్ట్రముకావాలని కోరుతున్నప్పుడు, రెండుభాషలతో ఒకరాష్ట్రము యేర్పడటానికి ఆంధ్రులమైన మేము వ్యతిరేకిస్తామని తెలుసుకోవలసివుంటుంది. ఆంధ్రులు ఎన్నడూ ఆవిధమైన రాష్ట్రముకావాలని కోరలేదు. B. N. Rao గారి ప్రణాళికలలో యీవిషయము 1916 వ సంవత్సరములో ఆంధ్రులందరు శ్రీ ప్రకాశపంతులుగారికి, కళా వెంకట్రావుగారికి యింకా యితర కాంగ్రెసు పెద్దలు అనిపించుకొనేవారందరికీ స్పష్టముగా అటువంటి ద్విభాషలుగల రాష్ట్రము మాకుఅక్కరలేదు అని ఖచ్చితముగా స్పష్టపరచి చెప్పారు. ఆవివరములను మరలను నేను వివరించదలచలేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

తరువాత లోన Zonal system పెట్టుతామని అంటున్నారు. మన ఇండియా కాన్‌స్టిట్యూషను, 262, 263 ఆర్టికిల్స్‌కు సంబంధించిన విషయాలు చర్చించి, సంప్రదించి అమలుచేయటానికి zonal state అమలుపెట్టవలసినదేగాని, ఆవిధంగా కాకుండా ఏదో పరిపాలనా సౌలభ్యంకోసం ఏర్పాటుచేసి, గవర్నరునుకూడా యేర్పరచి పరిపాలన ఏర్పాటుచేసేటట్లయితే, దానికి ఆంధ్రులందరు ఏకగ్రీవముగా వ్యతిరేకిస్తారనిమాత్రము హెచ్చరిస్తున్నాను. ద్విభాషాప్రయుక్తరాష్ట్రాలు నిర్మిస్తామని అంటున్నప్పుడు అనేకులు మరల విజయనగర సామ్రాజ్యము ఏర్పరుచుకోవాలన్నట్లు ప్రకటనలిస్తున్నారు. సంకల్పించుకొన్నా అట్లాంటివి నిద్రలోగూడ కలకనజాలము. రేపు ఏర్పడబోయేది ప్రజాస్వామికపు రాజ్యాంగవిధానముతో రాష్ట్రము కావాలికాని, సామ్రాజ్యాలు మరల నిర్మించుటకుకాదు. ఒకవేళ zonal council ఏర్పాటుచేసేటట్లయితే, అందులో నదీ ప్రాజక్టుల సమన్వయంకోసం ఏర్పాటుచేస్తే, మాకు ఒరిస్సా మహారాష్ట్రలతోటి ఎక్కువగా నీటి సంబంధము వున్నది గనుక, యీ మూడింటినికలిపి ఒక zonal council ను ఏర్పాటుచేయండి అని అంటున్నాను. దానికి మాకేమీ అభ్యంతరములేదు. అంతేకాని ద్విభాషా ప్రాంతాలను మరల ఏకరాష్ట్రముగా ఏర్పరచటానికి మేము ఒప్పుకోము. ఇటువంటి ఆలోచనను ఎవరైనా ఆలోచనకు తెచ్చినా, బలపరచినా, దానికిమాత్రము మేము పూర్తిగా ప్రతిఘటిస్తామని రూఢిగా తెలియజేస్తున్నాము. ఇంతకుముందు శ్రీ లక్ష్మణదాసుగారు చెప్పినట్లు విశాలాంధ్రను ఏర్పాటుచేసే సందర్భములో తెలంగాణా ప్రాంతమేకాకుండా, అటువైపు దక్షిణబస్తరు, కోరాపుట్, పర్లాకిమిడి, బరంపురం యిటువైపు హోసూరు, కృష్ణగిరి బళ్లారితాలూకామటుకే ననుకోండి. నా ఉద్దేశ్యములో యీప్రాంతాలు అన్నింటితో administrative convenience కోసము అనేదానికి వీలుగా తుంగభద్ర హెడ్‌వర్క్సు ఏర్పాటుచేస్తే, మాకేమీ అభ్యంతరము వుండదు. తరువాత యిదిగాక కోలారు వ్యవహారముకూడ వున్నది. ఇవిఅన్నీ మనము సాధించితీరాలి అని మనవిచేస్తున్నాను. ఆంధ్రులు యింతవరకూ విశాలాంధ్ర నిర్మాణము విషయములో జాగుఅవుతున్నా యెంతో నిబ్బరముగా వున్నందులకు అభినందించవలసివున్నది. నిజానికి యింత నిబ్బరముగా వున్నారంటే, అది ఎవరైనా ఆశ్చర్యపడకతప్పదు. వారియొక్క నిబ్బరము కోల్పోయినట్లయితే యిక వారిని ఆపటము ఎవరి అబ్బతరముకాదు వారిని యికమీదట ఆపుటకు అలవికాదు. ఆరోజున యీ సభలోనున్న 196 మంది శాసన సభ్యులుచేసిన తీర్మానాన్ని కేంద్ర ప్రభుత్వము ఆమోదించకపోతే తత్ఫలితముగా విశాలాంధ్ర రాకపోతే, యిందులోవున్న యీ 196 మంది సభ్యులందరూ చేరి ఏకగ్రీవముగా కేంద్ర ప్రభుత్వము చేసే తీర్మానం వ్యతిరేకిస్తారని ప్రతిఘటిస్తారనిమాత్రం చెబుతున్నాను, దాని వెనుక ఆంధ్ర ప్రజానీకముకూడావుండి తోడ్పడుతుంది. విశాలాంధ్రకు బదులు విషాదాంధ్రప్రాంతంలో విషాద సంఘటనలు తయారయ్యే పరిస్థితులు కలిగించకండి, విశాలాంధ్రఅనే ఒక ఆందోళనను విషాదాంధ్ర ప్రసాదించకండి. కాబట్టి కేంద్రములోవున్న High Power Committee వారు అటు

SRI VAVILALA GOPALAKRISHNAYYA:

వంటి విషాదసంఘటనకు దారి తీయరని ఆశిస్తున్నాను. ఆంధ్ర ప్రజానీకానికి భాషా ప్రయుక్త రాష్ట్రము కావాలనేదే ముఖ్యమైన కోరిక.

ఆంధ్రులకున్నది అటువంటికోరిక. మహారాష్ట్రులకువున్నది అదేకోరిక. తరువాత బెంగాల్ వారిది అదేకోరిక. బీహారువారూ అదేకోరారు, శ్రీ రాజేంద్రప్రసాద్ వారికి నాయకుడుగా బీహారు భాషారాష్ట్ర నిర్మాణంలో అసలు రాజకీయరంగంలోకి వచ్చారు. ఒరిస్సావారు భాషాప్రయుక్త రాష్ట్రము సంపాదించుకున్నారు. దానివల్లనే వారు ముందుకువచ్చారు. అందరు భాషారాష్ట్ర ఉద్యమంతో జాతీయోద్యములో చేరిపోయారు. అందువల్లనే దేశములోని యితర భాషలవారు భాషారాష్ట్రాలు కావాలని ఆందోళనచేస్తున్నారు మనకు స్వాతంత్ర్యము వచ్చింది. Republic ఏర్పడ్డది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరుపుకోబోతున్నాము. ప్రజానీకము కూడా యీ ప్రణాళిక విషయములో సహకరించవలసియున్నది. ఇటువంటి సమయములో భాషారాష్ట్రాలు కోరేవారిని వారికి కావలసిన రాష్ట్రాలు ఏర్పాటు చేయకపోతే యిటువంటి ప్రణాళికలు అమలుజరుపుట దుస్సాధ్యమవుతుందని నానమ్మకము. ఆంధ్రులందరు ఏక కంఠముతో కోరే విశాలాంధ్ర ఏర్పాటుచేయకపోతే రాబోయే విషాదసంఘటనలకు బాధ్యులు కేంద్రమువారే అవుతారని అంటున్నాను. తరువాత యీబాధ్యత ఆంధ్రులమీద వేయడము న్యాయముకాదు. కాబట్టి అటువంటి దుస్థితి ఆంధ్రులమీద రుద్దవద్దు. కేంద్రమువారిమీద వద్దు. ఎవరిపైనను లేకుండా, ఆంధ్రులను సుఖవంతము చేయటానికి పూనుకోవాలి. కాబట్టి విషాద సంఘటనలకు దారి తీయకుండా విశాలాంధ్రను ఏర్పరచాలని కేంద్ర ప్రభుత్వాన్ని హృదయపూర్వకముగా కోరుతూ యీ తీర్మానాన్ని బలపరుస్తూ ముందు దీనికిగాను జరగవలసిన కార్యక్రమము అంతాగూడా యీ శాసనసభలోవున్న 196 మంది సభ్యులు నాయకత్వము వహించటానికి మంత్రివర్గమును హైదరాబాదు ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారిని కోరుతూ, యింతటితో విరమిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—

అధ్యక్షా! మన శాసనసభకు ప్రభుత్వముతరఫున యిచ్చిన తీర్మానాన్ని మనస్ఫూర్తిగా మా అందరితరఫున బలపరుస్తున్నాను. మేమందరము ఏకగ్రీవముగ "ఆంధ్రులందరిని ఏకముచెయ్యండి" అని కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతున్నాము. దానిలో ఏవిధమైన భేదాభిప్రాయాలులేవు. ఎక్కడైనా ఆంధ్రులుంటే, వారికి మన ఆంధ్రప్రాంతానికి సంబంధముంటే, వారు మాకు దగ్గరగ వుండిఉన్నట్లయితే, వారినిగూడ మా ఆంధ్రప్రాంతంలో కలిపివేసి అందరికి కలసి ఒకేరాష్ట్రంగా విశాలాంధ్ర పేరుతో ఏర్పాటుచెయ్యమని కోరుతూవస్తున్నాము. ఆంధ్రులందరికి ఒకే భాషాప్రయుక్త రాష్ట్రము కావాలని మేము మొదటినుంచి ఒక వుద్యమము ప్రారంభించి, భాషాప్రయుక్త రాష్ట్రాలు నిర్మించేసమయము వచ్చేటప్పటికి కేంద్ర ప్రభుత్వములో నాయకులందరూ ఏకగ్రీవముగ పార్లమెంటులోనైతేనేమి, బహిరంగసభలలో

1st February 1956]

SRI PILLALAMARRI VENKATESWARLU:—

నైతే నేమి విశాలాంధ్రను ఏర్పాటుచేస్తేనే మంచిదని మాట్లాడుతూవచ్చి, చివరకుఅది ఆచరణలోనికి వచ్చేటప్పటికి ఏదోరకంగా జాగుచెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. మన Deputy Chief Minister గారైన శ్రీ సంజీవరెడ్డిగారు విశాఖపట్టణములోను, యింకా అక్కడక్కడ "ఆంధ్రులందరూ నిబ్బరముతో నుండండి, విశాలాంధ్ర త్వరలోనే ఏర్పడవచ్చు రాకపోతే ఆంధ్రరాష్ట్ర ప్రజానీకమంతా కేంద్ర ప్రభుత్వాన్ని అర్థించవచ్చు" అని సలహా యిస్తూవచ్చారు. ఆసలహామీద ఆంధ్రులందరూ నిబ్బరముగ యింతవరకు వేచిఉన్నారు. విశాలాంధ్ర నిర్మాణము యింతవరకు కాలేదు. నిర్మాణము కాకపోవుటవలన మరల మనము కేంద్రప్రభుత్వానికి ఈతీర్మానముద్వారా జ్ఞాపకము చేయవలసివచ్చింది. కేంద్ర ప్రభుత్వములోనున్న High Power Committee సమావేశము అయినప్పుడల్లా విశాలాంధ్ర నిర్మాణము గురించి ప్రకటన చేస్తారేమోనని ప్రతిరోజూ, ప్రతి గంటా ఎంతో ఆతృతతో ఎదురు చూస్తూవున్నాము.

క్రిందటిసారి నెహ్రూగారు గుంటూరుకు వచ్చినప్పుడు అక్కడజరిగిన కాంగ్రెసు మహాసభలోగూడ "విశాలాంధ్ర ఏర్పాటుకు వ్యక్తిగతంగా నేను అనుకూలుడనే" అని వక్కాణించి చెప్పియున్నారు. Pandit Pant గూడ Parliament లో పెద్ద పెద్ద రాష్ట్రాలు ఉండటము మంచిదేననిగూడ చెప్తుతూ ఆంధ్రులకు పెద్దరాష్ట్రముగ తెలంగాణాని కలిపి ఏర్పాటుచెయ్యాలి అని చెప్పియున్నారు. కేంద్ర ప్రభుత్వములోనున్న అంతటి కాంగ్రెసు నాయకులు చెప్పినప్పటికిగూడ విశాలాంధ్రను ఏర్పాటు చెయ్యటములో జాగు ఎందువల్ల చేస్తున్నారో కారణము కనిపించటంలేదు. ఇంతవరకు విశాలాంధ్రను ప్రకటించకపోవటమువల్ల ఆంధ్రుల మనస్సులలో అనుమానాలు కలుగుతున్నవి. ఒక ప్రక్కన Bombay లో యిటీవల జరిగిన ఘటనలను బట్టిన్ని, ఒరిస్సాలో అన్యాయముగ చేర్చబడిన పర్లాకిమిడి చాలదనో, లేక ఆంధ్రులకు న్యాయముగ రావలసిన ఆంధ్ర ప్రాంతాలను యివ్వవలసివచ్చిందనో అనుమానాలు కలుగుతున్నవి. కాని ఏకారణమువల్లనో విశాలాంధ్ర ఏర్పాటుకు జాగుచేయటము జరుగుతున్నది అటువంటి ఘటనలు ఆంధ్రలో ఎక్కడనూ యింతవరకు జరగలేదు. ఆంధ్రులయొక్క నిబ్బరమునకు యిదే తార్కాణము. ఆంధ్రులందరు కలిసికట్టుగా విశాలాంధ్రను సాధించితీరాలని, శాసనసభయొక్క తీర్మానమువల్ల ఉద్రేకరహితముగా వేచియున్నారు. కాని యింతవరకు విశాలాంధ్ర ఏర్పాటు ప్రకటించకపోవటమువల్ల ఆంధ్రులు అక్కడక్కడ శాంతియుతముగా hartals, ప్రదర్శనలు చేస్తున్నారు. విశాలాంధ్ర రాకపోతే, ఆంధ్రులందరు ఒకే పద్ధతిలో విశాలాంధ్ర నిర్మాణమునకు కేంద్రప్రభుత్వంపై ఒత్తిడి తీసుకరావాలని విజ్ఞప్తి చేస్తున్నాను. అసలు విశాలాంధ్రకు వ్యతిరేకముగా చెప్పబడుతూన్న మాటలు ఏమిటి? ఆంధ్ర శాసనసభలో వెల్లడించినది ప్రజాభిప్రాయమే. బొంబాయి శాసనసభలో వెల్లడించినది ప్రజాభిప్రాయమే. ఒరిస్సా శాసనసభలో వెల్లడించిందికూడ ప్రజాభిప్రాయమే కాని హైదరాబాదు శాసనసభలో వెల్లడించింది మాత్రము ప్రజాభిప్రాయము క్రిందకురాదు. హైదరాబాదును

1st February 1956 ]

SRI PILLALAMARRI VENKATESWARLU:—

ధ్ర కావాలని ఎన్నడో తీర్మానించారు. ఇప్పుడూ యీవిదంగా మార్చివేయడం చాలా ఆశ్చర్యకరముగావుంది. ఆవిదంగా మార్పుచేయించుతున్న వారిమీదనే దాని బాధ్యతవుంటుంది. అదిమనమీద వుండదు. ఒకసారి విశాలాంధ్ర కావాలనీ చెప్పిన వారు మరల తెలంగాణాను కోరటములో, దీనికి బాధ్యులు ఎవరో గుర్తించాల్సి వుంది. విశాలాంధ్రను ఆంధ్రులందరికికలిపి ఏర్పాటు చేసుకుందాము మీకు ఏమేమి కావాలోచెప్పండి అని రంగారెడ్డిగారిని చెన్నారెడ్డిగారిని రామకృష్ణరావుగారిని యిక్కడ సమావేశానికి ఆహ్వానిస్తే అటువంటి ఆహ్వానాన్ని ఖాదరుచేయక, ఇక్కడికి రాకుండాపోయినారు. , ఇక్కడ ముఖ్యమంత్రిగారు, వారికి అక్కడ సమాన హోదాలోవున్న ముఖ్యమంత్రి అయిన రామకృష్ణరావుగారినిగూడా ఆహ్వానించారు. సుముఖులుగావున్న రామకృష్ణరావుగారినిగూడా సమావేశానికి రాకుండా చేశారు. ఎవరో ఏకొద్దిమందో విశాలాంధ్రకు వ్యతిరేకముగా ప్రచారము సాగిస్తున్నారుగాని యీవిధమైన ప్రచారము అక్కడి అధిక సంఖ్యాకులది కానేకాదు. ఈవిధంగా వ్యతిరేక ప్రచారము చేయడములో చాలా పొరపాటు చేస్తున్నారని అంటున్నాను. S. R. C. Report లో విదర్భగూడ ప్రత్యేక రాష్ట్రము చెయ్యవలసిందేనని వ్రాశారు. కాని కేంద్రప్రభుత్వము దీన్ని చిన్నరాష్ట్రముచేయక మహారాష్ట్రలతో కలపాలని నిర్ణయించారు. అటువంటిది తెలంగాణా మాత్రము చిన్నదైనప్పుడు దీన్ని ఆంధ్రలో ఎందుకు చేర్చకూడదు ?

ఇంకోవిషయం ఆలోచించవలెను. S. R. C. రిపోర్టులో విదర్భ ప్రత్యేక రాష్ట్రము కావలెను అన్నారు. ఆవిదర్భ రాష్ట్రాన్ని వేరేరాష్ట్రముతో కలపడానికి మధ్యరాష్ట్రం ఏర్పాటుచెయ్యడానికి అభ్యంతరంలేదు. దానకి ప్రజాభిప్రాయం అవసరంరాలేదు. కాని మనదగ్గరకు వచ్చినప్పుడు ప్రత్యేకమైన ప్రజాభిప్రాయం కావాలనడం ఎంత కంటకంగా తయారయిందో అర్థముకావడములేదు. మన ఆంధ్రులకు మొదటనుంచి అన్యాయంజరుగుతున్నదో బోధపడుతున్నది. అదే ప్రక్కనఉన్న కర్ణాటకులుకల 3 స్థానాలలో 6, 7 గురు కూర్చొనిఉన్నారు. దురదృష్టవశాత్తు మనకు కేంద్రప్రభుత్వంలో మనవిషయం ఆలోచించేవారులేరు. ఒక గుమాస్తాకూడా అక్కడలేడు. అందువల్ల మొన్నమొన్నటివరకూ వేరేరాష్ట్రం లేకపోవడం జరిగింది. ఈనాడు అన్ని రెండురాష్ట్రాలుగా ఉండేటట్లయితే ఏవిధముగా వుంటుంది. చెన్నారెడ్డి, రంగారెడ్డిగారలు కేంద్రములో పలుకుబడి కావాలంటే, తెలంగాణా అభివృద్ధి కావాలంటే ఒక పెద్ద రాష్ట్రంగా ఏర్పడినపుడే అది సాధ్యముఅని తెలుసుకోవలెను. వారు వేరురాష్ట్రం కోరుతున్నారు. అనిచెప్పేది బూటకంమాత్రం అవుతుంది అనేవిషయం దృష్టిలోపెట్టుకోవాలి. అందువల్ల ఈనాటి పరిస్థితులనుబట్టిచూస్తే విశాలాంధ్రను ఏపరిస్థితులలోను వాయిదా వెయ్యడానికి వీలులేదు. కేంద్రములో ఎవరో మంత్రులో కార్యదర్శులో ప్రక్కన చెవిలో ఊదినంతమాత్రాన నిర్ణయాలు మార్చుకుంటే పరిపాలనలో ఏవిధముగా విశ్వాసం ఏర్పడుతుంది. S. R. C. వారు సరిహద్దులవిషయం ఏమిచెప్పారు. పర్లాకిమిడి మనకుండాలి. అక్కడ తెలుగువారు 60% ఉన్నారు.

1st February, 1956 ]

PILLALAMARRI VENKATESWARLU:—

64% ఆంధ్రులు ఉన్నారు. కాని నిమొన్న పెద్దలు నిర్ణయించిందేమిటి. నూటికి 70 వుంటేగాని మార్చరట. ఎందుకన్నారు. 100 కి నూరుఅని ఎందుకు అనకూడదో నాకు తెలియదు. 64%, 60% ఉంటే ఎందుకు మార్చకూడదు. ప్రజాస్వామ్యం ప్రజాభిప్రాయం అన్నప్పుడు ఎక్కువమంది Absolute Majority వున్నప్పుడైనా దానిని కదల్చకుండా ఆరాష్ట్రములో వుండడము ఎంతమాత్రం సవ్యంగాలేదుఅని మన మంత్రివర్గం తెలియచేసింది అనుకుంటాను. ఇంకోపర్యాయముకూడా తెలియచెయ్యవలెను. ఆదేవిధముగా కోలారు, రాయచూరు తెలుగుప్రాంతాలను తీసుకొనిపోయి కర్నాటకములో కలిపేరు. ఈప్రకారము కోలారును ఆంధ్రలో కలపవలెను. బళ్ళారి కర్నాటకులదిఅన్నారు. ఏమీలేకుండా ఆంధ్రులకు గుండుసున్నా చుట్టి మనకు పంగనామాలు పెట్టడముకోసము ఈ ప్రయత్నాలు జరుగుతున్నవి. మనకు న్యాయం కలుగచెయ్యడానికి ప్రయత్నించేస్తే ఈవిధముగా అయ్యేది కాదు. S. R. C. బళ్ళారిని మనకు ఇచ్చింది. ఇదివరకు మేముచెప్పే భాషాసూత్రముమీద న్యాయముగా ఎంతవరకు రావలెనో అంతవరకు వస్తేచాలును. మొదటనుండికూడా తుంగభద్రప్రాజెక్టు హెడ్‌వర్క్సు, High Level water works ఆంధ్రప్రభుత్వం క్రిందనే ఉండవలెనని చెబుతున్నాము. దానికి అవసరమైన చర్యలు తీసుకోవలెనని మా ఉద్దేశము. మేము అన్నివిధాల సహాకరిస్తామని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాము. ఈరోజున రాయలసీమయెడల ప్రభుత్వానికిఉన్న బాధ్యతలు పూర్తిగా తెలుసును. న్యాయముగా మనకురావలసిన ప్రాంతము మనకు ఇవ్వకుండా కమిషను మనకు ఇవ్వాలని చెబుతున్నాము.

మనకు ఇవ్వకుండా తీసుకుపోయి దానితో కలపడం సహించరాని విషయం. అందువల్ల మాకు న్యాయం కలుగచెయ్యండి లేకపోతే దానితోఉన్న ప్రకారం ఉంచండి అంతేగాని అటు, ఇటు, కాకుండా వారి యిష్టంవచ్చినట్లు ఈవిధముగా మార్చవద్దు. ప్రక్కన ఎవరోచెప్పినదానిమీద ఆధారపడి ఈమార్పు తీసుకరావడం సహింపరాని విషయము, న్యాయంగా జరుగవలసినది జరగాలని విజ్ఞప్తి చేస్తున్నాం. కాని అది జరిగేట్లు ఇంతవరకు మనకు అగపడడములేదు. ఆంధ్రలో తెలంగాణా కలిసిపోతుందాఅని అంటున్నారు కొందరు. ఒకవిధముగా ఆలోచిస్తే తెలంగాణా కుపోయేది ఏమీలేదు. జాగ్రత్తగా ప్రశాంతముగాఆలోచిస్తే ఎవరికైనా తెలుస్తుంది. ముస్లిము కల్చరు ఉద్యోగములుగాని ఏదృష్టిలో పెట్టుకున్నా విశాలాంధ్ర ఏర్పడితేనే అవి సాధ్యపడతవి. ఎవరూకూడా విశాలాంధ్ర ఏర్పాటు వ్యతిరేకించరు. హైపవరు కమిటీ 4గురు పెద్దలు వ్యతిరేకించరు. ఎవరో ఏదో ఊదేరని దానిని ఆధారంగాచేసుకొని దానికి వ్యతిరేకించడం సవ్యముగాలేదు.

శాస్త్రిగారు, సహజీవనం, శాంతం, సహనం, అన్నారు. ఇవి ప్రదర్శిస్తున్నాము. విశాలాంధ్ర విషయము వచ్చేవరకు ప్రదర్శించాలనేకోరిక, ప్రదర్శించగలముఅనే ఆత్మనిగ్రహం పూర్తిగాఉంది. కాని పరిస్థితులు ఎల్లప్పుడు మన చేతులలో ఉండకపోవచ్చును. కళా వెంకటరావుగారికి తెలుసును. 1942 లో గాంధీగారు ప్రజలు వీధులలోకివస్తే చాలన్నారు. తరువాత జరిగిన వాటికి బాధ్యత ఎవరిదీకాదు.

1st February 1956 ]

SRI PILLALAMARRI VENKATESWARLU:—

అలాంటి పరిస్థితులువస్తే మనలను అనిలాభంలేదు. వెంకటరావుగారిని, సంజీవరెడ్డి గారిని అని లాభంలేదు. పైనుంచి కిందదాకా అంటే విశాలాంధ్ర ఇస్తామని చెప్పి చివరకు తుస్సుమనిపిస్తే ప్రజలలో నిరుత్సాహం, నిస్పృహవచ్చి అది ఎంతటి దారుణానికైనా దారితీస్తుందిఅని మరచిపోకూడదు. అదిమాత్రం జ్ఞాపకం పెట్టుకొనవలెను అని కోరుతూఉన్నాను. కేంద్ర ప్రభుత్వంవారు ఈ విషయాలుఅన్నీ తప్పకుండా జ్ఞాపకం పెట్టుకుంటారని ఆశిస్తున్నాను. ఆవిధముగా చెయ్యాలనికూడా కోరుతున్నాను. పాటిలుగారిని ఎవరూ రమ్మనలేదు. ఆంధ్రకు వారు రానేలేదు. C. I. D. రిపోర్టులను మనకు చూపించకుండానే పంపుతూఉంటారు. ఈవిధముగానే ఆ రిపోర్టుపైన విచారణలేకుండా వాటిని నమ్మడం న్యాయమా? ఎందుకు వచ్చాడో ఆయన ఎవరితోను చెప్పలేదు. ఆంధ్రదేశములో విశాలాంధ్రకు అనుకూలమైన వాతావరణం లేదని వ్రాసిపోయినాడు. బొంబాయిలో ఏవిధమైన వాతావరణం ఉన్నదో చూసి వచ్చేడు. పాపం చూడలేక ఇక్కడకు పరుగెత్తుకువచ్చాడు. భాషావిషయంలో ఇష్టంవచ్చినట్లు వ్రాసిపోయినాడు. బాధ్యత కల్గిన వ్యక్తి ఈవిధముగా ప్రవర్తించాడంటే అర్థములేదు. అలాంటి రిపోర్టులను బాధ్యతగలవారు ఎవరూకూడ, కేంద్ర ప్రభుత్వం సంజీవరెడ్డిగారు చెప్పినట్లు, పాటించకూడదు. ప్రజాభిప్రాయం కావలెనంటె మన శాసనసభా అభిప్రాయము ప్రజాఅభిప్రాయము లేకపోతే ఆంధ్రదేశము వచ్చి ఎక్కడికైనా గ్రామాలకువెల్లి రహస్యంగా రిపోర్టుపంపితే మాకు ఏవిధమైన అభ్యంతిరములేదు. ఈవిదముగా జాగుచేయడం న్యాయంకాదు. ఆంద్రదేశము అట్టుడికిపోయినట్లు ఉడికిపోతున్నది అని కేంద్ర ప్రభుత్వం గుర్తించవలెను. మొదట తాము వ్యతిరేకించాముని తరువాత అభిప్రాయం మార్చుకొన్నామని, పెద్ద పెద్ద కష్టాలకు అనుకూలముగా ఉన్నామని నెహూర్గారు చెప్పారు. దాదాపు మూడు కోట్లు ఉన్న ప్రజలతో రాష్ట్రము ఏర్పడుతూ ఉంటే దానికి అడ్డముపడుతూ 60, 70 లక్షల మందికి రాష్ట్రము ఇవ్వడం న్యాయంకాదు. సరిహద్దుల విషయంలో న్యాయం కలుగ చేసేవరకు మనము ఆందోళన చెయ్యవలెను అని విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రభుత్వం తెచ్చిన తీర్మానాన్ని బలపరుస్తున్నాను.

The Hon. SRI K. VENKATA RAO:—

ఉపాధ్యక్షా, ఈవేళ మా డిప్యూటీ చీఫ్ మినిస్టరు శ్రీ సంజీవరెడ్డిగారు సభ ఎదుట ప్రవేశపెట్టిన తీర్మానానికి సభలో అన్ని పక్షాలనుండి వచ్చిన ఆమోదానికి నేను ఎంతయో కృతజ్ఞుడను. మొన్న మొదటసారి ఈ తీర్మానము ప్యాసుచేసిననాడు ఉన్న స్వల్ప వ్యతిరేకతకూడ లేకుండా ఈవేళ తీర్మానాన్ని అన్ని పాంతాలలో కూడా ఏకగ్రీవముగా ఆమోదించేపరిస్థితులు ఏర్పడడము చాలా ముదావహమైన విషయము. అందుకు ప్రభుత్వం తరఫున కృతజ్ఞత తెలుపుతున్నాను. విశాలాంధ్ర విషయంలో మన శాసనసభలోనేకాకుండా ఆంధ్రరాష్ట్రం అంతటా, తెలుగువారు అన్ని ప్రదేశాలలోకూడ ఏకగ్రీవమైనట్లు అభిప్రాయము ఉన్నదని నేను స్పష్టముగ చెయ్యగలను. ముఖ్యముగా ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంఅని పిలువబడే ప్రదేశంలో నా 36 సంవత్సరముల రాజకీయ జీవితములో రెండువిషయాలమీద ఏకాభిప్రాయం కల్గింది.

1st February 1956

SRI K VENKATA RAO:—

ఒకటి భారతదేశానికి స్వరాజ్యం సంపాదించే విషయములోను, రెండవది, విశాలాంధ్ర కొరకు. ఆంధ్రరాష్ట్రస్థాపన విషయంలోను కొన్ని భేదాభిప్రాయాలు ఉండినవి. అయినప్పటికినీ అవి సర్దుకొని ఆంధ్రరాష్ట్రము సాధించుకున్నాము. కాని విశాలాంధ్ర విషయంలోనూ భారతదేశానికి స్వరాజ్యం సంపాదించే విషయములోనూ, ఆంధ్రలో భేదాభిప్రాయం లేనేలేదు. భేదభావములను మరచిపోయి ఆంధ్రులంతా ఒకేతాడు మీద నిలచేటటువంటి పరిస్థితులు వచ్చాయి. ఈరోజున ఎవరో విశాలాంధ్రవిషయమై అలసత్వమైన భావముతో చేసిన ప్రకటన చాలా అన్యాయము అయినది అనినిరూపణ చెయ్యడానికే ఈతీర్మానం పెట్టవలసిన అగత్యం ఏర్పడింది.

విశాలాంధ్ర నిర్మాణంపై ఆంధ్రరాష్ట్రంలో ఏకాభిప్రాయం ఉండడమేకాదు. ఆంధ్రరాష్ట్రంలో యీసమస్యా పరిష్కారంకోసం చాలా కేంద్రీకృతమైనటువంటి ఉత్సాహంకూడా ఉన్నది. ఏందుచేత ఊరుకున్నారు నెలనుంచి? ఆంధ్రరాష్ట్రంలో ప్రస్ఫుటమైన అభిప్రాయంలేదు అనుకునేవాళ్లు కలలుకనేవాళ్ళు అనుకోవాలిగాని యింకోమార్గంలేదు. నేను చెప్పినట్లు రాజకీయ పార్టీలేకాకుండా ప్రతిచోటాకూడా విశాలాంధ్రగురించి ఏవిధమైనటువంటి స్వల్పమైన తేడా Deputy Chief Minister గారు చెప్పినట్లు అవతల శ్రీకాకుళం చివరనుంచి ఇవతల హిందూపురంవరకు ఎక్కడా లేదు. విశాలాంధ్ర రాదేమో అనేటటువంటి భయంచేత అన్నిచోట్లా జరిగినటువంటి hartals చూస్తూంటే అణచి పెట్టబడిన ఉద్వేగం ఉత్సాహం దేశంలో ప్రస్ఫుటమవుతుంది.

కాని, నేను ఒకవిషయం మాత్రం చెబుతున్నాను. ఏపరిస్థితులలోనూ కూడా మన వెనకనున్నటువంటి, మనంప్రాతినిధ్యం వహిస్తున్నటువంటి ఆంధ్ర ప్రజలు దౌర్జన్య సహితమైనటువంటి మార్గాలలో పోకుండా చూడడం అనేటటువంటిది మనపైనున్నది. ఈసమస్యా పరిష్కారంకోసం ఏవిధమైనటువంటి కృషి చేయాలి అనే విషయం చూసుకోవాలి. నావ్యక్తిగతమైన అభిప్రాయం ఏమిటంటే విశాలాంధ్ర నిర్మాణము తథ్యమయినదని, నేను నమ్ముతున్నాను. విశాలాంధ్ర తప్పకుండా మనకు వస్తుందని నావ్యక్తిగతమైనభావం. నాదగ్గరున్న సంజాయిషీని బట్టి నాకు స్వయంగా తెలిసిన విషయాలనుబట్టి విశాలాంధ్ర తధ్యంగావస్తుందని మీఎదుట ధైర్యంచేసి చెబుతున్నాను. కాని పత్రికలలో విలేఖరుల అభిప్రాయమే వెల్లడి ఔతూంటుంది. ఆ Correspondent తెలుగువాడే కనుక అయినట్లయితే తెలంగాణ విశాలాంధ్ర అయిపోయినట్టు వ్రాస్తుంటారు. లేదా, కన్నడిగ అయినట్లయితే విశాలాంధ్ర వస్తుందిగాని బళ్లారి వెనుకలో వున్నదని వ్రాస్తారు. ఇవన్నీ మామూలు మానవ సహజమైనవిషయాలు. ఎవరినీ అనవలసిన పనిలేదు. విశాలాంధ్ర అంటే తెలుగువారికి ఏవిధమైన భావం వున్నదో సంయుక్త మహారాష్ట్రం అంటే మహారాష్ట్రులకు ఏవిధమైన భావం ఉన్నదో ఐక్యకర్నాటకం అంటె కర్ణాటకులకు ఏవిధమైన భావం వున్నదో అటువంటి అభిప్రాయం అందరకు ఉండడం న్యాయమేజరిగినటువంటి విషయాలన్నీ సమీక్ష చేసుకొని ఆదుర్దాపడడానికి ప్రత్యేకమైన ఆవశ్యకత యింకా రాలేదని మనవిచేస్తున్నాను. దీనినిగురించి నెహ్రూగారు నాగార్జున సాగర్ కు

1st February 1956 ]

SRI K. VENKATA RAO;—

శంఖుస్థాపనచేస్తూ "ఏ కృష్ణా తెలంగాణా కో ఔర్ ఆంధ్రకో అలగ్ నహీ కర్ సక్తే" అన్నాడాయన, "అలగ్ నహీకర్ సక్తే" అంటే యీ కృష్ణానది అవతలఉన్న తెలంగాణాను యివతల ప్రస్తుతంఉన్న ఆంధ్రరాష్ట్రం రెండింటినీ విడిగా వుంచజాలదని చెప్పారు. ఆయనయొక్క మనఃప్రవృత్తి తెలుసుకునే వాక్యం యిది. శ్రీ పంతుగారిని పార్లమెంటులో ఒకరు ఉపప్రశ్నఅడిగారు. విశాలాంధ్రను హెచ్చుమంది వాంఛిస్తున్నారని అన్నారు. ఆయన ప్రసంగాన్ని ఆపి మధ్యలో 'హెచ్చుమంది విశాలాంధ్రవద్దని అంటున్నారంటే' అలా నిరూపించుకునేబాధ్యత వారిమీదనే వుందని అదే ప్రశ్నను వారిమీద తిప్పికొట్టారు. ఢేబర్ గారి అభిప్రాయం పేపర్లో తమందరికీ తెలిసినదే. పలుచోట్ల వారిచ్చిన ఉపన్యాసాలలో తెలియజేశారు. వారు విశాలాంధ్రకు అనుకూలురే. ఐతే ఈవిషయమై పగం చెప్పి వదలిపెట్టారు గనుక చెప్పవలసివస్తుంది. అజాద్ గారినిగురించి అజాద్ గారు సుప్రసిద్ధులయిన దేశభక్తులు భారతదేశ స్వాతంత్ర్య సమరంలో అకళంకమైనటువంటి వారి రాజకీయజీవితం ఈవిషయాన్ని నిరూపిస్తున్నది. భారతదేశంలో స్వరాజ్యం కోసం కృషి చేసినట్టివ్యక్తి 7 సంవత్సరాలు కాంగ్రెసు అధ్యక్షత వహించి Congress High Command లో ఉన్నటువంటివారు. ఆయన ఏదో భావం మనస్సులో పెట్టుకొని విశాలాంధ్రకు అడ్డుతగులుతారని నేను అనుకోను. రెండుపార్లు నేనుకూడా వారిని చూడడం తటస్థించింది. ఆ రెండుపార్లుకూడా "సోచెంగే" అన్న ముక్క వాడేరేగాని అంతకంటే దాటివెళ్లలేదు. 'నహీ కరింగే' అనలేదు. విమర్శించలేము. ఈవేళతీర్మానం బయటకు వచ్చేదాక వున్ననలుగురిలో ఎవరిపక్షం మాట్లాడినా అపోహ కల్పించుకోవడం న్యాయమైనదవుతుందని అనుకోను. Cabinet అంటే ఒకటే తీర్మానం. ఎవరు ఏప్రక్క మాట్లాడినా చివరకు unanimous decision రావలసినదే Selct Committee లోమాదిరిగా Cabinet లో dissentin note వుండదు. India Cabinet Congress Working Committee విశాలాంధ్రకు అనుకూలమని చెప్పారు. Working Committee వారు India Government వారు ఒకేదృష్టితో వున్నప్పుడు విశాలాంధ్ర ఏర్పడకుండా చేసేయత్నాలు సఫలీకృతం ఎన్నటికీ కాజాలవని దృఢంగా నమ్ముతున్నాను. మనం ప్రజాస్వామిక సిద్ధాంతములో వుండడంవల్ల మన అభిప్రాయానికి వ్యతిరేకంగా చెప్పే హక్కు వున్నది. దేశహితైక అభిప్రాయం ఎవరికున్నప్పటికీ అదిస్వార్థపరత్వంతో కూడినదికానంతవరకు వారినిదూషించడం న్యాయంకాగు. వారికి సద్భావాన్నేఇద్దాం వారుదేశంయొక్క అభివృద్ధికోసం కృషిచేద్దాం అనే వుద్దేశంతోటే యింకో అభిప్రాయం పెట్టుకున్నారు అందాం. కాబట్టి ప్రజాస్వామిక సిద్ధాంతంలో వ్యతిరేక అభిప్రాయం చెప్పేహక్కు వ్యక్తికిఎలావున్నదో ప్రజాభిప్రాయంద్వారా ప్రాధాన్యత చేత హెచ్చు majority వ్యక్తంచేసే అభిప్రాయం minority శిరసావహించి కార్యకలాపాలలో పెట్టేటటువంటి విధికూడా యిందులో ఉన్నది. Congress Working Committee వారి తీర్మానంలో subject to the wishes of the people అన్నారు. ప్రపంచంలో ఎక్కడయినా సరే "wishes of the people" కాలవ

1st February 1956]

SRI K VENKATA RAO:—

డానికి ఏముంది? జ్వరం వస్తే కొలవడానికి Thermameter ఉన్నది. గుడ్డ కొలవడానికి గజంబద్ద ఉన్నది. చింతపండు తూచడానికి వీశెరాయి ఉన్నది. ప్రజాభిప్రాయం తెలుసుకోడానికి Thermometer ఏముంది? Elections తప్ప యింకోటేమీ లేదు. అందువల్ల యీరోజున దేశంలో వున్నటువంటి Greek City State లో లాగ ఆంధ్రరాష్ట్రంలో నున్నటువంటి రెండుకోట్ల 12 లక్షల జనంగాని తెలంగాణా లో ఉన్న 96 లక్షల తెలుగువారుగాని ఒకచోటకూడి తమయొక్క అభిప్రాయం వ్యక్తం చేయడం అనేది అసంభవమైన రాజకీయ సిద్ధాంతం. అందువల్ల ప్రాతినిధ్యం మాత్రం ప్రపంచంలోకి వచ్చింది వారందరూ కొంతమందిని ఎన్నుకొని అసెంబ్లీల ద్వారా పరిపాలించుకోవడం ప్రతిదేశంలోనూ వ్యాప్తిలోకి వచ్చింది. Subject to the wishes of the people అంటే నాలెక్కప్రకారం ఒకటే test. శాసనసభ చేసినటువంటి తీర్మానంతప్ప యింకోటిలేదు. ఇప్పుడు యీవిశాలాంధ్రకు సంబంధించినంతవరకు మొన్న మనసభలోని 196 మంది ఏకగ్రీవంగా విశాలాంధ్ర కావాలని చెప్పారు. ఇంక హైదరాబాదులో 176 సభ్యులు అక్కడున్నారు. అందులో 147 మంది గతచర్చలో మాట్లాడారు. 102 మంది విశాలాంధ్ర కావాలని మాట్లాడారు. 23 మంది మాత్రమే వ్యతిరేకంగా మాట్లాడారు. మిగిలినవారు కర్నాటకం గురించి, మహారాష్ట్రంగురించి మాట్లాడుతూ విశాలాంధ్ర గురించి చెప్పలేదు.

అయితే ఆతీర్మానం vote కు పెట్టేపరిస్థితులు లేకపోవడం మూలాన చర్చ వాయిదాపడింది. అంతమాత్రాన తెలంగాణా విశాలాంధ్రకు వ్యతిరేకంగా వున్నదని గుండెమీద చెయ్యివేసుకొని ఎవ్వరు చెప్పగలరు అని అడుగుతున్నాను. అందువల్ల People's wishes వీధులలో settle చేసుకోవడం అనేటట్లయితే counting of the heads కాకుండా breaking of the heads కనుక democracy అయినట్టయితే ఇంకో భావానికి రావచ్చు. విశాలాంధ్ర ఇవ్వక పోవడానికి యింకో కారణం చెప్పవచ్చు. "Wishes of the people" విశాలాంధ్రకు వ్యతిరేకం. అంగుచేత యివ్వడం లేదని అంటే అదిన్యాయంకాదు. సమంజసంకాదు, ధర్మంకాదు, అన్నిటికంటే ముఖ్యంగా నిజమైనదికాదు, ఇటువంటి పరిస్థితులలో దీనిగురించి అపోహపడవలసిన విషయంలేదు. ఢిల్లీలో వున్నటువంటి మన నాయకులు, Working committee లో ఉన్నటువంటివారు, ప్రజాస్వామికంలో విశ్వాసంఉన్నటువంటివ్యక్తులు. వారి Arguments విన్నపుడు జడ్జిగారు అటుయిటు మాట్లాడుతూ వుండడంతప్పను. గాని Judge గారి అభిప్రాయం చివరకు వస్తుంది. hearing లో Judge గారు తల వూపడం బట్టి judgment వస్తుందని అనుకునే లాయరులాగ బాధపడవలసిన అవసరం ఏర్పడదని నేను దృఢంగా నమ్ముతున్నాను.

ఇక్కడ జరిగినటువంటి చర్చలలో యీసరిహద్దులను గురించి కూడాకొన్ని విషయాలు చర్చకువచ్చాయి. సరిహద్దులనుగురించి ఇదివరకు అధికారములో వున్నటువంటి ప్రకాశం ప్రభుత్వంవారు పూర్ణంగా ఒక పూర్తి అయిన మెమోరాండమ్ను S. R. కమిషన్ కు యిచ్చారు. తర్వాత వచ్చిన ప్రభుత్వముకూడా దానిని ఆమో

1st February, 1956 ]

SRI K. VENKATA RAO:—

దించి, బలపరచి ఒన్నో areas ను కూడా ఆంధ్రరాష్ట్రము తరపున కోరుతున్నామని ఢిల్లీ ప్రభుత్వానికిగాని S. R. C. వారికిగాని వ్యక్తము చేయడం జరిగింది. S. R. C. report లో మనకు కొన్ని ప్రాంతాలు యిచ్చారు. కొన్ని యివ్వలేదు. ఒకభాషకు చెందినవారు 70% ఉంటేగాని ఎందుకు వీలులేదని. 60% ఎందుకు పనికిరాదని నామిత్రులు వెంకటేశ్వర్లుగారు ప్రశ్నలేశారు. పత్రికలలో వచ్చిన వార్తలను బట్టి వారు వ్రాసినది 70% basic majority గురించికాదు సరిహద్దు విషయంలో S. R. C. సిఫార్సులను మట్టుకు మాత్రము ఏవిధమైనటువంటి తేడాలేకుండగా అమలు పరచడానికి నాకు తెలిసినంతవరకూ కాంగ్రెస్ అగ్రనాయకత్వానికి ఇష్టముగనే ఉన్నదని ఉన్నది. ఇంకా తేడా ఎక్కడైనా ఉన్నట్లయితే ఒక రాష్ట్రము నుంచి ఇంకొక రాష్ట్రానికి S. R. C. కి చెప్పకుండా కనుక మార్పు కావాలంటే రెండుమార్గాలు ఉన్నాయని సూచించారు. ఒకమార్గం ఇరురాష్ట్రాలకు అంగీకారము కుదరడము ఆరకంగా వారు మనకు యిచ్చివేసి మనము వారికి యిచ్చివేసుకున్న దానికి అభ్యంతరము ఎవరు చెప్పమని చెప్పుతున్నారు. రెండవ మార్గమేమిటంటే వారు ఇక మార్పిడి తప్పదని చెప్పి ఒకపార్టీగనుక పట్టుపట్ట దలచుకొన్నట్లయితే S.R.C. report కు against గా ఒకేభాషవారు 100 కి 70 మంది జనాభా వుంటేనే మేము కలుగజేసుకుంటాము. లేకుంటే కలుగజేసుకోము అని చెప్పుతున్నారు. దానిలో న్యాయమున్నది. ఎందుకంటే ఇద్దరు దెబ్బలాడుతున్నపుడు S. R. C. recommendation తీసుకున్నపుడు 70% ఉంటేకాని మార్చమని చెప్పడములో న్యాయమున్నదనే నాయొక్క అభిప్రాయము. మనము కేసుదగ్గర పెట్టుకొని law సృష్టిచేస్తామంటే నడువదు. మనకోర్కెలు చాలావున్నాయి. అవతలేమో కన్నడిగలు majority వున్నారని మనము అంగీకరించినటువంటి Hospet, Siriguppa Bellary తాలూకాలు మనకు రావాలి. ఉత్తరాన పర్లాకిమిడిలో తెలుగువారు ఎక్కువ వున్నారు గనుక అదిమనకు కావాలి. సిద్ధాంతానికి దేనికో ఒకదానికి మనముకూడా ఒప్పుకోక తప్పదు. పర్లాకిమిడికోసము ఇప్పటివరకూ యీనిమిషము వరకూ పోరాటము చేస్తూనే వున్నాము. దానికి సంబంధించిన కృషి అంతా జరుగుతుంది బళ్లారిగురించికూడా జరుగుతుంది. ఇదేమో భాషాప్రయుక్త రాష్ట్ర విభజన కోసము భాషాప్రాతిపదికమీద చేసినటువంటి విభజన అయినట్లయితే మన case సరి అయినదే. కాని వారు ఇచ్చిన terms of reference లో నీ భాష ఒక్కటే కాక పరిపాలనా సౌకర్యముఆర్థిక పురోభివద్ధికూడ కలిపారు అందువలవ మన ఆర్థిక పురోభివృద్ధికీ, భాషకు, పరిపాలనా సౌకర్యానికి అన్నీకలిపి అడిగినాము. మన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ తరఫున యిచ్చినటువంటి memorandum లో బస్తర్ చుట్టు 25 మైళ్ళ వరకూ వున్న ప్రాంతాన్ని అధమపక్షము మనకు యివ్వాలని అడిగాము. కారణమేమిటంటే ఇంద్రావతి, ప్రాణహిత శబరి, నదుల ముఖద్వారాలవద్ద బస్తర్ రాష్ట్రము వున్నది కనుక యీనదులపై గట్లు కట్టుకుందామంటే ఇంకొక రాష్ట్రములోని ప్రాంతం మునిగితే తగవు పెట్టుతారు గనుక మన ఆర్థిక పురోభివృద్ధి కోసము అదికావాలని అడిగాము. మనకు తుంగభద్రానది రాయలసీమకు జీవనది ఇంకొకనదివుంటే దెబ్బలాడము. పెన్నలో పాలుకు 18 రోజులు మాత్రమే నీళ్లు

SRI K. VENKATA RAO:—

ప్రవహిస్తాయి. అందువల్ల జీవనది కావాలంటే తుంగభద్ర తప్ప ఇంకొకటి దిక్కు లేదు. అందువల్ల మనకు ఆర్థికపురోభివృద్ధికి, పరిపాలనా సౌకర్యానికి బళ్లారినుంచి హాస్పేట, మల్లాపురంవరకు గల ప్రాంతాన్ని కావాలని కోరాము. దీనికి S.R.C. వారు అంగీకరించారు. నాకు తెలిసినటువంటి తీర్మానమునుబట్టి మనకూ, మైసూరు ప్రభుత్వానికీ వివిధమైన రాజీకుదరకపోయినట్లయితే కేంద్రప్రభుత్వంవారు యింతవరకూ అనుసరిస్తున్న సిద్ధాంతాలనుబట్టి హాస్పేట, సిరిగుప్ప, బళ్ళారితాలూకాలతో కూడినటువంటి తుంగభద్రాప్రాజెక్టు మనకు పూర్తిగాయిస్తారని తెలుస్తుంది. లేదా వాండ్లకు, మనకు రాజీకుదిరి ఇంకొక చోటు మనము పుచ్చుకొని, సంజీవరెడ్డిగారు, ఇతర మిత్రులు సూచించినట్లు తుంగభద్రా High level channel మీద control. ఆనకట్టమీద control తర్వాత బళ్ళారి పట్టణము దానికి తూర్పునవున్న రూపన్గుడి మోకా ఫిర్కాలమీద యాజమాన్యము మనకు యిచ్చినట్లయితే మనము రాజీబడడానికి సిద్ధముగావున్నాము. ఇదికనీసమైన కోర్కె, లేదా వారు దానికికూడా అంగీకరించకపోయారా మనకు రావలసిన మూడుతాలూకాలు వచ్చితీరాలి, ఇండియా అంతటికి ఒకసిద్ధాంతముపెట్టి ఒక్కబళ్ళారి సరిహద్దుకు మాత్రముఇంకొక సిద్ధాంతములోనికి వెళ్లుతారని, నేను అనుకోను. ఇప్పుడు దక్షిణ ప్రాంతాలగురించి గూడా మద్రాసు వాండ్లను, మనలను రాజీచేసుకొని రిపోర్టు యివ్వమన్నారు. దీనినిగురించి S. R.C. ఎటువంటి recommendation యివ్వలేదు. Government of India వారు ఏమి చెప్పలేదు. Congress working committee ఏమి చెప్పలేదు. అందుచేత రెండు ప్రభుత్వాలు కలసి దీనిని గురించి సంప్రదింపులు జరుపుతూవున్నాయి, సంప్రదింపులు వుంటే భేదాభిప్రాయాలు వుండకతప్పదు. భేదాభిప్రాయాలతోటి విడిపడడం జరిగింది. మళ్లీ అందరూకలసి మాట్లాడుకోవచ్చును, మాట్లాడుకుందాము. ఒకేభాషవారి జనాభా 100-కి 70 చొప్పున వుంటేనేగాని ఆప్రాంతం ఒక రాష్ట్రంలోనుంచి మరొకరాష్ట్రానికి మారదనేది క్రొత్త సిద్ధాంతముగనుక ఐనట్లయితే తిరుత్తనిఆవతలికి వెళ్ళదు, చెంగల్పట్టు ఇవతలకురాదు. అవ్వా, బువ్వా రావు అందువల్ల మనము ఇప్పుడు వారితో చర్చచేసుకోవాలి. ఇందాకా నా మిత్రులు సంజీవరెడ్డిగారు చెప్పినట్లు 35 లక్షలు తెలుగువారు మద్రాసు రాష్ట్రంలోవుండితీరాలి. మనమువారిని తీసుకురావడానికి ఎక్కడా త్రోవలేదు. మనకూ వారికీ ఎక్కడా contiguity లేదు. తమిళ సోదరులు ఇప్పుడున్న ఆంధ్రరాష్ట్రం సరిహద్దుల ప్రకారము రెండులక్షలకంటే ఎక్కువలేరు. ఈమధ్య సంతానాభివృద్ధి ఎక్కువైందేమో తెలియదు. 35 లక్షలమంది అక్కడా 2 లక్షలమంది ఇక్కడా ఉంటారు. అందువలన హిందూదేశము మొత్తము మీద లెక్కవేశామంటే 350 లక్షలమంది తెలుగువారున్నారు. సిమ్లాదగ్గరనుంచి

SRI K VENKATA RAO:—

కన్యాకుమారివరకు యీ తెలుగు జాతియొక్క అదృష్టమేమో నాకు తెలియదుకాని ఆ పూర్వకాలపు రాజులు ఎపుడు పాలించారో గాని మనవాండ్లు మాత్రము ఏమూలకు వెళ్లి చూచినా ఒక్కడైనా తెలుగువాడు కన్పిస్తాడు. ఆఖరుకు కాలికట్ పట్టణంలోకూడా ఒకటివుంది. ఎక్కడ నల్లరేగడి నేల కన్పిస్తుందో అక్కడంతా తెలుగువారు ఉంటారు.

దక్షిణాదిన ఏఊరిలోకూడా నాయుడుగారో, రెడ్డిగారో వుండితీరుతారు. సరే పౌరోహిత్యానికి మేము దేశమంతటా వుండనేవుంటాము. మనవిస్తరణ ఎక్కువగావున్నది కాని contiguity వలన ఒకే ప్రదేశములోనికి తీసుకరాగల్గినటువంటి తెలుగువాండ్లు సుమారు 3 కోట్లు ఉంటారని ఆశిస్తున్నాను. అందువలన యీ విశాలాంధ్రకు పర్లాకిమిడి ఐతేనేమి, బస్తర్ అయితేనేమి, బళ్లారి ఐతేనేమి కోలార్ ఐతేనేమి, హోసూరు అయితేనేమి, పాన్నేరి, తిరుత్తణ్ణూరు తాలూకాలు ఐతేనేమి, ఇన్నిచోట్ల సరిహద్దు సమస్యలను అన్నీ పరిష్కారము చేసుకోవలసియున్నది. దీనివిషయములో మనకు ఆందోళన వుండవలసిన అవసరములేదు. పోతే నెహ్రూగారిlatest statement జ్ఞాపకము తెచ్చుకొండి దానిలో యీ వేళ ఇబ్బంది పెట్టకండి అది final కాదు, ఇది subject to adjustment అని ఆయనే చెప్పుతున్నారు. అందువల్ల ఏమైనా స్వల్పమైనటువంటి అన్యాయము జరిగినా దాని adjustment కోసము మనమందరము కలసి కృషిచేసి దిద్దుకోవడానికి వీలు వౌతుంది. ఈ పరిస్థితులు తమ అందరికీ తెలిసినదే. అఖరు విషయము నేను ఒక్కటే చెప్పదలచుకొన్నాను, నామనవి ఢిల్లీలో వున్నటువంటి పెద్దలకు ఏమిటంటే మధ్యభారత్, వింధ్యప్రదేశ్, భోపాల్ (భోపాల్ మన కర్నూల్ జిల్లాలో సగము వుంటుంది.) రాష్ట్రాలయొక్క ప్రధాన మంత్రులు మాకంతా కలిపి ఒకటే రాష్ట్రము కావాలంటే యిచ్చారు. హైదరాబాద్ ప్రధానమంత్రి ఆంధ్ర ప్రధానమంత్రి ఇద్దరుకూడా కలసి మాకు విశాలాంధ్ర కావాలని అన్నట్లయితే దీనికి వ్యతిరేకమైన argument ఏమిచెప్పగలరని అడుగుతున్నాను. హైదరాబాద్ ప్రదానమంత్రి హైదరాబాదు శాసనసభయొక్క విశ్వాసాన్ని కోల్పోయాడా? హైదరాబాదు శాసనసభయొక్క పూర్ణ విశ్వాసము రామక్రిష్ణరావుగారిలో వుంది. తెలంగాణా పూర్ణవిశ్వాసము ఆయిన దగ్గరవుంది. నేను ఎందుకు చెప్పావంటే 102 మంది విశాలాంధ్రకు అనుకూలంగా మాట్లాడినసభ్యులలో తెలంగాణా శాసనసభ్యులు మూడింట రెండు వంతులు, ఇంకా హెచ్చుమంది నాలుగు భాగాలలో మూడుభాగాలు విశా

SRI K. VENKATA RAO:—

పించగలము. ఆంధ్రరాష్ట్రం సస్యశ్యామలము ఆంధ్రరాష్ట్రములో ఉన్నటువంటి వ్యవసాయికాభివృద్ధికి అవకాశాలు Indo gangetic ప్లయినులోకూడా లేవు. అటువంటి సృష్టిని ఆమోదించి యీవిశాలాంధ్ర రాష్ట్రంయొక్క స్థాపనకు అందరుకూడ తోడ్పడుతారని నేను ఆసిస్తున్నాను. మీ అందరియొక్క ఆశీర్వచనం వుంటే విశాలాంధ్ర కొద్దికోజుల్లోనే ఉద్భవిస్తుంది. అంములో ఆవిశాలాంధ్ర ఉద్భవించే నాటికి నాఅంచనా ప్రకారం నేనుకూడా ఢిల్లీలోవుండే పరిస్థితి యేర్పడుతుందిఅని చెపుతూ యీతీర్మానాన్ని అందరు ఆమోదించవలసిందని కోరుతున్నాను. (కరతాళ ధ్వనులు.)

MR. DEPUTY SPEAKER:—

I shall now put the resolution to the Vote of the House. The question is:

This Assembly notes with regret that the Government of India have not yet announced their decision on the merger of Andhra with the Residuary Hyderabad. The wishes of the people were amply given expression to by people's representatives in Hyderabad and in Andhra. In the Andhra Assembly the resolution was passed NEM CON, and that represents the unanimous view of the Andhras. Even in the Hyderabad Assembly quite a large number of people spoke in favour of Visalandhra. The Andhra opinion is not casual in asking for Visalandhra. They are determined to get all the Telugu speaking people under one Administrative set up.

This Assembly hireby reiterates its previous resolution dated 25th November 1955 and requests the Government of India to implement the resolution and announce their decision early.

The resolution was carried *nem con* amidst applause.

The House then adjourned for the day to meet again the n[illegible] day at 1 p. m.